ఏవియం వారి

# బామ్మ మాట బంగారు బాట



రాజశేఖర్

జంధ్యాల - వేటూరి

చంద్రబోస్




M.శరవణన్ M.బాలసుబ్రమణియన్ M.S.గుహన్




ఫిబ్రవరి 'చతుర'లో ప్రచురితమైన సరోజా నారాయణరావ్‌గారి నవల 'వానప్రస్థం'పై మాకు అందిన సమీక్షలలో ఉత్తమంగా ఉన్న ఆరింటిని ఈ సంచికలో ప్రచురిస్తున్నాము.

## అభినందనలు

*(ప్రథమ బహుమతి రు. 100/- పొందిన సమీక్ష)*

**రాజకీయాలకో** లేక థ్రిల్స్‌కో సంబంధించిన ఇతివృత్తాలమీదే ఎక్కువ సాహిత్యోత్పత్తి జరుగుతున్న ఈ రోజుల్లో, కన్నబిడ్డలతోబాటు రచయిత(త్రు)లు కూడా నిర్లక్ష్యం చేస్తున్న వయోవృద్ధుల హృదయవిదారక సమస్యను ఎన్నుకొన్నందుకు రచయిత్రి అభినందనీయురాలు.

కేవలం ఉదాత్తమైన ఇతివృత్తాన్ని చేపట్టడమేగాకుండా, అందుకో పరిష్కార మార్గాన్ని సూచించడం, ఆ మార్గంలోని సాధకబాధకాలను చర్చించడంవల్ల నవలకు పరిపూర్ణత చేకూరింది.

ప్రధానపాత్ర యశోద సూచించిన మార్గం కేవలం ఆదర్శప్రాయంగానేకాకుండా, ఆచరణాత్మకంగా కూడా వుంది. "చుట్టూవున్న చీకటిని నిందిస్తూ కూర్చునేకంటే ఒక చిన్నదీపాన్నైనా వెలిగించడం మంచి"దన్న నిర్మాణాత్మక సిద్ధాంతాన్ని ఆ పాత్ర అమలు జరిపిన తీరు ప్రశంసనీయం.

ఆదర్శాలు అమలు జరిపేందుకు అవసరమైన సహకారం అందించే సహచరులు లభించడం కూడా ముఖ్యమని "జగన్నాథం" పాత్ర ద్వారా తెలియజేశారు. అలాగే పేరుప్రతిష్ఠలకోసం, ప్రచార ఆడంబరాలకోసం సాంఘిక సేవారంగంలో ప్రవేశించే కుహనా సంఘసేవకులకు "ఢిల్లీ వొదిన" పాత్ర మంచిఉదాహరణ.

వృద్ధాప్యంలో పెద్దలను నిర్లక్ష్యం చేయకూడదని యువతరానికి ఉద్బోధిస్తూనే, మరోవైపు తరాలమధ్య అంతరాన్ని గుర్తించమని వృద్ధులకు కూడా సూచించడంవల్ల సందేశానికి సమగ్రత చేకూరింది.

అయితే, ఇతివృత్తంలోని ఉదాత్తతను నవ

ముఖచిత్రం: ఉమ

లలో చక్కగానే పోషించినా, సన్నివేశకల్పనలో ఆర్ద్రత కొరవడినందువల్ల కొన్నిచోట్ల నవల "డాక్యుమెంటరీ"లా తయారైంది. అలాగే, ప్రధాన సమస్యకు అంతగా సంబంధంలేని మోహనరావు నటజీవిత చిత్రణ మరీ సుదీర్ఘంగా సాగింది.

అంకితభావం, సేవాతత్పరత వుంటే కనీస వనరులతో, పరిమితస్థాయిలోనే ఐనా ఒక సామాజిక సమస్యను ఎలా పరిష్కరించవచ్చో తెలియజేసిన "పాజిటివ్" దృక్పథం "వానప్రస్థం" నవలలోని విశేషం.

-పసుపులేటి మునిరాజా
నర్సరావుపేట

## విషాదభారతం

*(ద్వితీయ బహుమతి రు75/- పొందిన సమీక్ష)*

**నే**ను చదువుకొనేరోజుల్లో, అంటే సుమారు ముప్పయి సంవత్సరాలక్రితం, పాఠశాల గోడల మీద అందంగా కొన్ని సూక్తులు రాయబడి ఉండేవి- గురువును గౌరవించుము, తల్లిదండ్రులను ప్రేమించుము, తల్లినిమించిన దైవం లేదు అంటూ. గుణింతాలు నేర్చుకొనేట ప్పట్నుంచీ వాటిని కూడబలుక్కుని చదువుకొనేవారం. నిరంతరం ఆ సూక్తులు కళ్లబడుతూ ఉంటే మనస్సుల్లో అవి శాశ్వతంగా ముద్రితమయ్యేవి. తెలుగువాచకాల్లో "తల్లిదండ్రులందు దయలేని పుత్రుండు పుట్టనేమి వాడు గిట్టనేమి...." వంటి నీతిపద్యాలు ఎన్నో ఉండేవి. అవి ఇప్పటికీ నిరంతరం మనసులో మెదులుతూనే ఉంటాయి.

ఇప్పటిలా అప్పుడు పరిశ్రమలూ, ప్రాజెక్టులూ, అధికోత్పత్తులూ ఏమీలేవు. ఆర్థికంగా దేశం చాలా వెనుకబడి ఉండేది. అయినాగానీ కుటుంబవ్యవస్థ పటిష్టంగా ఉండేది. ఆరోజుల్లో వృద్ధులపోషణ భారంగాకాక బాధ్యతగా ఉండేది అందరికీ.

"వానప్రస్థం" నవల చదువుతుంటే కళ్లముందొక విషాద భారతగాథ చూస్తున్న అనుభూతి కలిగింది. గుండెలు పిండివేస్తున్నంత బాధ! అనువాద నవల అయినా, రచన చక్కగా సాగింది. 'ఏ ప్రాంత చరిత్ర చూసినా ఏమున్నది గర్వకారణం- నరజాతి చరిత్ర సమస్తం స్వార్థసంకుచితత్వకళంకితం'- అని పించింది. మధ్యమధ్య వచ్చిన వృద్ధుల పూర్వచరిత్రలు కథాగతికి కొంత ఆటంకం కలిగించినా, కథలోని ఉదాత్తతముందు అదొక లోటుగా కనబడదు.

ఒక్కమాటలో చెప్పాలంటే ఆ నవల నా హృదయగత అస్పష్టభావాలకు, ఆవేదనకు అక్షరరూపం. ఇలాంటి నవలలు ఒకటిరెండు చాలవు పుంఖానుపుంఖాలుగా రావాలి. యువకుల కళ్లు తెరుచుకోవాలి. అవునుమరి, పిల్లలకు యింటివద్ద మనం నేర్పం- పెద్దలను గౌరవించడం; స్కూల్సులో ఇరవై ఒకటో శతాబ్దపు చదువులు తప్ప యిలాంటి 'ఛాందసభావాలు' నేర్పరు- సమాజాన్ని చైతన్యవంతం చేయవలసిన బాధ్యత రచయితలకయినా గుర్తుండటం ముదావహం.

రచయితలు జాతీయ, అంతర్జాతీయ సమస్యల గురించి రాయడంకంటే, ముందు మనిషికీ మనిషికీ మధ్య ఉండవలసిన అవగాహన గురించీ, కొరవడుతున్న మానవత్వపు విలువల గురించీ రాయడమే అభిలషణీయం.

కన్నడ మూలకర్తకు, తెలుగు అనువాద రచయితకు ధన్యవాదాలు.

-డాక్టర్ వాడవల్లి చక్రపాణిరావు,
అమలాపురం.

## చక్కని పరిష్కారం

*(తృతీయ బహుమతి రు.50/- పొందిన సమీక్ష)*

**మా**నవ జీవితంలో బాల్య, కౌమార, యవ్వన దశలు ఏదోవిధంగా గడచిపోతాయి. వాటితోపాటు శక్తి, యుక్తి, సామర్థ్యం ఉడిగిపోగా, ఎవరూ తప్పించుకోలేని వృద్ధాప్యదశ ఎదురౌతుంది. ఈదశలో ఒక్కొక్కరికి ఒక్కొక్కస్థితి తారసిల్లుతూవుంటుంది. వారి వారి బిడ్డల స్థితిగతులు, మనస్తత్వాలు, ఆర్థికవత్తిళ్ళు ...ఎన్నో ఇవేకాకుండా నానాటికి అత్యంత వేగాన్ని అందుకొంటున్న తరాల అంతరం. మార్పులను తట్టుకోలేని పాతతరం; పాతతరాన్ని సానుభూతితో అర్థం చేసుకోలేని కొత్తతరం. ఫలితంగా వృద్ధాప్యం ఓ శాపంగా ...మారిపోతోంది.



'వానప్రస్థం'లోని వెంకటరావు, మోహనరావు, నాగమ్మ, వేదమ్మ, శంకరశాస్త్రి, రాజారావు, పరమశివయ్యర్, సులోచన వీరందరు వివిధ కోణాలలో మనముందు నిలచే 'తరం చెల్లిన' వ్యక్తులు. వీళ్ళందరు మనకు ఎక్కడో, ఎప్పుడో కన్పించినట్లే అన్పిస్తుంది. వాళ్ళు కథలో పాత్రలుగా కాకుండా, మనకు సుపరిచిత వ్యక్తులుగానే అనిపిస్తారు.

ఈ సమస్యా చిత్రాల్ని దాని తీరుతెన్నుల ను 'వానప్రస్థం'లో సరోజా నారాయణరావుగారు ఎంతో స్పష్టంగా మనముందుంచారు.

అంతేకాదు. ఆ సమస్యకు పరిష్కారాన్ని కూడా సూచించారు. చంద్రునికో నూలుపోగులా తమవంతుగా, ప్రతివారు చేయవలసినది- చేయగల్గింది మనకు స్ఫురింపజేశారు.

ద్వాపరయుగంలోని యశోద మాతృమూర్తికి ప్రతీక. ఈ యశోద అలసిసొలసి చివరి మజిలీ చేరిన జీవనయాత్రికులకు మాతృమూర్తి.

స్ఫూర్తి నందించటం ఉత్తమసాహిత్య ప్రయోజనం ఈ నవల ఆ ప్రయోజనాన్ని సాధించింది.

రచయిత్రి సరోజానారాయణరావుగారికీ, చక్కని తెలుగుసేత నెరపిన ఉమాదేవిగారికీ అభినందనలు.

-ఎ.రాధారుక్మిణి
నరసరావుపేట

## నాణానికి మరోవైపేదీ?

*(రు.25/- బహుమతి పొందిన సమీక్ష)*

ఉత్తమ సాహిత్యం సమాజానికి దర్పణంలాంటిది.అది వ్యక్తుల్లోని,వ్యవస్థలోని మంచి చెడులను, కలతలను కన్నీళ్లను, సుఖాలను ప్రతిబింబిస్తుంది అలాంటి సాహిత్యం. అలాంటి రచనలు చేయడానికి రచయితకు ఎంతో నిజాయితీ వుండాలి.

సాధారణ పరిశీలకుల దృష్టికి అందని సున్నితమైన చీకటికోణాలను ఏరి మరీ ఎన్నుకొని వెలుగుసారించి, బాటచూపించి ఒక ఆదర్శనీయ వ్యవస్థ నిర్మాణానికి జాతిలో జాగృతిని కలుగజేస్తాయి కొన్ని రచనలు. "వానప్రస్థం" ఈకోవకు చెందుతుంది.

"మనిషి వార్థక్యంవల్లా, అశక్తుడైనందువల్లా పడే మానసిక వ్యాకులత... ఆర్థిక పరాధీనత" నవలలో చర్చించబడిన కథాంశం. హింస, నేరస్థుల జీవితాలూ, లైంగిక ఉన్మాదాలూ, కాల్పనిక క్షుద్రతంత్రాలూ, జూదాలూ నవలల్లో కథావస్తువులుగా చోటుచేసుకుంటున్న తరుణమిది. ఈ వాతావరణంలో ఉద్రేకాలకు, క్షుద్రవర్ణనలకూ తావులేని కథావస్తువు ఎన్నుకోవడం సాహసం.

యశోద మరణం పాఠకుల మనసుమూలల్లో మాటలకందని ఒక నిర్వేదాన్ని పుట్టించి నిశ్చేష్టుల్ని చేస్తుంది. అలాగే నవల చివరలో జగన్నాథం ఒంటరిగా వానప్రస్థం చేరుకోవడం అద్భుతమైన మరోమలుపు.

రసస్ఫూర్తివున్న గ్రాహకులందరూ "వానప్రస్థం"లోని ఏదో ఒక పాత్రలో తమని తాము చూసుకుని తాదాత్మ్యం చెందుతారు. ఈ సార్వజనీనత ఒక అసాధారణ సాహిత్యశిల్పం.

వానప్రస్థంలోకి వచ్చి చేరే వయోవృద్ధుల్లో చాలామంది వారి వారి సంతతిచే నిర్దయగా ఉపేక్షించబడినవారే అయినా ఈ నాణానికి మరోవైపు చూస్తే వయసు తెచ్చిన విచిత్ర చిత్తప్రవృత్తులమూలంగా ఎంతో సౌమ్యమైన కుటుంబపరిసరాల్లో కూడా ఇమడకుండా ఇబ్బందులుపడే సులోచనలాంటివారు కూడా వున్నారు. వీరినిగూర్చి మరింత వివరంగా రాసివుంటే బాగుండేది.

-సి. పద్మలత
కడప

## కొందరైనా మారవచ్చు

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

నేటి నవీనయుగంలో, జెట్‌స్పీడ్‌తో సాగిపోతున్న మానవాళి జీవితగమనంలో, తమ బతుకు, తమ సుఖసంతోషాలు, తమ పిల్లలు- అన్న ఆలోచనతప్ప తమను పెంచి పోషించి సమాజంలో ఒకస్థానం కల్పించిన తల్లిదండ్రులను గూర్చి ఆలోచించేవారెందరు?

సరోజ నారాయణరావ్‌గారి నవల "వానప్రస్థం" చదువుతున్నంతసేపు మనసులో ఏదో మూల ఓ చిన్నబాధ మొదలై, నవల ముగిసి, యశోదగారి భర్త జగన్నాథంగారు రాత్రివేళ





ఒంటరిగా తమ సామానుచేతబట్టి 'వానప్ర స్థం'లోకి అడుగుపెట్టేసరికి గుండె బరువెక్కి ఎన్నెన్నో ఆలోచనలతో హృదయం నిండిపో యింది.

ఈనాటి యువతీయువకులు వార్ధక్యంలోని తమ తల్లిదండ్రుల, అత్తమామలపట్ల ఎంత నిర్దయగా ప్రవర్తిస్తున్నదీ మనం రోజూ చూస్తు న్నాం... వింటున్నాం. అవకాశాలు వుండి కొంద రు, అవకాశాలులేక కొందరు హాయిగా విశ్రాంతిగా కూర్చోవలసిన వయసులో ఉన్న ఆ ముసలిప్రాణాలను ఎంతగా చిత్రహింసలకు గురిచేస్తున్నారో తెలియని విషయంకాదు. విషయం పాతదే, కాని దాన్ని గూర్చి ఆలో చించేది ఎందరు? కాలక్షేపానికి మాత్రమేకాక ఈ నవల కొందరిలోనైనా మార్పు తప్పక తెస్తుందని చెప్పవచ్చు.

ప్రతిరాయి రప్పలోను ఓ గాథను వీక్షించే రసహృదయాలకుసైతం అర్థంకాని, ఎన్నెన్నో కలతల కన్నీళ్లు ప్రతి 'ముదుసలి' హృద యంలో నిక్షిప్తమై వుంటాయి. వాటికి ఓ రూప మిచ్చి వారి బాధలను గాథలుగా మలిచిన సరోజ నారాయణరావ్‌గారు అభినందనీయు లు.

-పి.వి.సుబ్బారెడ్డి
నూతిమడుగు

## వాస్తవానికి ప్రతిబింబం

*(రు. 25/- బహుమతి పొందిన సమీక్ష)*

నైతిక విలువలు నామమాత్రంగా వున్న ఈనాటి సమాజంలో వయసుడిగినవాళ్ళ సమ స్యకు చక్కటి పరిష్కారం 'వానప్రస్థం'. పిల్ల లూ, అండదండలూ లేనివాళ్లకు వేదమ్మ నాగమ్మ, మోహనరావులు ప్రతీకలైతే నర సింహారావు, వెంకట్రావు, అయ్యరు, మృ త్యుంజయశాస్త్రి ఆసరా కావలసిన వయసులో కన్నబిడ్డలకే కంటకమైన వర్గానికి ప్రాతినిధ్యం వహిస్తారు.

ఈ పరిష్కారం ఊహాజనితంగానో, కృత్రి మంగా కాక వాస్తవికంగా వుండటం కోసం రచయిత్రి తీసుకున్న శ్రమ అమోఘం. ఆ విషయం యశోద పాత్రద్వారా వెల్లడి అవు తుంది. ఎంతో జాలి, దయ వున్నప్పటికి నిరు పేదలను, దీర్ఘవ్యాధిగ్రస్తులను వానప్రస్థంలో చేర్చుకోకపోవడం ఆమె వాస్తవిక దృక్పథానికి దర్పణం. వానప్రస్థ సక్రమ నిర్వహణకు ఆలంబన.

వానప్రస్థాశ్రమంలో చేరిన ప్రతివారికి ఓ జాలికథ వుండటం సహజమే. అయినప్పటికీ వారి వృత్తాంతాలను చెప్పినవిధం కొంతవరకు కృతకంగా వుంది. అయితే ఈ నవలా ప్రయో జనాన్ని దృష్టిలోపెట్టుకుంటే అదేమీ పెద్దలో వంకాదు.

అయ్యర్‌గారి అల్సేషియన్ "బహద్దూర్" ద్వారా రచయిత్రి చక్కటి ప్రయోజనాన్ని సాధించారు. బహద్దూర్ దాని యజమాని అయ్యర్ మరణించిన తరువాత సరిగా తిండి తినక కృశించి మరణించడం దాని విశ్వాసాని కి, ప్రభుభక్తికి నిదర్శనమైతే, అయ్యర్ కొడుకు అతన్ని పట్టించుకోకపోవడం కన్నబిడ్డలలోని కర్కశత్వానికి చిహ్నం.

మోహనరావు పాత్ర ప్రఖ్యాత రంగస్థల నటుల జీవితవైభవాన్ని వారి అవసానదశ లోని కష్టాలను, కళకోసం పడే శ్రమను, వారి వేషభాషలపై వారు వేసిన పాత్రల ప్రభావా న్ని తెలియజేస్తుంది.

నవలలో జగన్నాథంగారికి అంత ప్రాముఖ్య తనిచ్చినట్లు కన్పించనప్పటికీ అతను భార్యకి చ్చిన ధైర్యం, ప్రోత్సాహమే యశోద వానప్రస్థా శ్రయ నిర్మాణానికి ప్రేరణ అన్న విషయం గమనించదగ్గది.

వానప్రస్థ కార్యక్రమాలవల్ల యశోద తన భర్తకుగాని, పిల్లలకుగాని ఏ విధమైన ఇబ్బంది కల్గకుండా చూసుకోవాలనుకోవడం ఆమె అనురాగానికీ, మాతృప్రేమకు అద్దంప డతాయి. ఆశ్రమాన్ని సమర్థవంతంగా నిర్వ హిస్తూ శ్రీదేవి వదినలా సోషల్‌వర్క్ పేరుతో ఏ లాభాలను ఆశించకపోవడం ఆమె ఔన్నత్యా న్ని చాటుతుంది.

ఆమె మరణంతో జగన్నాథంగారు కూడా వానప్రస్థంలో చేరడం "వానప్రస్థం" ప్రాము ఖ్యాన్ని తెలియజేస్తుంది. పూర్తిగా సామాజిక ప్రయోజనాన్ని దృష్టిలో పెట్టుకుని రాసిన నవల.

-వై.బి.రావ్
హైదరాబాద్



wn...ఏ నోట విన్నా...Talk of the town...ఏ నోట విన్నా...Talk of the town

# విపుల

ఈరోజు కాలేజి డిబేట్ లో ఇతర ప్రాంతాల్లోని జీవన విధానంగురించి అంత బాగా ఎలా మాట్లాడగలిగావ్?

నేను 'విపుల' పాఠకురాలిని: ప్రతి నెలా దాదాపు పదిహేను భాషల కథల్ని, ఆయా జీవన విధానాల్ని తేటతెలుగులో చదివే అవకాశాన్నిస్తుంది 'విపుల'



# యథార్థ గాథలు



## రేప్ - హత్య

అది ఓ చిన్న పల్లెటూరు. ఆ ఊరి ప్రజలలో ఎక్కువమంది అట్టడుగువర్గాలకు చెందినవారు...కటికపేదలు. కావడానికి దాదాపుగా అందరివృత్తీ వ్యవసాయమే. అయినా పండీపండని మెట్టపొలాల్లో రేయింబవళ్ళు రెక్కలు ముక్కలుచేసుకున్నా డొక్కలు నిండటంలేదువారికి. దారిద్ర్యం వారిబతుకుల్లో విలయతాండవం చేస్తోంది. అలాంటి ఊరికి మకుటంలేని మహారాజు భీమసింగ్. అతనిమాటే అక్కడ శిలాశాసనం. ఎదురుచెప్పినవాడికి మెతుకు, బతుకు రెండూ ఉండవు. భూములు రైతులవే అయినా పంటమీద సర్వాధికారాలూ అతనివే! కారణం...ఆ బక్కప్రాణులకి అవసరంలో అధిక వడ్డీకి అప్పులిచ్చి పండిన నాలుగు గింజలూ వడ్డీపేర తన గాదెల్లోకి తోలించుకుంటాడతను. ఆ రకంగా ప్రజల పేదరికాన్నీ అమాయకత్వాన్నీ ఆసరాచేసుకొని ఆ గ్రామాన్ని ఏకఛత్రాధిపత్యంగా పాలిస్తున్నాడతను. బీహారురాష్ట్రంలో ఉన్న ఆకుగ్రామంపేరు పూగ్యా. ఆ ఊళ్ళో భీమసింగ్ అరాచకాల్ని ప్రతిఘటించిన నాయకుడు రాహుల్. ఇరవైతొమ్మిదేళ్ళ రాహుల్ అభ్యుదయభావాలు గల యువకుడు. అతని భార్య కమల. ఇరవైమూడేళ్ళ కమల అందమైనదేగాక ముమ్మూర్తులా భర్తకు తగిన యువతి. వారి వివాహం అయి అప్పటికింకా ఆరునెలలు కూడా కాలేదు. ఆ దంపతులిద్దరూ భీమసింగ్ దౌష్ట్యాన్ని దురాగతాల్ని గ్రామస్తులందరికీ వివరించి ఆ అన్యాయాల్ని ఎదుర్కోడంకోసం తామంతా ఐకమత్యంగా నిలబడి పోరాడాలని ఉద్బోధించారు. ఏదోఒకరకంగా భీమసింగ్వల్ల నష్టపోయిన ఆ గ్రామప్రజలందరూ ఈ పిలుపుకు ప్రతిస్పందించారు. భీమసింగ్ బానిసత్వంనుంచి విముక్తికోసం అందరూ సంఘటితమయ్యారు. అప్పులకోసం రాహుల్ నేతృత్వంలో అంతా ప్రభుత్వానికి దరఖాస్తుపెట్టుకున్నారు.

ఇది సహించలేని భీమసింగ్ ఓ రాత్రి రాహుల్ ఇంటిపై దాడిచేశాడు గూండాల్తో. భార్య సమక్షంలోనే అతన్ని చితగ్గొట్టారు. ఆ దెబ్బలకు అతని పక్కటెముకలు విరిగిపోయాయి. రక్తంమడుగులో గిలగిలాకొట్టుకుంటున్న భర్తనుచూసి భోరుమంది కమల.

ఆ గొడవకు ప్రజలంతా పోగయ్యారుగానీ ఒక్కరూ 'ఇదేమన్యాయం' అని ప్రశ్నించలేక

పోయారు. అప్పటిదాకా అక్కడే ఉన్న గూండాలు భయంతో బిక్కచచ్చిపోయిన ప్రజలనుద్దేశించి గర్జించారు.

"మాదొరకెవరైనా ఎదురుచెబితే వీడికిపట్టిన గతే పడుతుంది ఖబడ్దార్!" అంటూ హెచ్చరించి వెళ్ళిపోయారు. తరువాత ఎముకలు విరిగిన రాహుల్ ఆసుపత్రిపాలయ్యాడు. కమల ఏకాకిగా మిగిలింది.

కొంతకాలం గడిచింది. రాహుల్ పెట్టించిన దరఖాస్తులు వృధాపోలేదు. ప్రభుత్వం సులభ వాయిదాలమీద చెల్లించేట్లుతక్కువవడ్డీకి రైతులందరికీ రుణసౌకర్యం కల్పించాలని నిర్ణయించింది. అందులోనిభాగంగానే-ఒక గ్రామాన్ని కేంద్రంగా నిర్ణయించి, ఆచుట్టుపక్కల గ్రామాల రైతులకు అక్కడినించే రుణాలు పంపిణీచేయడం ఆరంభించారు రెవిన్యూ అధికారులు.

పూగ్యాకి ఐదుకిలోమీటర్ల దూరంలోనున్న మరో గ్రామంలో తమందరికీ అప్పులిస్తున్నారన్న ప్రభుత్వ దండోరా విని ఆ గ్రామస్తులంతా అక్కడికి పరిగెత్తారు. ప్రభుత్వం అప్పునిచ్చింది. కాని ఏంలాభం? ఆ మొత్తాన్ని బలవంతంగా గూండాలసాయంతో తన బాకీకింద జమకట్టుకోవడం మొదలెట్టాడు భీమసింగ్.

ఆ అన్యాయాన్నిచూసి కమల ఊరుకోలేకపోయింది. అప్పుతీసుకునే నెపంతో పక్కఊరికి వెళ్ళి విషయమంతా అధికారులకి చెప్పింది. భీమసింగ్ బారినుంచి తమను, తమ గ్రామాన్ని ఎలాగైనా కాపాడమని ప్రాధేయపడింది.

కమల చెప్పిందంతావిన్న అధికారులు విస్తుబోయారు. ఆ ఊళ్ళో జరుగుతున్న అరాచకానికి చలించిపోయారు.

ఆరోజు 1980, ఆగస్టు ఏడోతారీఖు...

అప్పటికే చీకట్లు ముసురుకుంటున్నాయి. మరునాడు ఉదయాన్నే పక్కటౌన్ పోలీసుస్టేషన్లో కమలతో రిపోర్టుచేయించాలని నిర్ణయించుకున్నారు. అవిషయం కమలకు చెప్పి-

"అమ్మా...చీకటిపడింది. ఇప్పుడు మీ ఊరేం వెళ్తావ్? మేం విడిది చేసిన డాక్‌బంగళాకు వెళ్ళి ఈ రాత్రి విశ్రాంతి తీసుకో! రేపు ఉదయాన్నే పోలీస్‌స్టేషన్‌కు వెడదాం" అన్నాడో అధికారి.

అక్కడికి డాక్‌బంగళా మూడుఫర్లాంగుల దూరంలో ఉంది. ఆరోజు చెల్లించిన అప్పులతాలూకు అక్కౌంట్లు తయారుచేసుకోవడంలో బిజీగా ఉన్నందున అధికారులెవ్వరూ ఆమె వెంట వెళ్ళలేదు. లేకుంటే వారే ఆమెను తమ జీప్‌లో డాక్‌బంగళాకు తీసుకువెళ్ళేవారు.

మరునాడు భీమసింగ్‌పై తాను పెట్టబోయే కేసునుగురించి ఆలోచించుకుంటూ డాక్‌బంగళావైపు నడిచింది కమల. అధికారులు తమపనుల్లో మునిగిపోయారు.

కొన్నిగంటలతర్వాత అటువస్తున్న బస్సు హెడ్లయిట్‌లకాంతిలో రోడ్డుమీద పడిఉన్న ఓ యువతి శవాన్ని చూసి బస్ ఆపాడు డ్రైవర్. ఆ బస్సులోని కొందరు ఆమెను కమలగా గుర్తించారు. ఆ పక్కనే ఓ ఖాళీజీప్ ఆగిఉంది. బస్‌డ్రైవర్ పోలీస్‌స్టేషన్‌కుపరుగెత్తాడు.

హుటాహుటిన శవం ఉన్న ప్రదేశానికి జీప్‌లో వచ్చి చేరుకున్నారు పోలీసులు. ఆమెను హత్యచేసేముందు నిందితులు ఎన్నోమార్లు రేప్‌చేసి ఉండవచ్చునని పోలీసులు భావించారు. శవాన్ని ఎక్కడైనా దూరంగా పాతెయ్యాలనుకున్నా జీప్‌లో పెట్రోలు లేనందున జీప్‌ని, శవాన్ని అక్కడే వదిలి హంతకులు పారిపోయివుంటారని కూడా వారు ఊహించారు.

జీప్ ఎవరిదో ఆచూకీ తీయగా భీమసింగ్‌దని తేలింది. అతన్ని ప్రశ్నించిన పోలీసులతో, "అవును...జీప్ నాదే! కాని నాకు ఈ హత్యకు ఎలాంటి సంబంధం లేదు. మా ఊరిరైతులు కొందరు 'రుణమేళా'కి వెళ్ళడానికి జీప్‌కావాలన్నారు, ఇచ్చాను. మా డ్రైవర్ టాంకులో పెట్రోలు పోయించడం మరిచిపోయినందున అది డాక్‌బంగళాసమీపంలో ఆగిపోయింది. దాంతో అతను జీప్‌ను లాక్‌చేసి తాళాలు డాక్‌బంగళాలో మకాంవేసిన రెవిన్యూఆఫీసర్‌కి ఇచ్చి మరునాటి ఉదయం వేరే డ్రైవర్ని పంపిస్తానని చెప్పి ఇంటికి వచ్చేశాడు... అంతే! అంతకుమినహా మాకేం తెలియదు" అని నిర్భయంగా చెప్పాడు భీమసింగ్.

పోలీసులకి రెవిన్యూఆఫీసర్‌మీద అనుమానం వచ్చింది. దురుద్దేశంతోనే కమలని ఆ రాత్రి బంగళాలో ఉండమన్నాడేమో! కమలని





చంపి ఆనేరం ఆమెతో వైరమున్న భీమసింగ్ పై నెట్టదల్చుకున్నాడా?

డాక్‌బంగళా అంతా నిశితంగా పరీక్షించాడు ఇన్‌స్పెక్టర్. బాత్‌రూమ్‌లో అతనికి విరిగిపోయిన కమల చేతిగాజులు కనిపించాయి. ఆమెను బాత్‌రూమ్‌లోనే మొదట రేప్‌చేసి ఉండవచ్చుననుకున్నాడతను.

ఆఫీసర్ లబలబలాడుతూ జరిగిందంతా చెప్పి-

"నేను మరునాడు సాయంచేయాలనుకునే ఆమెనారాత్రి డాక్‌బంగళాకు పంపాను. అయితే నా పనులన్నీ ముగించుకునివచ్చేసరికి ఆమె ఇక్కడ లేదు. ఆమె ఊరికి వెళ్ళిపోయిందనుకున్నాను. భీమసింగ్ డ్రైవర్ జీప్‌తాళాలివ్వడంమాత్రం నిజం. కాని అతను అటు వెళ్ళిన తర్వాత కొంచెంసేపటికి ఎవరో మారుతాళంతో జీప్‌తీసుకుపోయారు. ఇంతకన్నా నాకేంతెలియదు" అంటూ మొరపెట్టుకున్నాడు.

ఇన్‌స్పెక్టర్ జీపుని మరోమారు పరీక్షించాడు. పెట్రోలుటాంకుకి రంధ్రం కనిపించింది. పెట్రోలు అయిపోయిందని నమ్మించడానికే ఎవరో కావాలనే ఆ రంధ్రాన్నిచేసి వుండవచ్చుననుకున్నాడతను. జీపుకు రక్తంమరకలు అంటి ఉన్నాయి. జీప్‌లో పగిలిన చేతిగాజుపెంకులు...

ఆ రాత్రి జీప్‌తాళాలు ఆఫీసర్‌కి ఇచ్చి వెళ్ళిన డ్రైవర్‌ని పట్టుకుంటే విషయమంతా తెలుస్తుందనుకున్నాడు ఇన్‌స్పెక్టర్. కాని అతనేపట్టాన దొరకలేదు. పోలీస్‌ల అనుమానం దాంతో మరింతగా పెరిగింది. ఎలాగైతేనేం? అతన్ని పట్టుకొని చితగ్గొట్టి నిజం చెప్పించారు పోలీసులు.

ఆరోజురాత్రి కమల ఒంటరిగా డాక్‌బంగళావైపు వెడుతుండగా మధ్యలోనే ఆమెను భీమసింగ్ మనుమలు పట్టుకుని క్రూరాతిక్రూరంగా మానభంగంచేశారు. తరువాత డాక్‌బంగళావద్దనున్న జీప్‌ను ఇగ్నీషన్‌వైర్లు తెంపి అంటించడంద్వారా స్టార్ట్‌చేసి అందులో కమలను పడేసి దూరంగా తీసుకుపోతూ జీప్‌లోనే చంపేశారు. చచ్చినతర్వాత కూడా ఆమెపై కసితీరక మళ్ళీమళ్ళీ రేప్‌చేశారు వాళ్ళు. తరువాత రెవిన్యూఅధికారిమీద అనుమానం కలగడానికిగాను డాక్‌బంగళాలోని బాత్‌రూమ్‌లో కొన్ని గాజుపెంకుల్ని రహస్యంగా పడేశారు.

ఇలా నిజం బయటపడగానే-

ఇన్‌స్పెక్టర్ అజయ్‌పండిట్ భీమసింగ్‌ని ఉన్నపళంగా అరెస్ట్‌చేసి చేతులకి బేడీలువేసి పూగ్రా గ్రామవీధులలో తిప్పాడు.

కోర్టులో తరువాత న్యాయవిచారణ జరిగింది. భీమసింగ్‌ని ఉరితీశారు. అతని అరాచకాల్లో పాలుపంచుకున్న గూండాలకు యావజ్జీవకారాగారశిక్ష విధించడం జరిగింది.

— రాపేటి




దట్టమైన అడవులు, ఎత్తైన కొండలు గల ఆ దీవిపైన ఓ హెలికాప్టర్ ఎగురుతోంది. అందులో కూర్చున్నవారిలో ఓ యువకుడు తన బైనాక్యులర్స్‌తో ఆ దీవిని నిశితంగా పరీక్షించి మరీ చూస్తున్నాడు. నిలువెత్తు గడ్డితో, దట్టమైన పొదలతో నిండిన ఆ దీవిలో అప్పటిదాకా ఆవరించి ఉన్న నిశ్శబ్దం ఒక్కసారిగా పటాపంచలైంది. కొన్ని వందలమంది చేసే ఆర్తనాదాలతో ఏడుపులు, పెడబొబ్బలతో ఆ దీవి హోరెత్తిపోసాగింది.

ఈ హఠాత్పరిణామానికి హెలికాప్టర్‌లోనివారంతా ఉలిక్కిపడ్డారు. అందరూ భయం భయంగా ఆ యువకునివైపు చూశారు. అతని ముఖంలో ఆతృత... ఓ రకమైన ఆందోళన...

"అవును... ఇక్కడే ఉన్నారు వాళ్ళు. హెలికాప్టర్‌ను కిందకి దింపండి...!" ఆజ్ఞాపించాడతను.

"వద్దు వద్దు... చాలా ప్రమాదం! ఇక్కడ సముద్రపు దొంగలుంటారు. వారి చేతికి చిక్కితే మన ప్రాణాలు పోవడం ఖాయం" సిబ్బందిలో ఒకతను చెప్పాడాయువకుడికి.

"మరి ఎలా...?"

"మనం ఏమీ చేయలేం... వచ్చిన దారిన తిరిగిపోవడం తప్ప" సిబ్బంది ముక్తకంఠంతో చెప్పారు.

అతని ఆజ్ఞతో నిమిత్తం లేకుండానే హెలికాఫ్టర్ వెనుదిగిరింది.

ఆ దీవిలో తాను విన్న ఆర్తనాదాలు ఇంకా లీలగా చెవులకు సోకుతున్నా చేసేదేంలేక బాధగా కళ్లు మూసుకున్నాడా యువకుడు.

ఆ యువకుడి పేరు స్క్వైట్‌జర్.

1979, నవంబరు 16న దక్షిణథాయిలాండ్ లోని సాంగ్‌ఖాలా శరణార్థుల శిబిరానికి ఫీల్డ్‌ఆఫీసర్‌గా యునైటెడ్ నేషన్స్ హైకమిషన్ అతన్ని నియమించింది.

అమెరికాకు చెందిన ముప్పయిఏడేళ్ల స్క్వైట్‌జర్ గొప్ప మానవతావాది. వియత్నాంనుంచి చిన్న చిన్న పడవలమీద, తెప్పల మీద ప్రతిరోజూ తరలివస్తున్న వేలాదిమంది శరణార్థులను ఆదరించి, వారికి మంచి ఆహారం ఇవ్వడమేగాక వసతివైద్య సౌకర్యాలను, రక్షణను కల్పిస్తున్నాడతను.

విశాలహృదయుడైన స్క్వైట్‌జర్ తమపట్ల చూపే ఆదర వాత్సల్యాలకు పొంగిపోయేవారు శరణార్థులు. అందుకే వాళ్లు అతన్ని మనిషిగా కాక మహనీయుడిగా గౌరవించి ఆరాధించేవారు.

థాయిలెండ్‌కు వచ్చిన కొద్దికాలానికే అక్కడి ప్రజలలో ఒకడైపోయాడు స్క్వైట్‌జర్. వారి భాషను కూలంకషంగా నేర్చుకోవడమేగాక, థాయీ యువతినే పెళ్లాడాడు కూడా.

ఓరోజు—

థాయిలెండ్‌కి తూర్పుతీరంలో 50 కిలోమీటర్ల దూరంలోగల కోక్రాదీవిలో అనేకమంది శరణార్థులు చిక్కుపడ్డారని విని వారికి సహాయం చేయాలనే ఉద్దేశంతో హెలికాప్టర్‌లో వెళ్లాడతను. కాని సముద్రపుదొంగల భయంతో అక్కడ హెలికాప్టర్‌ని దించడానికి సిబ్బంది నిరాకరించడంతో ఏమీ చేయలేక తిరిగివచ్చాడు.

శిబిరానికి చేరుకున్నా కోక్రా దీవిలో తాను విన్న దీనారావాలే అతని చెవుల్లో మార్మోగసాగాయి. బాధతో అతని మనస్సు ద్రవించిపోయింది. ఎలాగైనా వారిని రక్షించాల్సిందే అని దృఢంగా నిర్ణయించుకున్నాడతను.

మరునాడే మెరైన్ పోలీసుల సహకారంతో ఓ లాంచీని ఏర్పాటుచేయించుకుని కోక్రా దీవికి బయలుదేరాడు. అక్కడ సముద్రపు దొంగలు చేస్తున్న అత్యాచారాలను కళ్లారా చూశాడు. వాళ్లు ఆ దీవిమీదుగా వసున్న




శరణార్థుల్ని అటకాయించి దీవిలోకి మళ్లిస్తు న్నారు. వారి ఆహారధాన్యాల్ని వస్తుసామాగ్రిని దోచుకోవడమేగాక వారి స్త్రీలను భయంక రంగా చెరుస్తున్నారు. లొంగనివాళ్లను దారు ణంగా చంపుతున్నారు... చిత్రహింసలు పెడు తున్నారు. ఆ బాధలు తట్టుకోలేక శరణార్థు లంతా గొంతులు పగిలేలా రోదిస్తున్నారు.

వారి పైశాచిక చర్యలను చూసి సహించలే కపోయాడు స్కేవైట్‌జర్. తనతోపాటూ ఉన్న కొద్దిమంది అనుచరులతోనే భీకరమైన ఆ సముద్రపుదొంగలను ఎదిరించాడు. ఆ పోరా టంలో అతనికి, అతని పరివారానికి గాయాలు బాగానే తగిలాయి. అయినా శరణార్థులు కూడా ఆ పోరాటంలో అండగా నిలవడంతో అతిప్రయాసమీద ఆడామగా పిల్లాపాపల్తో కలిపి 157 మంది శరణార్థుల్ని రక్షించి ఆ లాంచీలోనే వేసుకుని శిబిరానికి చేరుకున్నాడ తను.

ఇంకా ఆ దీవిలో సముద్రపుదొంగల ఘాతు కాలకు గురవుతూ చెట్లూ పుట్టలూ పట్టిన శరణార్థులెందరో వున్నారని తర్వాత తెలి సింది స్కేవైట్‌జర్‌కి. వారినందరినీ ఎలాగైనా రక్షించితీరాలనే పట్టుదలతో తిరిగి డిసెంబర్ మూడున ఆ దీవికి బయలుదేరాడు.

రహస్యంగా ఆ దీవిలో ప్రవేశించిన స్కేవైట్ జర్‌కి- అల్లంతదూరంలో ఒక భీకరదృశ్యం కనిపించింది.

కొంతమంది అమ్మాయిల్ని లాక్కొచ్చి బల వంతంగా వారితో మద్యం తాగిస్తూ, తాము తాగుతూ, క్రూరాతి క్రూరంగా వారిని అనుభవి స్తూ, హింసిస్తూ ఆనందిస్తోంది ఓ సముద్రపు దొంగలముఠా.

వెంటనే వారిపై విరుచుకుపడిన స్కేవైట్ జర్‌ను గట్టిగానే ప్రతిఘటించారు దొంగలు. కాని వారు తాగి వున్నందున అతని ముందు నిలబడలేకపోయారు. ఈసారి శరణార్థులలో ఎనభైమందిని రక్షించగలిగాడు స్కేవైట్‌జర్. కాని పోరాటంలో అతని ఎడమచెయ్యి మణిక ట్టు విరిగి ఫ్రాక్చర్ అయింది.

తిరిగి 1980 జనవరిలో హెలికాప్టర్‌లో తిరు గుతూ ఆ దీవిలో అనేకచోట్ల అనేకమంది శరణార్థులు చిక్కుబడి ఉండటం గమనించా డతను. అతని మనస్సు తల్లడిల్లిపోయింది. వారందరినీ కాపాడటానికి అవసరమైతే తన ప్రాణాలైనా ధారపోయాల్సిందే అనుకున్నాడు.

వెంటనే మెరైన్ అధికారులను కలుసుకుని తనకు కొన్ని పెద్ద పడవలు, కొంత సిబ్బంది కావాలని కోరాడు.

వారు అతని కోరికవిని, "ఇది తుఫాను కాలం, సముద్రం కల్లోలంగా వుంటుంది. ఈ కాలంలో సముద్రప్రయాణం శ్రేయస్కరం కా దు" అని ఎంతో నచ్చచెప్పారు.

అయినా అతను వినలేదు. మళ్లీ మళ్లీ ప్రాధేయపడ్డాడు. కాని వాళ్లు మాత్రం ఖరా కండిగా కుదరదంటూ నిరాకరించారు. స్కేవై ట్‌జర్‌కు ఏంచేయాలో తోచలేదు.

దుర్భర పరిస్థితులలో క్షణం ఒకయుగంగా ప్రాణాలు అరచేత పట్టుకుని తల్లడిల్లుతున్న శరణార్థులంతా ఒక్కసారిగా కళ్లముందు మెది లారు.

"ఎలాగైనా వెళ్లాల్సిందే" అని నిర్ణయించు కున్నాడు.

వెంటనే తన పలుకుబడిని వినియోగించి ఓ యుద్ధనావను సొంత డబ్బుతో అద్దెకు తీసుకుని గందరగోళంగా ఉన్న సముద్రంలోప డి కోక్రాదీవికి తెగించి బయలుదేరాడు.

ఆరోజు జనవరి 14...

సముద్రం భయంకరంగా గర్జిస్తోంది. ఉవ్వె త్తున లేచి అలలు ఎగిరిపడుతున్నాయి. ప్ర చండవాయువులా సముద్రంమీదనుంచి చల్ల నిగాలి రివ్వున వీస్తోంది. ఏ క్షణంలో తుఫాను విరుచుకుపడుతుందోనన్నట్లు భీకరంగా వుంది వాతావరణం.

ఆ పరిస్థితులలో కూడా పట్టువదలక ఒంట రిగా తన నౌకలో ప్రయాణం కొనసాగిస్తున్నాడు స్కేవైట్‌జర్.

ఏ ముహూర్తంలో బయల్దేరాడోగాని మహాప్ర ళయంగా తుఫాను ముంచుకువచ్చింది. పాపం అష్టకష్టాలుపడి తుఫానుని ఎదిరించి, రెండురోజులు ఆలస్యంగా కోక్రాదీవికి చేరుకు న్నాడతను.

కాని దురదృష్టం అతన్నింకా వెన్నాడుతూనే ఉంది.



పడవకు లంగరువేసి దీవిపై కాలుపెట్టాడో లేదో కక్షతో ఉన్న సముద్రపు దొంగలు పొంచి ఉండి ఒక్కసారిగా అతనిమీద దూకారు. ఆ పోరాటంలో స్కైవైట్ జర్‌కు తలమీద బలమైన గాయంతగిలి స్పృహతప్పిపడిపోయాడు. వాళ్లు అతను చనిపోయాడనే భావించారు. ఉన్నట్లుండి వారికోపం శరణార్థులమీదికి మళ్లింది. కారణం వాళ్లుస్కైవైట్‌జర్‌కి సాయపడటమే!

ఇంకేం వాళ్ళమీద పడి హింసించనారంభించారు. ఇంతలో వారికళ్లు ఆశరణార్థుల లోనున్న ఓ అందమైన యువతిపై పడ్డాయి. ఆమెను పట్టుకోప్రయత్నించారు. ఆమె దొరకకుండా సమీపంలోనున్న గడ్డిదుబ్బుల్లోదాగింది. ఆమెకోసంవారంతా ఆగడ్డిదుబ్బుల్నిగాలించినా ఆమె కన్పించలేదు. ఇలా లాభంలేదని వారాదుబ్బులకు నిప్పంటించారు.

చిటపటలాడుతూ సముద్రపుగాలికి గడ్డిదుబ్బుల్లోంచి పెద్దపెద్దమంటలు లేచాయి. ఆ వేడిక తాళలేక ఆమె అరుస్తూ బయటకువచ్చింది.

ఆక్షణం కోసమే తోడేళ్లలా కాచుకుకూర్చున్న ఆ రాక్షసులు వికటాట్టహాసాలతో ఆమెను పట్టుకుని కసితీరాబాది, రకరకాలుగా చిత్రహింసలు పెట్టి, రాక్షసంగా అనుభవించారు. తరువాత నిర్దాక్షిణ్యంగా ఆమె కాళ్లూచేతులు పట్టుకొని ఆ మంటలలోకే విసిరిపారేశారు. ఏ మంటలకి భయపడి ఆమె బయటకు వచ్చిందో చివరికి ఆ మంటలే ఆమెను సజీవంగా దహించివేశాయి. అది చూసి తాము చేసిన ఘనకార్యానికి పగలబడినవ్వుకొంటూ నిష్క్రమించారా నరరూపరాక్షసులు.

స్పృహతప్పిపడిపోయిన స్కైవైట్‌జర్ మూడురోజులకు తేరుకున్నాడు. ఊథాన్ థీ అనే వియత్నాం లేడీ జర్నలిస్ట్ చేసిన శుశ్రూషలతో మేల్కొన్న అతను జరిగిన దురంతానికి బాధపడుతూ సుమారు 400 మంది శరణార్థుల్ని పడవలో ఎక్కించుకుని శిబిరానికి చేరుకున్నాడు.

చచ్చాడని తాము వదిలేసిన వ్యక్తి అంతమంది శరణార్థులకు విముక్తి కల్గించడం సహించలేకపోయారు సముద్రపు దొంగలు. ఆ కోపాన్ని నిస్సహాయులైన మిగిలిన శరణార్థులపై చూపారు. ఆ బాధలకు తాళలేక వారంతా చెల్లాచెదురై చెట్టుకొకరు పుట్టకొకరుగా అయ్యారు.

ఎక్కడకొంచెం మరుగనిపిస్తే అక్కడ దాక్కుని ఏ వైపునుంచి దొంగలు విరుచుకుపడతారోననే భయంతో బిక్కుబిక్కుమంటూ నిద్రాహారాలు మాని కాలం వెళ్లబుచ్చసాగారు. అలా ఒక కొండచరియలో అంచుల్ని పట్టుకొని 35 మంది మగవారు 5 రోజులపాటూ వేలాడుతూ ఉండిపోయారు. క్రింద భయంకరసముద్రం!

స్కైవైట్‌జర్ ఎంతో సాహసంతో తిరిగి అక్కడ కాలుపెట్టే వరకూ వారలాగే త్రిశంకు స్వర్గంలో వ్రేలాడారు. వారందరినీ సురక్షితంగా క్రిందకు దించిన స్కైవైట్‌జర్‌కు నీరు చొచ్చుకుపోయిన ప్రక్క గుహలో ఏదో అలికిడి విన్పించి అటుగా వెళ్ళాడు. అక్కడి దృశ్యం చూసి అతని కళ్లల్లో నీరు చిప్పిల్లింది.

ఆ గుహలో కొందరు స్త్రీలు నడుము లోతు లోతు నీటిలో చీమ చిటుక్కుమన్నా ఉలిక్కిపడుతూ ప్రాణాలరచేతపట్టుకొని నిలబడి ఉన్నారు. వారిలో ఓ అమ్మాయి 18 రోజులపాటు ఆహారంలేకుండా అలా నీళ్లల్లో నిలబడి ఉంది. పీతలు సముద్ర జలచరాలు కాళ్లని కొరుక్కుతింటున్నా పళ్లబిగువున ఆ బాధను భరిస్తూ అలా నిలబడిందే తప్ప నోరెత్తి తన తోటివారికి తన బాధను చెప్పలేదు. కారణం... భయం... తను ఏమాత్రం అలికిడి చేసినా ఆ నరరూప రాక్షసులు వచ్చి పడతారేమోనని.

ఆమెను భుజంమీద వేసుకొని వచ్చేటప్పుడు ఆమె కాళ్లకు ఎముకలు తప్ప కండ, మాంసం లేకుండటం గమనించి తల్లడిల్లిపోయాడు స్కైవైట్‌జర్.

ఎలాగైతేనేం అలా అక్కడక్కడ తలదాచుకున్న శరణార్థులందరినీ రక్షించి బయల్దేరే సమయానికి ఎక్కడినుంచో ఊడిపడ్డారు సముద్రపుదొంగలు.

స్కైవైట్‌జర్ మొండిగా వారినెదిరించి ఎలాగైతేనేం అతి ప్రయాసమీద శరణార్థుల్ని శిబిరానికి చేర్చగలిగాడు. కాని దొంగలదాడిలో




అతని కుడిభుజం జారిపోయింది. కాలుకి పెద్ద గాయమైంది.

ఇలా లాభంలేదని దొంగలు సరాసరి స్కైవైట్జర్ ఇంటికి వెళ్లి, "మిస్టర్ స్కైవైట్జర్! నువ్విలా శరణార్థుల్ని రక్షించే ప్రయత్నం మానకపోతే నీప్రాణం తీస్తాం జాగ్రత్త!" అని బెదిరించారు.

ఆ బెదిరింపుకు స్కైవైట్జర్ భార్య విపరీతంగా భయపడిపోయింది. కాని అతను మాత్రం ధైర్యంగా-

"మీరు నన్ను చంపవచ్చునేమోగాని, నా లక్ష్యాన్ని చంపలేరు. నా వెనుక ప్రపంచం ఉంది. అది మీకు అంతిమగీతం పాడుతుంది" అని చెప్పాడు.

అంతేగాక మరోమారు కోక్రాదీవి మీదికి వెళ్లి మరో 200 మందిని రక్షించి తీసుకువచ్చాడు.

తమ బెదిరింపుల్ని లక్ష్యపెట్టడంలేదనే కసితో దొంగలు స్కైవైట్జర్ బిడ్డని ఎత్తుకుపోయారు.

"ఇంతమంది ప్రాణాల్ని రక్షించడానికి నా బిడ్డ ప్రాణాలేకాదు, నా ప్రాణాలు, నా భార్యప్రాణాలు బలిపెట్టడానికి నేను సిద్ధంగా ఉన్నాను" అంటూ ఎంతో ధైర్యంగా చెప్పాడతను.

అలా ఎన్నో వ్యయప్రయాసలకోర్చి ఒక్క సంవత్సరంలో 1250 మంది శరణార్థుల్ని రక్షించాడు స్కైవైట్జర్.

కాని అప్పటికే అనేకసార్లు దొంగలతో తలపడటంవల్ల అతని శరీరమంతా గాయాలతో చిల్లులుపడిపోయింది. ఆరోగ్యం దెబ్బతినిపోయింది. అందుకే అతన్ని 1980లో స్విట్జర్లాండ్ ఆఫీసుకు బదిలీ చేశారు అధికారులు.

మానవతా దృక్పథంతో అతను చేసిన మహోన్నత సేవకు సర్వమానవజాతి శిరస్సు వంచి నమస్కరించింది.

అతని సేవలకుగాను 1981లో యునైటెడ్ నేషన్స్ హై కమిషనర్ పాల్ హార్ట్లింగ్ చేతుల మీదుగా ఆ మహామనిషికి నోబెల్ బహుమతి లభించింది.

తరువాత 1983లో స్విట్జర్లాండులో అత్యున్నతంగా భావించబడే మెరిట్ అవార్డ్‌కూడా అతనికి లభించింది.

"ఆయనకి కృతజ్ఞతలు చెప్పడానికి మనజీవితం చాలదు" అంటుంది వియత్నాం జర్నలిస్ట్ ఊథాన్‌థీ.

— రోహిణీ కృష్ణ



## కోరిక

అందంగా, ఆకర్షణీయంగా ఉండే ఇరవైఏళ్ళ కాంచన బెంగుళూరు మెడికల్ కాలేజీలో ఎమ్.బి.బి.ఎస్ చదువుతోంది. స్కూల్ టీచరుగా పనిచేస్తున్న ఆమె తండ్రి వైద్యనాథన్ కాంచన పెద్ద డాక్టరై తమ కుటుంబానికి అండగా నిలుస్తుందని ఆమెపై ఎన్నో ఆశలు పెంచుకున్నాడు.

కానీ అదేకాలేజీలో ప్రొఫెసర్‌గా పనిచేస్తూ, ఇద్దరు బిడ్డల తండ్రయిన రాజ్‌కుమార్‌ను ప్రేమించింది కాంచన. రాజ్‌కుమార్ కూడా కాంచన అందానికి, తెలివితేటలకు ముగ్ధుడై ఆమెపట్ల ఆకర్షితుడైనాడు. ఆ కారణంగా రాజ్‌కుమార్, కాంచనలు కలిసి తిరగడమేకాక, శారీరకసంబంధం కూడా పెట్టుకున్నారు.

ఉన్నట్లుండి ఓరోజు అందర్నీ ఆశ్చర్యపరుస్తూ కాంచన మరణవార్త దావానలంలా నగరమంతా వ్యాపించింది. 1978 జూలై 9న హాస్టల్ గదిలో మంచంపై వెల్లకిలా పడివుంది కాంచన. ఆమె శరీరంపై అక్కడక్కడా రక్తపు మరకలున్నాయి. కాంచననెవరో మానభంగం చేసి హత్య చేసినట్లు ఊహించారంతా.

అమ్మాయిల హాస్టల్ అయినందున కఠినమైన నిబంధనలుండటాన మగవాళ్లకు ప్రవేశంలేదక్కడ. హాస్టల్‌ను గూర్ఖా వేయికళ్ళతో కాపలా కాస్తూ ఉంటాడు. అలాంటి పరిస్థితుల్లో కాంచన ఆ ఘాతుకానికి ఎలా గురైందో ఎవరికీ అంతుపట్టలేదు.

పోలీసులు రంగంలోకి దిగారు. పోస్టుమార్టమ్ రిపోర్టులో, జూలై 8 రాత్రి, కత్తితో బలంగా గొంతులో పొడవటంవల్ల కాంచన చనిపోయినట్టు వెల్లడైంది. ఆరోజు కాంచన హాస్టల్‌లోని తన గదిలో ఒంటరిగా ఉంది. కాంచన గదిలో నుండి ఎలాంటి అరుపులు కూడా వినపడలేదని అన్నారు చుట్టుపక్కల రూమ్స్‌లో ఉండే

హాస్టల్ విద్యార్థినులు.

హత్యకు సంబంధించి ఎలాంటి క్లూలూ దొరకలేదు. కానీ హాస్టల్ అమ్మాయిలు తరచుగా అక్కడికి దగ్గరలో ఉన్న ఓ హోటల్‌కి వెళుతూ ఉంటారని మాత్రం తెలిసింది. హోటల్ దగ్గర బీటువేసే ఓ రౌడీమూక వచ్చేపోయే అమ్మాయిలను వేధిస్తూ ఉంటారని కూడా తెలియవచ్చింది.

ఆ హోటల్ యజమాని చంద్రశేఖర్ కొడుకు యువరాజ్ ఆ రౌడీ మూకకు లీడర్. అతను అమ్మాయిలను అతిగా అల్లరి పెడుతూ ఉంటాడని తెలిసింది.

పోలీసులు చంద్రశేఖర్‌ను అడిగినప్పుడు అతను- "యువరాజ్ నా కొడుకయినందుకు సిగ్గుపడుతున్నాను. ప్రస్తుతం వాడెక్కడున్నాడో నాకు తెలియదు. వాడిపై మీరు ఏ చర్య తీసుకున్నా నా కభ్యంతరంలేదు" అని అన్నాడు బాధగా.

పోలీసులు యువరాజ్‌కోసం గాలింపు ప్రారంభించారు. యువరాజ్ తన స్నేహితుడు కన్నన్ సహాయంతో అక్కడికి దగ్గర్లో ఓ గది అద్దెకు తీసుకొని ఉంటున్నట్టు తెలిసింది. అక్కడ యువరాజ్ లేకపోయేసరికి కన్నన్‌ను ప్రశ్నించారు పోలీసులు. "యువరాజ్ మలయాళం సినిమాల్లో నటించడానికంటూ నా దగ్గర అప్పుతీసుకొని ఎనిమిదో తారీఖునే త్రివేండ్రం వెళ్ళాడు" అన్నాడు కన్నన్.

అదేరోజు కాంచన హత్య జరగడంతో పోలీసులకు యువరాజ్ పైనున్న అనుమానం మరింత బలపడింది. త్రివేండ్ర పోలీసులకు యువరాజ్ గురించి తెలియజేసారు.

అంతేకాక టెలిగ్రాఫ్ ఆఫీసుపైన కూడా ఓ కన్నేసి ఉంచారు పోలీసులు. డబ్బుకోసం యువరాజ్ స్నేహితులకు టెలిగ్రామ్ ఇస్తాడన్న పోలీసుల ఊహ నిజమైంది. జూలై 15న వేయి రూపాయలు పంపమంటూ బెంగుళూరులోని ఓ స్నేహితుడికి టెలిగ్రామ్ పంపాడు యువరాజ్.

పోలీసులు వెంటనే యువరాజ్ స్నేహితుణ్ని కలిసారు. అతను బిత్తరపోయి త్రివేండ్రమ్‌లోని యువరాజ్ అడ్రస్ ఇచ్చాడు. త్రివేండ్రమ్ వెళ్ళిన పోలీసులు యువరాజ్‌ను అరెస్టు చేసి తీసుకొచ్చారు.

కాంచనను తానే హత్య చేసానని ఒప్పుకొంటూ, ఆనాటి సంఘటనను పోలీసులకు వివరంగా చెప్పాడు యువరాజ్.

"జూలై 8 రాత్రి ఏడుకావస్తుండగా కాంచన తన స్నేహితురాళ్ళతో మా హోటల్‌కి వచ్చింది. నేను ఆమె దారికి అడ్డంగా వెళ్లాను. కాంచన మాట్లాడకుండా ముందుకెళ్ళిపోయింది. కాంచన వెనకే వెళ్ళి అందరి ఎదుట ఆమె చేతుల్ని గట్టిగా పట్టుకుని, తనని ముద్దు పెట్టుకోవాలనే గాఢమైన కోరికను తెలిపాను. ఆమె నావైపు అసహ్యంగా చూసి నా చేతుల్ని విదిలించుకొని వెళ్ళిపోబోయింది. రాజ్‌కుమార్ కంటే నేనేం తీసిపోయానని ఆమెను అడ్డగిస్తూ అడిగాను. తన స్నేహితురాళ్ళ ఎదుటే నన్ను ఇష్టంవచ్చినట్లు తిట్టి, చరచర వెళ్ళిపోయింది.

కాంచన చేసిన అవమానం భరించలేకపోయాను. ఆమెపై ప్రతీకారం తీర్చుకోవాలనుకున్నాను. ఆ రాత్రి 12 గంటలకి హాస్టల్‌కి వెళ్ళాను. వెంటపడ్డ గూర్ఖాను చంపుతానని కత్తిచూపి బెదిరించాను. మొదటి అంతస్తులో ఉన్న కాంచన గదికి నీళ్ళపైపు ఆధారంతో ఎక్కాను. ఉక్కగా ఉండటంతో గది తలుపులు తెరచుకునే ఉంది కాంచన. గదిలోపలకెళ్ళి తలుపులు వేసాను. నన్ను చూడగానే భయంతో అరవబోయిన కాంచన నోట్లో బట్టలు కుక్కి ఆమెపై దూకి కోరిక తీర్చుకున్నాను. తృప్తితీరా ఆమెను అనుభవించాక కత్తితో ఆమె గొంతులో పొడిచి చంపి నా కసికూడా తీర్చుకున్నాను"

యువరాజ్‌ను హంతకుడిగా పరిగణిస్తూ అతనికి ఉరిశిక్ష విధించింది కోర్టు.

—వీణ

## అనామకుల హత్యాలు

ఆరోజు రద్దీగా వున్న దాదర్ ఎక్స్‌ప్రెస్‌లో నలభయ్ఐదేళ్ళ దామోదరన్ కూచోడానికి జా





# పల్లె పడుచు చూపుల్లో పరువాల పువ్వులు
# 'అన్నదాత' అండతో పొలాలన్నీ నవ్వులు!



రైతులోకం అభిమానించే పత్రిక

# అన్నదాత

అన్నదాత చందాదారులుగా చేరండి!

**8** రూ॥ల లాభం పొందండి!!

**నెలవిడిచి నెల బోనస్ బుక్ అందుకోండి**

చందాపంపవలసిన చిరునామా!

'అన్నదాత' 'ఈనాడు కాంపౌండ్' హైదరాబాద్- **500 482**

గాలేక నిలబడి ప్రయాణంచెస్తున్నాడు. అతని కి దగ్గర్లోనే మొరటుగా కనిపిస్తున్న మరొకతను నిలబడివున్నాడు. అతని చేతిలో కాల్తున్న సిగరెట్వుంది. అతని జుట్టు రింగులు తిరిగి వుంది. అతనెందుకో దామోదరన్ మొహం మీదికి ఉండుండి సిగరెట్పొగ వూదుతున్నాడు. ఓసారైతే ఫరవాలేదు. కావాలని పదేపదే అలా చేస్తున్నాడు. దామోదరన్ తలతిప్పుకున్నాడు. అతను అవతలివ్యక్తితో పోట్లాడే ధైర్యం లేకనో మరెందుచేతనో ఏం మాట్లాడలేదు. అంతలో దామోదరన్ అరిచెయ్యి కాలినట్లనిపించి, అటుకేసి చూశాడు. ఆ మొరటు మనిషి కాల్తున్న సిగరెట్ని దామోదరన్ అరిచేతికి తాకిస్తున్నాడు.

"ఏంటిది... ఎందుకు నా చేతిని కాలుస్తున్నావ్?" అడిగాడు దామోదరన్ కోపంగా.

అవతలివ్యక్తి యిదేం పట్టనట్లు మళ్ళీ సిగరెట్ చేతికి తగిలించాడు. దాంతో అతను కావాలనే తన చేతిని కాలుస్తున్నాడనే విషయం అతనికి అర్థమైంది.

తోటి ప్రయాణీకులు ఒకరిద్దరు అటుచూసినా వాళ్ళిద్దరూ స్నేహితులేమో ఏదో సరదాగా తమాషా చేస్తున్నారనుకుని వూరుకున్నారు. ఆరోజు ఫిబ్రవరి 5, 1971. ఎలాగో దామోదరన్కి సీటు దొరికేటప్పటికి సర్దుకుని కూచున్నాడు. అప్పటికి కంపార్ట్మెంటులోని యితర ప్రయాణీకులు మంచి నిద్రలో వున్నారు. అతనుకూడా నిద్రపోయే వాడే, కానీ, తనని సిగరెట్తో కాల్చిన వ్యక్తి తనకేసి విచిత్రంగా చూడ్డం కనిపించింది. దాంతో, అతనికి భయం వేసింది. ఓ వేళ అందరూ నిద్రపోతుండగా అతను మళ్ళీ తనని సిగరెట్తో కాలిస్తే ఏం చేసేట్టు? అంతలోనే అతనికి కొంతమంది మిలిటరీవాళ్ళు కూడా తన పెట్టెలోనే ప్రయాణం చేస్తున్నారని గుర్తొచ్చింది. అవసరమైతే వాళ్ళని లేపొచ్చునని ధైర్యం తెచ్చుకున్నాడు. కానీ, అతనికి నిద్రపట్టలేదు.

అర్థరాత్రి ఒంటిగంటకు అతను దామోదరన్కేసి వచ్చాడు. కానీ, కొద్దిదూరంలో నిలబడి సిగరెట్ ముట్టించుకుని టాయ్లెట్ వైపు నడిచాడు. దామోదరన్ తన తలతిప్పకుండానే కంటికొనలనుండి అతనేం చేస్తున్నదీ గమనించాడు. ఆ వ్యక్తి టాయ్లెట్కి దగ్గర్లో పడుకున్న ఓ ముసలాయన దగ్గరికెళ్ళి వున్నట్లుండి ఓ కత్తి తీసుకుని ఆయన తలపై బలంగా పొడిచాడు. ఆ కత్తిపోటుకి ముసలాయన కిక్కురుమనకుండా ఉన్నపాటున చనిపోయాడు. అది చూసి దామోదరన్ వణికిపోయాడు. పైస్టేషన్లో రైలాగగానే ఆ మొరటుమనిషి బండిదిగి వెళ్ళేంతవరకు నోరు మెదపలేదతను. తరువాత ధైర్యం తెచ్చుకుని తోటి ప్రయాణీకుల్ని లేపి జరిగిందంతా చెప్పాడు. తరువాతి స్టేషన్లో రైలాగగానే పోలీసులు వచ్చి శవాన్ని స్వాధీనం చేసుకున్నారు. హంతకుడి గురించిన వివరాలు దామోదరన్ పోలీసులకి చెప్పాడు. తన బొంబాయి అడ్రసు పోలీసులకిచ్చి తను హంతకుణ్ణి గుర్తు పట్టగలనని చెప్పాడు.

కానీ, ఆ కథ అంతటితో ముగిసిపోలేదు. రైల్వే ఫ్లాట్ఫారమ్స్పైనా, పేవ్మెంట్ల మీదా మరికొన్ని హత్యలు జరిగాయి. అన్ని హత్యలూ తలపై బలంగా కత్తితో పొడవడం ద్వారా జరిగినవే.

1971 జూన్ 6న పేవ్మెంట్మీద నివసించే ఓ పదహారేళ్ల కుర్రాడు కాలకృత్యాల కోసం పోతుండగా తననెవరో వెంబడిస్తున్నట్లు గమనించి వెనక్కి తిరిగాడు. సరిగ్గా, అదే సమయంలో అతని తలపై కత్తితో బలంగా పొడవడంవల్ల అతనక్కడికక్కడే చనిపోయాడు. ఆ దృశ్యాన్ని అదేసమయంలో రోడ్డు చివర్నవున్న ఓ వ్యక్తిచూసి కేకలుపెడ్తూ అతన్ని వెంబడించాడు. కానీ, అతను తప్పించుకు పారిపోయాడు.

పోలీసులు సేకరించిన వివరాల ప్రకారం మొరటుగా కనిపిస్తున్న ఓ వ్యక్తి వెండి కత్తితో ఆ కుర్రాణ్ణి చంపినట్లు తేలింది. ఆవార్త నగరమంతా కార్చిచ్చులా వ్యాపించింది. జనం ఆ హత్యల గురించి ఎవరికి తోచినట్లు వారు మాట్లాడారు. ఈ హత్యల్ని కాళీమాతని తృప్తిపరచడానికి ఎవరో చేస్తున్నారని కొందరు అనుకున్నారు.

బొంబాయి పోలీసు విభాగం ఆ కేసుని పరిశోధించే పనిని ఓ గట్టి సి.ఐ.డికి అప్పగించింది. మరో హత్య జరిగేలోపు హంత కుణ్ణి ఎలాగైనా పట్టుకుతీరాలని నిశ్చయించుకున్నాడా సి.ఐ.డి. హత్యలన్నీ కాళీమాత తృప్తికో





నమే ఎవరో చేస్తున్నారని ఆ సి.ఐ.డి కూడా నమ్మడంవల్ల చుట్టువక్కలవున్న కాళికాదేవి గుళ్లన్నిటినీ గాలిస్తూ పూనా వెళ్లాడు. అక్కడికి దగ్గర్లో వున్న పాడుబడ్డ కాళికాదేవి గుడిని ప్రతి అమావాస్యనాడూ ఓ వ్యక్తి దర్శిస్తున్నట్లు తెలిసింది. గుడి చీకటిగా వుండటంవల్ల రాత్రి మాట అటుంచి పగటిపూటకూడా ఆ గుడికి వెళ్లడానికి చాలామంది భయపడతారు. నేరస్తుణ్ణి వివరంగా చూసింది దామోదరన్ ఒక్కడే కాబట్టి అతన్ని కూడా తీసుకుని డిసెంబర్ 1971లో ఓ అమావాస్య రాత్రి సి.ఐ.డి ఓ జీపులో ఆ గుడి దగ్గరికి చేరారు. జీపుని కొద్దిదూరంలోఆపి, వాళ్లిద్దరూ ఓ పొదవెనకనక్కి పాడుబడ్డ దేవాలయంలో ఏం జరుగుతోందో చాటుగా గమనిస్తూండిపోయారు.

ఆ ప్రదేశంచుట్టూ దట్టంగా చెట్లువుండి అడవిలాగేవుంది. అక్కడక్కడ కొన్ని క్రూరమృగాలు కూడా తచ్చాడుతున్నాయి. ఓ గుడ్లగూబ వికృతంగా అరుస్తోంది. ఆ పరిసరాల్లో తోడేళ్లు నక్కి నక్కి మసలుతున్నాయి.

రాత్రి రెండు గంటలవుతుండగా, బలిష్ఠంగావున్న ఓ వ్యక్తి ఆ గుడికి వచ్చాడు. అతను గుడిముందు నిలబడి తన సంచి నుంచి ఓ వెండికత్తిని బయటికితీశాడు. ఆ కత్తిని ముద్దుపెట్టుకుని నేలపై గుచ్చి ఏవో మంత్రాలు చదువుతూండిపోయాడు.

దామోదరన్ ఇన్స్పెక్టర్‌కి చెవిలో చెప్పాడు ఆ వ్యక్తే తను రైల్లోచూసిన హంతకుడని. వెంటనే ఇన్స్పెక్టర్ టార్చిలైట్‌తీసి ఆ వ్యక్తివైపు ఫోకస్ చేశాడు. అతనికేసి రివాల్వర్ గురిపెట్టి, "కదిల్తే ప్రాణాలు పోతాయ్... జాగ్రత్త" అని హెచ్చరించాడు. అతను నిశ్శబ్దంగా లొంగిపోయాడు. మరి కాలయాపన చెయ్యకుండా అతనికి బేడీలు తగిలించి జీపులో కూచోపెట్టి బొంబాయికి తీసుకెళ్లారు.

హంతకుడి అసలుపేరు ఆదిమూలం. వివాహం చేసుకున్నాక, భార్యవల్ల అతనికి అసంతృప్తి కలగడంతో మాదకద్రవ్యాలకి అలవాటుపడ్డాడని తెలిసింది. అతని సొంతవూరు తమిళనాడులోని మధురై అయినప్పటికి మాదకద్రవ్యాలకి అలవాటుపడ్డంవల్ల బొంబాయికి చేరాడు. కుటుంబాన్ని వదిలి అతను తరచుగా ప్రయాణిస్తుండేవాడు.

క్రమంగా అతనిలో ఓ విధమైన మానసిక అలజడి కలిగింది. కాళీమాత మనుషుల్ని తనకి బలిమ్మని కోరుతున్నట్లు భ్రమించాడు. అలా ఆమె తృప్తికోసం అతను హంతకుడిగా మారినట్లు విచారణలో వెల్లడైంది.

పోలీసులు అతనిపై వైద్యపరీక్షలు జరిపించారు. డాక్టర్లు ఆ వ్యక్తికి మతిస్థిమితంలేదని నిర్ధారించారు. చివరికి చికిత్స పొందుతుండగానే అతను మరణించాడు.

—రాచపూడి లక్ష్మణశర్మ




**బొం**బాయి రేవులో లంగరువేసిన ఐ.ఎన్.ఎస్.. మైసూరు ఓడకు రెండవ అధికారిలాంటివాడు, సీనియర్ నేవల్ ఆఫీసరూ అయిన లెఫ్టినెంట్ కమాండర్ కవాస్‌నానావతి కుటుంబం వుండేది బొంబాయిలోనే. అందువల్ల అతను అధికారుల అనుమతితో తన కుటుంబంతో గడుపుతున్నాడు.

ఆరోజు 1959 వ సంవత్సరం, ఏప్రిల్ 27వ తేదీ. భార్యాపిల్లల్ని కారులో తీసుకుని, మెట్రో థియేటర్‌కు బయలుదేరాడు కవాస్. కారు వెళుతున్నంతసేపూ భార్యాభర్తలమధ్య శ్మశాన నిశ్శబ్దం అలుముకుంది. థియేటర్ చేరగానే భార్యనూ, పిల్లల్నీ దింపేసి, తను వాళ్లతోపాటు సినిమా చూడనని చెప్పి, పిల్లలకూ, భార్యకూ కూడా టాటా చెప్పేశాడు కవాస్. సినిమా అయిపోయే టైంకు సుమారు సాయంత్రం ఆరుగంటలకు వచ్చి వాళ్లని . పికప్‌చేసుకుంటానని చెప్పి, కారును మళ్లించాడు.

కవాస్ మనసులో పెనుతుఫాను చెలరేగుతూంది. అందుకు కారణం అతనితోపాటు మరొకరికి మాత్రమే తెలుసు. ఆ మరొకరు... మనసు కూడదీసుకుని డ్రైవింగ్‌పైన లగ్నంచేశాడు. కారు నేవీనగర్‌వైపు దూసుకుపోయింది. కమాండర్ కోఫ్లీ దగ్గరకెళ్లాడు కవాస్ నానావతి.

"సర్... నాకొక రివాల్వర్ కావాలి అనుమతివ్వండి—"

కవాస్ అభ్యర్థన కమాండర్ కోహ్లీకి ఎందుకో అసాధారణంగా ధ్వనించింది.

"రివాల్వరా... దేనికి?" అన్నాడాయన.

"రోజూ అహ్మద్‌నగర్ దాకా ఒంటరిగా కార్లో వెళ్లాలి. వెంట రివాల్వర్ వుంటే కొంచెం రక్షణగా వుంటుంది" బదులిచ్చాడు కవాస్ నానావతి.

అతనికి ఓ పెట్టె యివ్వబడింది. దానిపైన "లెఫ్టినెంట్, కమాండర్ కె.ఎమ్.ఎన్.నానావతి" అని చీటీ వుంది. అందులో రివాల్వర్‌తో పాటు ఆరు బుల్లెట్లు కూడా వున్నాయి.

మళ్లీ కారుదగ్గరికి వచ్చేశాడు కవాస్. "ద్రోహి" ఆ మనిషి గుర్తుకురాగానే కవాస్ మనసు కుతకుతలాడిపోయింది. ఇప్పుడతని మనసు ఒక పద్ధతిలో, ఒక గమ్యంవైపు ఆలోచిస్తుంది. చీడపురుగు, పశువు, అలాంటి వ్యక్తివల్ల సమాజానికి అపకారమే ఎక్కువ. ఒక్కమనిషి మూలంగా జరిగే అన్యాయానికి, ఆ ఒక్కరినీ ఈలోకంలోంచి తప్పించటమే న్యాయం— యిలా ఆలోచిస్తున్నాడు కవాస్. కారు మెట్రో మీదుగా దూసుకుపోతుండగా, లోపలున్న తనకుటుంబం గుర్తుకొచ్చింది. జరగనున్న పరిణామం గురించి వాళ్లకు యిప్పుడేమీ తెలియదు. కానీ జరుగనున్నది జరుగక మానదు— అనుకున్నాడు. కారు పెద్దార్ రోడ్‌లో వున్న యూనివర్సల్ మోటార్స్ ముందు ఆగింది. విల్లీస్ జీపుల డిస్ట్రిబ్యూటర్, ప్రేమ్ అహూజా షాప్ అది.

"సాబ్ లంచ్‌కుపోయి యింకారాలేదు సార్" అని చెప్పారు షాపులో ఎవరో కవాస్‌కు.

మళ్లీ కారెక్కాడు. ధనవంతులు నివసించే నేపియన్ సీరోడ్ వైపు మళ్లింది కారు. అక్కడున్న 'జీవన్‌జ్యోతి' అనే భవంతి ముందు ఆగింది. కవాస్‌ను చూడగానే తలుపు తెరిచి లోపలికి వెళ్లనిచ్చాడు నౌకరు. లోనికి వెళుతు





న్న కవాస్‌తో చెప్పాడు—

"సాబ్ స్నానం చేస్తున్నారు, బాత్‌రూంలో వున్నారు" అని.

బెడ్‌రూంవైపు నడిచాడు కవాస్. అతని వెనుక మామూలుగా తలుపు మూసుకుంది.

కవాస్ నానావతి యిలా ప్రేమ్ ఆహూజా యింటికి రావటానికి కారణం... అందుకు ప్రేరేపించిన సంఘటన ఆరోజు ఉదయం కవాస్ యింట్లో జరిగింది...

కవాస్ భార్య, సిల్వియా ఆంగ్లయువతి. వాళ్లకు పెళ్లయి పదేళ్లయింది. తనభర్తమీద ఎంతో అభిమానంవుంది సిల్వియాకు. అతనంటే ఆమెకు తగనిప్రేమ. వాళ్లకు ముగ్గురు పిల్లలు. ఆ సంసారం ఎంతో ఆనందంగా, హాయిగా సాగిపోతూంది. వాళ్ల యిల్లు చాలా విశాలమైంది. నేవీనగర్‌లోని ఆ భవంతి చూడ ముచ్చటగా వుండేది. తోట, యింటిలోపలి అలంకరణా చూసి ఎంత ఈర్ష్యపడేవారో, వాళ్ల కాపురం చూసికూడా అంత ఆశ్చర్యపడేవారు, యిరుగుపొరుగూ అందరూనూ. వాళ్లిద్దరినీ భార్యాభర్తలనేకంటే ప్రేమికులని అంటేనే సమంజసంగా వుంటుంది— అనేవారు పరిచయస్తులు. తరచుగా యింట్లో పార్టీలు జరుపుతూ అందరితో కలిసిమెలిసి వుండేవారా దంపతులు.

ఆరోజు 1959 వ సంవత్సరం, ఏప్రిల్ 27వ తేదీ, మధ్యాహ్నం భోజనం చేస్తున్న కవాస్‌కు తనభార్య సిల్వియా ప్రవర్తన ఏదో అసహజంగా అనిపించింది. ఎందుకో సిల్వియా మామూలుగా అనిపించలేదు కవాస్‌కు.

"సిల్వీ" ప్రేమగా భుజం తడుతూ అడిగాడు— "పొద్దున్న సలాడ్ చేసినట్టున్నావు— ఏదీ?"

"అయ్యో" చటుక్కున లేచింది సిల్వియా— "మరిచిపోయాను" అంటూ.

"టీనా యానివర్సరీ సంగతి మరచిపోయావు, నిన్న రాత్రి మందులు వేసుకోవటం మరచిపోయావు. నానాకు జవాబు రాయాలని యింతవరకూ నీకు గుర్తేలేదు... ఏమిటీ, మతిమరుపు?"

భోజనం అయిపోయింది. ఇద్దరూ తమగదిలో ఒంటరిగా కూర్చున్నారు.

"పోనీయ్ సిల్వీ అసలు ఒంట్లో నీకు బాగుంటోందా"- తను బొంబాయికి వచ్చినప్పట్నించి పరధ్యానంగా వుంటున్న భార్యను గమనిస్తున్నాడు కవాస్.

మౌనంగా తలూపింది సిల్వియా.

"ఎవరితోనైనా, దేనికైనా తగువుపెట్టుకున్నావా?"

లేదన్నట్టు తలూపింది మళ్ళీ.

"మరి... ?"

తనకూ ప్రేమ్ ఆహూజాకు మధ్య పెరుగుతున్న సాన్నిహిత్యం గురించి చెప్పింది సిల్వియా.

ఈ ప్రేమ్ ఆహుజా బ్రహ్మచారి. బొంబాయిలో కార్లవ్యాపారం చేస్తుంటాడు. సిల్వియాలాగే భర్త వియోగంలో వుంటున్న సైనికాధికారుల భార్యలలాంటివారితో, వారి భర్తలు లేనప్పుడు స్నేహం చేయటంలో ప్రసిద్ధుడు ఆహూజా. ఆడవాళ్లతో ఒంటరిగా మాట్లాడటం, కలసి మందుపార్టీలు చేసుకోవటం ఆ సొసైటీలో సాధారణమైనదే. అందులో తప్పున్నదని కూడా ఎవరూ అనుకోరు. అందుకే తను ప్రేమ్‌ఆహూజాతో స్నేహంగా వుంటున్నానని సిల్వియా చెప్పగానే కవాస్ పెద్దగా ఏమీ అనుకోలేదు.

"వట్టి స్నేహమే కదా, అంతకన్నా ఏమీలేదు కదా" అన్నాడు.

"ఓహ్... కవాస్, ఎట్లా చెప్పాలో నాకర్థంకావటంలేదు. అసలు అదంతా ఎట్లా జరిగిందో నాకు యిప్పటికీ అంతుబట్టడంలేదు. మేం... మేమిద్దరమూ... కానీ కవాస్, యిప్పటికీ నువ్వంటే నాకు అదే ప్రేమ, అదే యిష్టం... "

సిల్వియా పశ్చాత్తాపం యిద్దరికీ తట్టుకోలేని దెబ్బే. ఈ విషయం చెప్పి తమ కాపురం పునాదుల్ని తను చేతులారా పెళ్లగించుకున్నానని భావించింది సిల్వియా. ఆమె చెప్పిన విషయం విని అపనమ్మకంతో అవాక్కయ్యాడు కవాస్.

"అంటే ప్రేమ్ ఆహూజాకూ, నీకూ శారీరక సంబంధం కలిగిందన్నమాట" స్థిరంగా, నిశ్చలంగా, ప్రతిమాటనూ స్పష్టంగా పలికాడు కవాస్.



అయితే సంవత్సరాల తరబడి నేర్చుకున్న క్రమశిక్షణ, సహజంగా వున్న మనోనిబ్బరం - కవాస్‌ను వెన్నుతట్టి నిలబెట్టాయి. అంతకు ముందు అనుకున్నట్టు భార్యా, పిల్లల్ని సిని మాకు తీసుకెళ్ళాడు, తాను మాత్రం వెళ్ళలే దు...

... ఇప్పుడిలా ఆహూజా బెడ్‌రూంలో నిలబ డివున్నాడు కవాస్ నానావతి.

సిల్వియా భర్త యిలా తనదగ్గరికొస్తాడని కలలో కూడా అనుకోలేదు ప్రేమ్ ఆహూజా. మరీ యిలాంటి చోట, యిలాంటి సమయంలో అతన్ని ఎదుర్కోవాల్సి వస్తుందని అసలే ఊహించలేదు.

"సిల్వియాతో నువ్వు నడుపుతున్న వ్యవ హారం నాకు తెలుసు. సిల్వియాను పెళ్ళిచేసు కుంటావా మరి?"

"నాతో గడిపిన ప్రతి ఆడదాన్నీ పెళ్ళి చేసుకుంటూ పోతే యింకేముంది" బదులి చ్చాడు ఆహూజా.

"ఐతే నీకు తగిన శాస్తి నేను చేస్తాను" కోపంగా, గట్టిగా అన్నాడు కవాస్.

మూడుసార్లు రివాల్వర్ పేలిన ధ్వని మారుమోగింది. హుందాగా బైటికి వస్తున్న కవాస్‌ను, ఆహూజా యింటి పనివాడూ, ఆహూజా చెల్లెలు మామీ ఆపటానికి ప్రయ త్నించారు. జరిగిందేమిటో స్పష్టంగా తెలియ కున్నా తను ఏదో ఒకటి చేయాలనుకుంటూ కవాస్‌ను అడ్డగించబోయాడు చౌకీదార్. తాను తిన్నగా పోలీసుల దగ్గరికే పోతున్నానని చెప్పి, రివాల్వర్ కార్లో పడవేసి, కారెక్కాడు కవాస్.

దార్లో రాజ్‌భవన్ దగ్గర కారాపి, దగ్గర్లో పోలీస్‌స్టేషన్ ఎక్కడుందో విచారించాడు. ఎవ రూ సరిగ్గా చెప్పకపోవటంతో నేవీనగర్ వైపు తిరిగాడు. కమాండర్ సామ్యూల్‌ను కలిసి, తనో మనిషితో పోట్లాడి, అతన్ని కాల్చి చంపిన ట్లు తెలియజేశాడు. ఎంతో చురుకైన వాడిగా, ఉత్తముడిగా, అభివృద్ధిలోకి రావలసినవాడిగా నావికాదళంలో వారందరికీ పరిచయమున్న లెఫ్టినెంట్ కమాండర్ కవాస్ నానావతి, ఒక హత్యచేశాడంటే నమ్మబుద్ధివేయలేదు కమాండర్ సామ్యూల్‌కు. కానీ కవాస్ చెప్పిన తరువాత నమ్మక తప్పలేదు. హతుడు సివిలి యన్ అయినందున విషయం పోలీసుల చే తుల్లోకి వెళ్లవలసివుంటుందని తెలిపాడా యన. తాను ఎవరి దగ్గర లొంగిపోవాలోననే సూచనలకోసమే వచ్చినట్లు కవాస్ చెప్పిన మీదట సి.ఐ.డి. వారి దగ్గరకు వెళ్ళమని చెప్పాడు కమాండర్ సామ్యూల్.

సి.ఐ.డి హెడ్‌క్వార్టర్స్‌కు వెళ్ళి విషయం తెలిపిన కవాస్‌ను చూసి, అక్కడి అధికారులు ఆశ్చర్యపోయారు. హుందాగా, గంభీరంగా వున్న యీ నేవీ ఆఫీసర్ హత్యచేశాడంటే వాళ్ళకూ నమ్మబుద్ధికాలేదు. "నేను ఓ మని షితో పోట్లాడి, అతన్ని కాల్చి చంపేశాను" అని తొణకకుండా చెప్పిన అతని నిబ్బరం వాళ్ళను నిశ్చేష్టుల్ని చేసింది. పోలీసు అధికారులు కవాస్‌తో మర్యాదగా మసలుకున్నారు. అతనికి కాఫీ, టిఫిన్లు అందించారు కానీ, ఒక గ్లాసు మంచినీళ్లు మాత్రం స్వీకరించాడు కవాస్. ఆ రాత్రి తమలోని ఒక అధికారితో వుంచారు కవాస్‌ను. అతన్ని లాకప్‌లో వుంచటానికి వాళ్లకు మనసొప్పలేదు.

విషయం తెలిసిన సిల్వియా, భర్త దగ్గరకు పరుగున వచ్చింది. తన మూలంగా అతను చేసిన పనికి చింతించింది. కవాస్ స్వభావం ఆమెకు బాగా తెలుసు. కానీ తనకోసం హత్య చేయగలడని సిల్వియా ఎప్పుడూ అనుకోలే దు. జరిగింది మళ్ళీ వెనక్కి తీసుకుని మార్చ లేంకదా- అంటూ సిల్వియాను దగ్గరికి తీసుకు న్నాడు కవాస్.

ఆ రాత్రి నేవీ అధికారులంతా కవాస్‌ను తమ అధీనంలోకి తీసుకోవటానికి తమ ప్రయ త్నాలు చేశారు. అతనంటే అందరికీ ఎంతో అభిమానం వుంది. సిల్వియా తనకు తెలిసిన లాయర్లందరికీ ఫోన్‌చేసి, వారి సహాయాన్ని అర్థించింది. రాత్రంతా కవాస్ మేలుకునే వున్నాడు. తనొక నేరం చేశాడు, అదీ హత్య. ఈ మచ్చ తన జీవితాన్నీ తన కుటుంబాన్నీ వెంటాడుతూనే వుం ది. తన కుటుంబం ఎన్నో అవమానాలను ఎదుర్కొనవలసి వస్తుంది, కానీ జరిగిపోయింది తాను మళ్ళీ మార్చలేడు - ఇలా ఆలోచిస్తున్నాడు కవాస్.

కేసు కోర్టు ముందుకొచ్చింది. హతుడు ఆహూజా చెల్లెలు, మామీ, తన అన్న సిల్వి




యాను పెళ్ళి చేసుకోవాలనుకున్నాడనీ, ఆమె భర్తగానీ విడాకులిస్తే అదే జరిగేదనీ అన్నది కానీ, ఆమె మాటల్ని ఎవ్వరూ పట్టించుకోలేదు... విశ్వసించలేదు. ఇదంతటికీ కారకురాలైన సిల్వియా తాను అవమానాన్ని మోయదల్చుకుంది. ఆమెవట్ల ఇరుగు పొరుగువారందరూ ఏహ్యభావం కనబరిచారు. ఎన్ని మాటలు అనాలో, అనుకోవాలో అన్నీ అన్నారు. ముఖ్యంగా సిల్వియా ఆంగ్లయువతి కావడంతో, పాశ్చాత్యుల సంస్కృతే అంత- అని ఈసడించారు.

హియరింగ్ జరిగినన్నిరోజులూ, కవాస్ నానావతి తన తెల్లటి నేవీ యూనిఫారంలో కోర్టుముందు హాజరయ్యాడు. చేసిన నేరం ధైర్యంగా చెప్పుకున్న అతని మనో నిబ్బరాన్ని అందరూ ప్రశంసించారు. నానావతీ కేసుగా అప్పట్లో ఈ కేసు దేశమంతా సంచలనం సృష్టించింది. కోర్టుకు వస్తున్న దార్లో ప్రజలంతా బారులు తీర్చి నిలబడి, కవాస్ నానావతిని అభినందిస్తూ, ప్రశంసాపూర్వకంగా చేతులూపుతూ, అతనికి తమ మద్దతును తెలిపేవారు. ఈ కేసు జరిగినన్నిరోజులూ కోర్టు కిక్కిరిసిపోయింది.

హత్య ప్రమాదవశాత్తూ జరిగింది మాత్రమేనని, కవాస్ లాయర్లు వాదించారు. కేసు ముగింపు దశలో ఒక లాయర్ మాట్లాడుతూ, కవాస్‌ను దయతలచమని కానీ, అతనిపైన సానుభూతి చూపమనికానీ తాను కోరననీ; అసలు కవాస్ చేసింది నేరమేకాదనీ వాదించాడు. అప్పట్లో మనదేశంలో, జ్యూరీ విధానం అమలులో ఉండేది. కోర్టు ఎన్నిక చేసిన కొందరు బాధ్యతాయుతులైన పౌరులు, జడ్జితోపాటు కేసువిని, తమందరి అభిప్రాయాలనూ జడ్జికి తెలిపేవారు. జ్యూరి సభ్యుల నిర్ణయానికి జడ్జి తప్పకుండా విలువనివ్వవలసి ఉండేది. ఈ కేసులో వాళ్ళంతా కవాస్‌పట్ల సానుభూతి కనబరచారు. ఐతే, కవాస్ చేసినపని ఎంత సమర్థనీయమైనదైనా అతను చేసిన నేరం- హత్య. ఒక హంతకుణ్ని నిర్దోషిగా విడిచిపెట్టడం సమంజసంకాదని భావించాడు అనుభవజ్ఞుడైన న్యాయమూర్తి. కేసు హైకోర్టుకు తరలింది. అప్పుడే జ్యూరీ పద్ధతిని ఎత్తివేశారు. కవాస్ నానావతికి జీవిత కారాగారవాస శిక్ష విధించారు- బొంబాయి హైకోర్టులో.

"నేను తొందరవడ్డానేమో- సావధానంగా ఆలోచిస్తే మా సమస్యకు మరో మార్గం ఉండేదేమో. ఈ అనర్థం కలిగేది కాదు బహుశా" అన్నాడు కవాస్. జైలు జీవితం గడపటంకన్నా తాను మరణిస్తే బాగుండేదని అనుకున్నాడు కవాస్. తన స్వేచ్ఛాజీవితం కారాగారం పాలయింది. తన వ్యక్తిత్వంమీద మాయనిమచ్చ పడింది- అని పశ్చాత్తాపవడ్డాడు. ఒక్క తొందరపాటు చర్య తన జీవితాన్ని సర్వనాశనం చేసిందని చాలా చింతించాడు కవాస్. స్నేహితులు తరచుగా అతని దగ్గరకొచ్చి పలకరిస్తూ ఊరడించేవారు; ధైర్యం చెబుతూండేవారు. సుప్రీంకోర్టుకు అప్పీలు చేశారు. ఐదుగురు న్యాయమూర్తులు కేసును విచారించారు. కానీ, హైకోర్టు తీర్పును మార్చటానికి ఎలాంటి అవకాశమూలేదని నిర్ణయించారు. దేశంలోని అనేక మంది న్యాయవాదులు, విద్యార్థులూ, యువకులూ, జర్నలిస్టులూ, ముఖ్యంగా వివాహిత స్త్రీలు — కవాస్ నానావతికి తమ సానుభూతి చూపించారు. వాళ్ళదృష్టిలో అతనో హీరో.

మూడు సంవత్సరాల తరువాత కవాస్ నానావతిని విడుదలచేశారు. కానీ స్వేచ్ఛ అతనికిప్పుడు ఆనందం కలిగించలేదు. జీవనాధారంలేదు, జైలు జీవితపు మాయనిమచ్చ అతని వ్యక్తిత్వాన్ని దెబ్బతీసింది. సిల్వియా తిరిగి ఇంగ్లండుకు వెళ్ళిపోయింది. కవాస్ నానావతి విదేశాల్లో ఎక్కడో స్థిరపడ్డాడు. ప్రేమ్ ఆహూజా నైతిక దిగజారుడుతనం, సిల్వియా మోహావేశం, కవాస్ క్రోధావేశం — ఫలితంగా ఒక పచ్చని కాపురం కుప్పకూలిపోయింది; కొన్ని జీవితాలు ఛిన్నాభిన్నమయ్యాయి.

అయితే...

నానావతి కేసు మరో చారిత్రాత్మక మలుపును తిప్పింది. కవాస్ నానావతి విడుదల తరువాత, గోపాల్ గాడ్సే తనను కూడా విడుదల చేయాలని అర్జీ పెట్టుకున్నాడు. మహాత్మా గాంధీ హత్య కేసులో నిందితుడూ, మహాత్మా గాంధీని హత్య చేసిన నాథూరామ్‌గాడ్సే సోదరుడూ అయిన గోపాల్‌గాడ్సే తనను కూడా కవాస్‌ను విడుదల చేసిన పద్ధతిలో విడుదల చేయాలని వాదించి, గెలిచాడు. అదీ అసలు విషయం.

—వినయ్

# చతుర

సంపుటి : 12 ఏప్రిల్ 1989 సంచిక : 3

## ఈ నెల సమగ్ర నవల

పుడుతూనే తండ్రి నిరాదరణకు గురైన అతడు బాల్యంలోనే తల్లిని కోల్పోయాడు. వదిన పంచిన అభిమానానురాగాలు తల్లిని మరిపించగా అన్నే తండ్రిలా మమకారం పంచాడు. అక్కయ్య గురించి విన్నాడేకాని జ్ఞానం వచ్చాక చూసిన గుర్తులేదు. ఆమెకీ తమకీ ఎందుకు పడదో అసలే తెలీదు. ఆ అక్కయ్య కూతురే మూడురోజుల్లో తన మూడ్ పాడుచేసిపారేసి గుండెల్లో పీఠం వేసుక్కూర్చునేసరికి ఉక్కిరిబిక్కిరి అయ్యాడతను. ఆ అందాలపట్టి తన స్వంతం కావాలంటే రెండుకుటుంబాల మధ్య అడ్డుగా నిలిచిన ఇనుప తెరలు తొలగాలి. అది ఎలాగన్నదే అతనికి సమస్యగా పరిణమించింది. ఆ సమస్యే




ఊగిసలాడింది. అహంకారానికీ అనురాగానికీ మధ్య నిలిచిన అడ్డు గోడలు కూలిపోయాయా? కోరుకున్న అమ్మాయి అతని కంటి వెలుగుగా, జంటగా సమకూడిందా?

మధ్యతరగతి ఇళ్ళల్లో అతి సాధారణమైన సన్నివేశాలను, ఆప్యాయతలను, అభిమాన, అహంకారాలను సజీవంగా చిత్రిస్తూ

## ఇంద్రగంటి జానకీబాల

రాసిన తాజానవల 'నిజానికీ అబద్ధానికీ మధ్య' ఈ నెల 'చతుర' సమర్పిస్తున్న సమగ్ర నవల.

సుమబాల అతని వంక అలాగే తదేకంగా చూస్తూ వుండిపోయింది. ఆ కళ్ళల్లో మెరుపు, నిండుదనం వుట్టిపడే చెంపలు, సమ్మోహనంగా వొత్తుగా నల్లగా జుట్టు,తదేకంగా చూస్తున్న ఆమె లేత గుండెల్లో వలపుజల్లు కురిసినట్లయింది.

అతను దూరంగా వున్న దేనినో చూపించి సీరియస్‌గా ఏదోచెప్తున్నాడు. కానీ సుమకి అదేం వినిపించటంలేదు. అతనికి మరింత దగ్గరగా జరిగి అతన్నే చూస్తోంది.

వాను అకస్మాత్తుగా పక్కకి తిరిగి ఆమెకేసి చూశాడు. తను చెప్పేదేమీ సుమవినడం లేదనీ, ఏదో ఆలోచిస్తోందనీ అర్థమైంది. అతనికి ఒక్కక్షణం అయోమయ స్థితి కలిగింది. ఎక్కడో మరేవో లోకాలలో ఉండి కలలుగంటున్నట్లున్న ఆమె కళ్ళల్లో మత్తు అతని గుండెల్లోకి పాకి వొళ్ళు ఝల్లుమంది.

"ఏమిటాలోచిస్తున్నావ్?" అన్నాడు, ఇంకా అదే పరిస్థితి పొడిగించటం యిష్టంలేక.

సుమ ఉలిక్కిపడి "అబ్బే ఏంలేదు" అంది.

వారిద్దరూ బిర్లామందిర్ కొండమీద కూర్చుని దూరంగా వెలిగిపోయే హైద్రాబాద్ నగరసౌందర్యాన్ని చూస్తున్నారు. అది ఆగష్టు నెల. ఉండుండి సన్నటి వానజల్లు తెరలుతెరలుగా వచ్చిపోతోంది. అప్పుడప్పుడు మబ్బుల చాటునుండి నీరెండ బయటకొచ్చినట్లే వచ్చి పసిడిరంగుల్ని భూమ్యాకాశాలమధ్య పరుస్తోంది.

సుమబాల హఠాత్తుగా మాట్లాడటం మానేసింది. చిత్రంగా క్షణంలో డల్ అయిపోయింది. వాను రెండుమూడుసార్లు పలకరిస్తే మనోహరంగా నవ్వి ఊరుకుంది. ఆమె లోపలి ఆలోచనలు ఏమిటో ఊహించటం ఎవరికైనా కష్టమే. అందుకే వాను తికమకపడ్డాడు. ఊరుకోలేక "సుమా, వంట్లో బాగుండలేదా?" అన్నాడు.

ఆమె సూటిగా అతని కళ్ళల్లోకి చూసింది. నెమ్మదిగా అతని భుజంమీద చెయ్యివేసి "అదేంలేదు" అంది.

ఆమె స్పర్శలో అతనికేదో కొత్తదనం తోచింది. ఆ కళ్ళల్లో గులాబీల తోట నవ్వినట్లనిపించింది. ఆమె స్పర్శలో సంపెగపూల పరిమళం తనువంతా చుట్టేసినట్లనిపించింది.

నిజానికి మూడురోజులుగా ఇద్దరూ హైద్రాబాద్ నగరమంతా కలసి తిరుగుతున్నారు. ఒకరి చెయ్యి ఒకరికి తగలడం... ఒకరినొకరు చూసుకోవడం ఇదే మొదలుకాదు. కానీ ఏదో ఒక చిత్రమైన అనుభూతికి, మనసుల్ని పెనవేసే అనుభవానికిమాత్రం యిదే మొదలు.

ఈ సుమబాల ఎప్పుడూ ఇలాగే తనతో వుండిపోతే ఎంత బాగుండును అనిపించి అతని గుండె ఒక్కక్షణం లయతప్పింది.

ఎందుకు ఈ వానుకి ఇంత చేరువగా వచ్చేశాను? ఈ సాన్నిహిత్యం కలకాలం ఇలాగే నిలుపుకోగల శక్తి నాకుందా? లేకపోతే జీవితంలో ఓడిపోవడానికి ఇదొక మొదటి ప్రయత్నమా? అనుకుని ఆమె మనసు ఒక్కక్షణం చివురుటాకులా చలించిపోయింది.

ఇద్దరిమధ్యా మాటలు కరువైనాయి. మనసులు మౌనంగానే మాట్లాడుకుంటున్నాయి. ఇద్దరూ ఈ స్థితిని కప్పిపుచ్చుకుందామని ఒకేసారి అనుకున్నారు.

"పోదాం పద" అంటూ చెయ్యి అందించాడు వాను.

ఆమె అలవోకగా చెయ్యి అందించింది.

ఆ చెయ్యి చల్లగా, మృదువుగా, అప్పుడే విచ్చుకున్న తెల్లకలువపువ్వులా వుంది.

ఆమె కళ్ళల్లోకి చూసి నవ్వాడు.

ఆమె సిగ్గుపడి తలవొంచుకుంది.

వాను స్కూటర్ స్టార్ట్ చేశాడు. సుమ వెనుక కూర్చుని సుకుమారంగా తన చెయ్యి వాను భుజంమీద వేసింది.

చల్లటి గాలి ఇద్దరినీ లాలిస్తూ వేగంగా వెనక్కివెళ్తోంది. స్కూటర్ ముందుకు ఉరుకుతోంది.

* * *

విశాలాక్షి అస్తిమితంగా అటూయిటూ తిరుగుతోంది.

తొమ్మిదిన్నర దాటింది. భర్త త్వరగా యింటికి వస్తే బాగుండునని తహతహలాడుతోంది. అతనితో ఏకాంతంగా రెండు మాటలు చె




ప్పాలి. కానీ ఎంతకీ భర్త జగదీశ్వరరావు జాడ లేకపోయేసరికి కోపం, అసహనం క్షణక్షణం పెరిగిపోతున్నాయామెలో.

మూడురోజుల్నుంచి వాసు, సుమని తీసుకుని హైద్రాబాద్ చూపించటం కోసం వెళ్తున్నాడు. వాళ్ళు తిరిగి వచ్చేలోగా భర్త వస్తే ఏదో చెప్పాలని ఎంత తాపత్రయ పడినా కుదరటం లేదు. అతను ఏనాడూ సమయానికి రావడంలేదు.

విశాలాక్షి అటూయిటూ తిరుగుతోంది. మురళి, కరుణ లోపల గదుల్లో చదువుకుంటున్నారు.

"ఇవాళ కూడా ఆయనకంటే వీళ్ళే ముందువచ్చేట్టున్నారు" అనుకొని లోపలికెళ్ళి భోజనాలబల్ల దగ్గర కావల్సినవి ఒక్కొక్కటీ సర్దటం మొదలుపెట్టింది. స్కూటరు శబ్దం వినిపించి బయటికొచ్చింది.

సుమబాల దిగుతూనే "ఏమిటత్తా? ఇక్కడ నిలబడి ఎదురుచూస్తున్నావ్" అంది.

"అబ్బే... అదేంలేదు. ఇప్పుడే యిటువచ్చాను"అంది అపురూపంగా అమరినట్లున్న ఆ జంటని ఆప్యాయంగా చూస్తూ. "ఆలస్యమైపోయిందికదూ? మురళీ, కరుణా నిద్రపోయారా" అంది సుమ.

విశాలాక్షి సుమని ఆప్యాయంగా పొదివి పట్టుకుని అంది- "ఆలస్యానికేముంది? మురళి పడుకున్నట్లున్నాడు. కరుణ మాత్రం ఎదురుచూస్తోంది మీకోసం"

"అవునూ... ఎలా తడిశారూ? బట్టలింత తడిగా వున్నాయి ఏమిటీ?" అంది. అంటూనే ఓరగా వాసుని పరిశీలించింది. అతని ముఖంలో ఆనందం దాచినా దాగని విధంగా పెల్లుబికి వస్తోంది. అది అతని ముఖానికో వింత అందాల్ని చేకూరుస్తోంది.

విశాలాక్షి మనసు కలుక్కుమంది. ఇద్దరూ మరీ చిన్న పిల్లలేంకాకపోయినా ఢక్కామొక్కీలు తిన్నవాళ్ళూకాదు. తనేంచెప్పాలన్నా ఎలా చెప్పాలన్నా అది కుదిరేదీకాదు.

"వదినా... చాలా ఆలస్యం చేశాంకదూ? రా కరుణా? అన్నం తిందాం" అన్నాడు వాసు. "వద్దేదులే బాబాయ్! సరేగానీ ఈ రోజెక్కడికెళ్ళారు?" అంది కరుణ.

"నౌబత్‌పహాడ్"—

"చాలా బాగుంటుంది కదూ" అంది కరుణ.

"నువ్వూ వస్తే ఇంకా బాగుండేది" అంది సుమ.

"నాకు టెస్ట్ వుంది రేపు. చదవాలని రాలేదు. అయినా మేం అస్తమాను వెళ్తూనే వుంటాం" అంది కరుణ.

రెండురోజులుగా సుమబా॰ వాసు ఎన్నో కబుర్లు చెప్పేసుకునేవారు, కాని ఈ వేళ ఎందుకనో ఇద్దరూ మౌనంగానే వున్నారు. వాళ్ళ కళ్ళల్లో ఆలోచన లేవేదాగి వున్నాయని పిస్తోంది. వారు ఆనందంగానే వున్నా అందులో కొంత ఆందోళన కూడా కనిపిస్తోంది.

మాటల్లోనే జగదీశ్వర్రావు వచ్చేశాడు. అంతే ఇల్లంతా ఒకటే సందడి.

"సుమా? మొత్తం హైద్రాబాద్ అంతా చూసినట్లేనా?" అన్నాడు జగదీశ్.

"చూశాను మావయ్యా" నెమ్మదిగా చెప్పింది సుమ.

"చూశావు సరే... ఇంతకీ మీ విశాఖపట్నం బాగుంటుందా మా హైద్రాబాదా?" అన్నాడు నవ్వుతూ— వాసు, కరుణ, విశాలాక్షి అందరూ ఒక్కసారే సుమబాలవైపు చూశారు. ఆమేం చెప్తుందా అనే ఆతురత వారి కళ్లల్లో కనిపిస్తోంది.

"ఓ సముద్రాన్ని తీసుకొచ్చి హైద్రాబాద్‌లో పెట్టేస్తే హైద్రాబాదే బాగుంటుంది- అదొకటేలోటు" అంది సుమ. అంతా ఒక్కసారి ఘొల్లుమని నవ్వారు.— "మాకు హుస్సేన్‌సాగర్ వుందిగా" అన్నాడు అప్పుడే నిద్రలోంచి లేచొచ్చిన మురళి—

"భలేవాడివిరా? సముద్రం చూసిన కళ్ళకి ఇక్కడివి నచ్చవులే" అన్నాడు వాసు.

"బీచ్‌లేకపోయినా అంతకంటే గొప్పవే కొన్ని వున్నాయి యిక్కడ" అంది సుమ. సుమ అనుకోకుండానే అందామాట. కాని దానిలో ఏదోధ్వనించి విశాలాక్షి వులిక్కిపడింది. వాసు ఓరకంట సుమని పరిశీలనగా చూశాడు. తన మాటల ద్వారా తన మనసు బయటపడిపోతుందనే భయం, అది అందరూ గ్రహించేస్తున్నారనే కంగారు కలిగింది సుమకి. ఆమె

తడబడి ఏదో అనబోయింది. ఇంతలో జగదీశ్వ
్రావు కలగచేసుకుని- "ఎంతయినా సుమకి
చిన్నప్పటినుండి పెరిగిన విశాఖపట్నం నచ్చక
మన ఊరెలా నచ్చుతుంది?" అన్నాడు తేలి
గ్గా-

"అవును నాన్నగారూ... నాకెప్పుడూ ఏ
ఊరుచూసినా హైద్రాబాదే బాగుందని
పిస్తుంటుంది" అన్నాడు మురళి.

అందరూ నవ్వుకుంటూ భోజనాలు ము
గించారు. ఎవరివడకలు వారు చేరేసరికి పద
కొండున్నరైంది. సుమబాల, కరుణ ఒకే
మంచం మీద పడుకున్నారు. వాసు తనగదిలో
కెళ్ళి పడుకున్నాడు. విశాలాక్షి నెమ్మదిగా భర్త
దగ్గరకొచ్చింది.

"ఏమండీ" అంది.

"ఏమిటీ—..." అన్నాడు జగదీశ్ ఆవలి
స్తూ.

"అవునుగానీ నాకొకటి అనిపిస్తోందండీ"
అంది ఎలామొదలుపెట్టాలో, అసలు ఏం
చెప్పాలోకూడా అర్థంకాని అయోమయంలో-

"ఇదిగో చూడు విశాలా? నాకు నిద్రముంచు
కొస్తోంది. చెప్పేదేమైనావుంటే రెండు మాటల్లో
చెప్పు" అన్నాడు మళ్ళీ పెద్దగా ఆవలిస్తూ.

తనేదో పేద్ద విశేషం గ్రహించిందనీ, ఆ
విషయం భర్త ఆలోచనకి అందిద్దామనీ ఆరా
టపడిన విశాలాక్షికి నిరుత్సాహంగా అని
పించింది.

"రాకరాక సుమ మనింటికి వచ్చింది- ఆ
రావడం కూడా అనుకోకుండా"

"అయితే మంచి చీరకొంటాననంటావు.
అంతేగా. ఓకే ఇలాంటివి నాకు చెప్పాలనే
నియమం ఏమీలేదు. నాలుగొందలకి తక్కువ
కాకుండా కొను" అని దుప్పటి కప్పేసుకున్నా
డు.

విశాలాక్షి ఆలోచనలోపడిన అయిదు నిమి
షాల్లో భర్త గురక వినిపించింది. పూర్తిగా
నిరాశచెంది తనూ నిద్రకుపక్రమించింది.

అటు సుమబాల నిద్రపట్టక అటూఇటూ
కదులుతోంది. ఇల్లంతా నిశ్శబ్దంగా ఉంది.
దూరంనుంచి మావయ్య గురకపెట్టడం విని
పిస్తోంది.

సుమ మనసులో ఆలోచనలు రొదచె
య్యడం మొదలుపెట్టాయి.

ఇన్నాళ్ళూ తను వీళ్ళకి ఇంతదూరంగా
ఉండాల్సివచ్చినందుకు చాలా ఆశ్చర్యంగా
ఉంది. వాసు తనకి మావయ్య అవుతాడు.
ఇలాంటి మావయ్యఉన్నట్లు అమ్మ ఎప్పుడూ
చెప్పకపోవడం ఎందుకో ఎంత ఆలోచించినా
అర్థంకావడంలేదు. ఇన్నాళ్ళుగా మావయ్యగా
రింటికి- తమింటికి మధ్య అస్సలు రాకపోకలు
ఎందుకులేవు?

అమ్మ ఇన్నాళ్ళూ తనకున్న ఇంతమంచి
అన్నయ్యనీ, వదినీ అంతతెలివైన, అంద
మైన తమ్ముణ్నీ ఎందుకు దూరం చేసుకుంది?

తనీ మూడురోజుల్లో వాసుకి ఎంతదగ్గరైంది.
అతనులేకపోతే తనకి బతుకేవ్యర్థం అని
పిస్తోందేమిటీ?

అతని కళ్ళల్లోకి చూస్తే గాలమేసి గుండెలు
లాగేస్తున్నట్లుంటుంది. ఎంత స్వచ్ఛంగా,
నిర్మలంగా ఉంటాయా కళ్ళు? తను యూనివ
ర్సిటీకి వెళ్ళివచ్చేప్పుడు ఎంతోమంది తన
వంక వెకిలిగా, ఆబగా, ఆశగా, ఆకలిగా
చూసేవారు. ఎవరిలోనూ ఈ దర్జా, ఈ నిజా
యితీ తనకి కనిపించలేదు. ఏదైనా ఒకటి
వివరించి చెవుతుంటే ఆ కళ్ళనిండా తీక్షణ
మైన ఆలోచనతప్ప మరోభావం కనిపించదు.
తనకి అలా విజ్ఞానవిషయాల్లో సీరియస్‌గా
ఉండేవాళ్ళంటే మొదటి నుండీ ఎంతో ఇష్టం.
ఎంత చక్కగా వివరించి చెప్తాడు తనకి. అత
నేదీ చెప్పడం మొదలుపెట్టినా, గొప్పసింఫనీ
వింటూ ఆ స్వరలహరిలో మునిగిపోయి, అలౌ
కికమైన ఆనందం పొందుతున్న భావనకలు
గుతుంది. మరీ పరీక్షగాచూస్తే అతనికి ఎంతో
దగ్గరగా, మరీమరీ దగ్గరగా చేరిపోవాలని
పిస్తుంది.

సుమబాల తలవిదిలించింది. ఈ ఆలోచన
లు ఇలాతియ్యగా, హాయిగా అంతూవంతూలే
కుండా సాగిపోతూనేఉంటాయి. వాసు అందం,
హుందాతనం సుమని వెంటాడుతూ ఊరి
స్తోంది. ఆమెకి ఆనందంగానూ ఉంది. దాన్ని
అంటిపెట్టుకునే ఏదో తెలియని భయంగానూ
ఉంది.

వాసు మంచి స్థితిలోనే ఉన్నాడు.



ఇ.సి.ఐ.యల్‌లో ఇంజినీరు. ఈడూజోడూ మాత్రమేగాక మావయ్యా వరసకూడా ఉంది. వానుతో తన పెళ్ళి గురించి అమ్మ ఎందుకు ఆలోచించలేదు? అమ్మకి ఈ తమ్ముడు గుర్తు లేడా? అసలు ఇంతమంచి తమ్ముణ్ని ఎలా మర్చిపోగలిగింది? ఒక్కసారికూడా వానుగురించిగాని, మావయ్య గురించిగాని, అత్తయ్య గురించిగానీ ప్రస్తావనరాగా తను వినలేదే!

అమ్మకి అతిశయం ఎక్కువ. ఒకవిధంగా గర్వంకూడా ఎక్కువే. అందరికంటే తనే అధికురాలిననుకుంటుంది. ఎవరి గొప్పతనమూ ఒప్పుకోదు. లేకపోతే ఇంతమంచి విశాలత్తయ్యతో అమ్మకి ఎందుకువడదు. ఏం జరిగింది? తగువెలావచ్చిఉంటుంది? ఏమైనా అత్తయ్యకి తనంటేప్రాణం. ఇంటికెళ్ళానే అమ్మనడిగెయ్యాలి. అంతగా కాదంటే నాన్నగారితోచెప్పి సత్యాగ్రహం చేసైనా వాను విషయంలో తనమాటనెగ్గించుకోవాలి. తన మనసుకి నచ్చినవ్యక్తికోసం తనెంతైనా పోరాడితీరాలి—

సుమ ఆలోచనలు అలా వేడిగా, వాడిగా సాగిపోతున్నాయిగానీ ఆమె స్వభావానికి ఆమె ఇప్పుడు ఆలోచించే విధానం పూర్తిగా విరుద్ధం. సుమ చాలా మెత్తని స్వభావంగలది. తను బాధపడినా, ఎదుటివారిని నిర్లక్ష్యంచేసి తన సుఖం చూసుకునే స్వభావంకాదామెది. ఆలోచనలవరకూ ఘాటుగానే ఆలోచించినా, ఆచరణలోకి వచ్చేసరికి చాలా మెతకగా అయిపోతుంది... ప్రతీసారీ 'పోనీ, ఈసారికి మాత్రం ఈ విషయంలో ఇలా సర్దుకుపోతున్నాగానీ, మరెప్పుడూ ఇలా చెయ్యను' అని చాలాగట్టిగా మాత్రం అనుకుంటుంది.

వాను గదిలోలైటు వెలుగుతున్నట్లు ఓరవాకిలిగా వేసిన తలుపుసందులోంచి కనిపిస్తోంది. సుమకి అస్సలు నిద్రరావడంలేదు. వాను ఏంచేస్తున్నాడు? లైటు వేసుకునే నిద్రపోతున్నాడా లేక ఏమైనా ఆలోచిస్తున్నాడా? ఆలోచిస్తే ఎవరిగురించి? తన గురించిన ఆలోచనలు అతనికుంటాయా? అతనూ తనలాగే నిద్రపట్టక బాధపడుతున్నాడా? ఏంచేస్తున్నాడో?

అక్కడ వానుపక్కకి ఒత్తిగిల్లి పుస్తకంలో పుటతిప్పాడు. అక్షరాలమీంచి, వాక్యాలమీంచి, పేరాలలోంచి కళ్ళు పరుగులు పెడుతున్నా ఒక్క ముక్క అతనికి అర్థంకావడంలేదు. సుమ ఆలోచనల్లోంచి మనసుని మళ్ళించుకోవాలని వ్యర్థప్రయత్నం చేస్తూ పుస్తకం తీశాడు. కానీ మనసు సహకరిస్తేనే మనిషేదయినా చెయ్యగలడని అతనికి అప్పుడే అర్థమైంది.

తెల్లారితే సుమబాల వెళ్ళిపోతుంది. ఆ ఊహ అతనికి ఎక్కడా లేని బెంగని తెచ్చిపెడ్తోంది. తనకొక అక్క వుందనీ, ఆమె పేరు కామేశ్వరి అనీ అప్పుడప్పుడు విన్నాడే గాని జ్ఞానం వచ్చాక చూసిన గుర్తు లేదు. ఆమెకీ తమకీ ఎందుకో పడదు కాబోలు అనుకున్నాడు. తన చిన్నప్పటినుండి వదినే తనని కన్నతల్లిలా పెంచింది. రోగాలొస్తే సేవలు చేసింది. అభిమానంగా చదువు చెప్పింది. తల్లిలా ఆదరంగా, ఆప్యాయంగా చూస్తూ వచ్చింది. తనెప్పుడూ తనకి తెలియని, కనిపించని అక్కయ్య గురించి ఆలోచించలేదు. కానీ అలాంటి అక్కయ్యకి ఇలాంటి ముచ్చటైన కూతురుందనిగానీ, ఈమె ఇలా ఈ మూడు రోజుల్లోనే తన మూడ్ పాడుచేసి పారేస్తుందనిగానీ తనెప్పుడూ ఊహించలేదు. ఇప్పుడాలోచిస్తే ఈ రెండు కుటుంబాల మధ్య ఏదో మిస్టరీ దాగివుందనిపించింది. అన్నయ్యా వదినా ఎవ్వరి గురించీ ఎప్పుడూ చెడు చెప్పరు. చెప్తే మంచే చెప్తారు. ఇష్టం లేకపోతే పెదవి విప్పరు.

ఈరోజు ఉదయంనుంచి ఇప్పటిదాకా ఈ సుమ తనకోసమే పుట్టిందని తనకు ఎన్నిసార్లనిపించింది? ఎలాగైనా సుమని చేపట్టితీరాలనే కోరిక క్షణక్షణం పెరిగి పోతోంది. తను ఊహ తెలిశాక దేనికోసమూ ఇంతగా ఆలోచించలేదనిపిస్తోంది.

తెల్లారితే సుమ వెళ్ళిపోతుంది. ఆమెకళ్ళు తనకెన్ని మాటలు చెప్పినా ఒక్కగానొక్కమాట ఆమెనుంచి వింటే తనకే సంశయమూ వుండదు. అయితే ఎలా? తలుపులు నెమ్మదిగా తెరుచుకున్నాయి.

వాను వులిక్కిపడి గుమ్మంవైపు చూశాడు.

సుమ నెమ్మదిగా అడుగు లోపల పెట్టింది.

వాను ఒక్క వుదుటున లేచి నిలబడ్డాడు. "ఏమిటి సుమా! ఇంకా నిద్ర పోలేదా" అన్నా




డు.

"పడుకున్నాను... కానీ నిద్ర రాలేదు" అంది. వాను మనసు ఆనందంతో ఊగిపోయింది.

"రా... వచ్చి కూర్చో" అన్నాడు.

ఆమె నెమ్మదిగా వచ్చి ఎదురుగా ఉన్న సోఫాలో కూర్చుంది. వచ్చీరానీనిద్రవలన ఆమె కళ్లు మత్తుగా ముగ్ధమోహనంగా వున్నాయి.

ఇద్దరూ, ఇద్దర్నీ ఎన్నో అడగాలని వున్నా ఇద్దరి నోళ్లూ మూతలు పడిపోయాయి. ఒకరికొకరు అంత దగ్గరగా వున్నా ఒకరి సాంగత్యంలోని సాన్నిహిత్యాన్ని మరొకరు ఊహాలోనే అనుభవిస్తున్నారు.

వాను చాలాసేపు అలాగే పత్రిక తిరగేస్తూ కూర్చున్నాడు. అక్కడేవున్న స్టార్‌డస్ట్‌లో గాసిప్స్ చదువుతూ సినిమా బొమ్మలు చూస్తూ కూర్చుంది సుమ.

తనేం అడగాలని వచ్చిందో అది అడగలేనని సుమకి, తను చెప్పదల్చుకున్నది చెప్పలేనేమోనని వానుకు అనిపించి ఒకేక్షణంలో నోరు తెరిచారు.

"సుమా"

"ఆ...."

"......" అతనేం మాట్లాడలేదు.

"నాకు ముందునుంచీ మీతో పరిచయం లేకపోవటం వలన నువ్వు అనాలో-, మావయ్యా అనాలో- మీరు అనాలో-, నాకేం తెలీడం లేదు" అని ఆగింది సుమ.

వానుకి సంతోషం మనసుని వూపేసింది. తనకీ, సుమకీ మధ్య గాలిదూరే సందుకూడా వుండనీయకూడదనే బలమైన కోరికను ఎంతో కష్టంమీద అరికట్టుకుని-

"సుమా" అని కొన్త ముందుకు వంగి- "నువ్వెలా పిల్చినా నాకిష్టమే" అని ఆమె చెయ్యి తన చేతిలోకి తీసుకున్నాడు. ఆమె దడదడలాడే గుండెలతో అతని చేతిమీద తన రెండో చెయ్యి వేసింది.

"ఈ స్నేహం ఇలాగే జీవితాంతం నిలిచేలా చేస్తానని మాటివ్వగలరా?" అంది.

అలా అనేసి ఎంతో గాభరా పడిపోయింది. ఎక్కడలేని సిగ్గూ ఆమెని కమ్మేసింది.

వాను నెమ్మదిగా ఆమె తలపైకెత్తి- తన చేతిలోవున్న ఆమె చేతిని మృదువుగా ముద్దు పెట్టుకుని-

"తప్పకుండా" అన్నాడు ఆమె కళ్లల్లోకి సూటిగా చూస్తూ-,

ఆమె ఆనందంతో చెయ్యి నెమ్మదిగా లాగేసుకుని పరుగెట్టుకెళ్లిపోయింది.

★ ★ ★

జగదీశ్వరరావుకి మెలకువ వచ్చింది.

ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. దూరంగా చిన్నచిన్న శబ్దాలు తప్పించి అంతా ప్రశాంతంగా వుంది.

రాత్రి భార్య తనతో ఏదో చెప్పాలని ప్రయత్నించిన విషయం, తనకి అవుకోలేని నిద్ర ముంచుకువస్తే నిద్రలోకి ఒరిగిపోయిన విషయం గుర్తుకొచ్చాయి. పక్కనే విశాలాక్షి నిద్రపోతోంది. ఆమె మనసులోవున్న ఆందోళన అతను ముందే అర్థంచేసుకున్నాడు. తనకీ అంతా తెలుస్తూనేవుంది. కానీ జరుగుతున్నదానికి ఎవరు మాత్రం ఏంచెయ్యగలరు? ఇద్దరూ వయసువచ్చినవాళ్ళు – పైగా పరసయినవాళ్ళు – తనేం కారణాలుచెప్పి వాళ్లని మళ్ళించగలడు?

ఎప్పుడో చిన్నప్పుడు చూశాడు సుమబాలను. ఇప్పుడెంత పెద్దదైంది? ఎంతచక్కగా, తెలివిగా తయారైంది. అన్నిటికీమించి ఎంత అణుకువ – పెద్దలంటే ఎంత గౌరవం? ఒకవిధంగా చూస్తే తల్లి పోలికలు రాలేదనే చెప్పాలి. చిన్నప్పటినుంచి కామేశ్వరిది ఓర్వలేని గుణం. అన్నగా దాన్నెంత ప్రేమగా చూశాడు తను? దానికేలోటూ రాకూడదనీ – అమ్మలేదనే భావం కలగకూడదనీ తనూ, విశాలా ఎంతో ప్రయత్నించారు. అసలు దానికి అమ్మ అనే మాటంటేనే అసహ్యం – అందర్నీ విచిత్రంగా విదిలించికొట్టింది. అలా అందరికీ దూరమై పోయిందంటే దాని అహంకారమే కారణం.

సుమారు పదిహేనేళ్ళుగా బొత్తిగా రాకపోకలు లేవు. ఏదో ఎక్స్‌కర్షన్‌లో సుమ యిటువచ్చి తమ దగ్గర మూడురోజులుండిపోయింది – సొంత చెల్లెలికంటే బావగారే నయం – అద్ర

ను అదీ ఇచ్చి కలునుకోమని కూతురికి చెప్పా డుట! నుమ ఇంట్లో నడుస్తుంటే ఎంతో ముచ్చటగా వుంది. కరుణ, మురళి ఎంత నంబరంగా వున్నారీ మూడురోజులూ?

అయితే వాను-నుమలు ఇలా ఒకరికొకరు ఇంత దగ్గరవుతారని తాను ఊహించలేదు. ఇన్నేళ్లతర్వాత కామేశ్వరితో గొడవపడాల్సివస్తుందో - ఏమో?

విశాలాక్షిని లేపి తన మనస్సులోని అనుమానం చెప్దామనుకున్నాడు జగదీశ్ — పగలంతా శ్రమపడిందేమో ఆమె మంచినిద్రలో వుంది. లేపటం అన్యాయమనిపించింది. ఓ అరగంటలో తనేలేస్తుంది, అప్పుడే చెప్పవచ్చు అనుకుని కళ్లుమూసుకు అలాగే పడుకున్నాడు. ఇంతలో ఇంట్లోని లైట్లు ఒక్కొక్కటిగా వెలగడం గమనించాడు. అప్పుడు గుర్తుకొచ్చింది- నుమ పొద్దున్నే రైలుకి వెళ్లిపోతుందని.

నుమ వచ్చినందుకు ఆనందంగా వుంది; వెళ్తున్నందుకు బాధగానూ వుంది; ఇది ఎలాంటి మలుపుతిరుగుతుందోనని భయంగానూ వుంది.

"అంకుల్... నేను బయలుదేరుతున్నాను" అంది నుమ నెమ్మదిగా వచ్చి.

జగదీశ్ ఒక్కసారి లేచి కూర్చున్నాడు. అతను నగం నిద్రలో, నగం ఆలోచనలో వుండి విశాలాక్షి ఎప్పుడులేచిందో కూడా గమనించలేదు.

"నేనూ వస్తానమ్మా స్టేషన్‌కి" అంటూ జగదీశ్ హడావిడిగా బయలుదేరాడు.

నుమబాల వెళ్లిపోతూ ఎన్నోకబుర్లు చెప్పింది. వానుని వుత్తరాలు రాయమనీ — జగదీశ్ మావయ్యని రమ్మనీ — సెలవలకి కరుణని, మురళిని పంపమని ఎన్నో చెప్పింది.

అన్నిటికీ విశాలాక్షి, జగదీశ్ సంతోషంగా తలలూపారు.

నుమబాల ఎక్కిన రైలు ప్లాట్‌ఫాం దాటుతుంటే తనలోని ప్రాణం కదిలివెళ్లి పోతున్నట్లు అనుభూతిపొందాడు వాను.





కనిపించినంత దూరంచూసి విశాలాక్షి, జగదీశ్, వానూ ముగ్గురూ ఒక్కసారే వెనక్కితిరిగారు. సికింద్రాబాద్ స్టేషనంతా ఒక్కసారి చిన్నబోయినట్లు వారికో చిత్రమైన భావనకలిగి వారిలోవారే నవ్వుకున్నారు. ముగ్గురూ స్టేషన్ నుంచి బయటపడి ఇంటికి చేరుకున్నారు.

"వదినా..." అన్నాడు వాను.

విశాలాక్షి నెమ్మదిగా వానువైపుతిరిగి ఏమిటన్నట్లు చూసింది.

"అసలు మా అక్కయ్యకీ- మనకీ ఇంత శత్రుత్వంరావడానికి కారణం ఏమిటి?"

విశాలాక్షి గతుక్కుమంది. అంతలోనే సర్దుకుని "అంతగా శత్రుత్వం ఏమీలేదు" అని కప్పిపుచ్చబోయింది.

వాను తేలికగా నవ్వేస్తూ "భలేదానివి వదినా! పన్నెండేళ్ళుగా ఈ ఇంటి మీద కాకి ఆ ఇంటిమీదకి వాలలేదు. అంతకంటే ఏంకావాలి" అన్నాడు.

"ఆ... ఏమున్నాయి? కుటుంబకలహాలు- చిన్నచిన్న మాటపట్టింపులు" అంది.

మరింక వాను మాట్లాడలేదు. అప్పటికే పేపరు చదవటంలో మునిగిపోయిన జగదీశ్ వీరి సంభాషణ విన్నాడోలేదోగానీ అతనేం మాట్లాడలేదు.

వానుకి ఒకటిమాత్రం బాగా అర్థమైంది. ఏదోవుంది. అది చెప్పడం విశాలాక్షికి ఇష్టంలేదు. అలాగని ఎదుటివారిమీదకి చెడ్డతనాన్ని తోసేసి తను మంచి అని చెప్పుకునే స్వభావంకాదు ఆమెది. మంచి సంస్కారవంతురాలు- అనుకున్నాడు వాను.

అతనిలో ఆలోచనలు అంతూపంతూలేకుండా సాగుతున్నాయి. వదిన విశాలాక్షి, అక్కయ్య కామేశ్వరి. ఇద్దరూ వదినామరదళ్ళు. అదేమి ప్రారబ్ధమో ఆ బంధుత్వంలో స్నేహమనేదే ఉండదు: పొత్తు అనేదే పొసగదు. ఇద్దరూ విడిగా ఎంతమంచివారైనా కలిస్తే పరస్పరం చెడ్డవారైపోతారు. అక్కడ ఏ చదువులు, సంస్కారాలు పనికిరావు. వీరిద్దరిమధ్యా ఏ గొడవలు జరిగాయో? తను అన్నగారి పంచనఉండటంవల్ల అక్కయ్యకి దూరమయ్యాడు. అదేకాకుండా చిన్నప్పటినుండి నుమ స్నేహం కూడా దూరం చేసుకున్నాడు.

ఇకముందు కూడా పెద్దలమధ్యవున్న మన

స్పర్థలవల్ల తనూ, సుమా దూరమైపోవడం అనవసరం. అలా ఎన్నటికీ జరగటానికి వీల్లేదు- తనంత తేలికగా వదిలేయడు. అసలు తనకి సుమతో పరిచయమేకాకపోతే అది వేరేగాఉండేది. కాని ఇప్పటి తన పరిస్థితి వేరు.

వాసు సతమతమయ్యే ఆలోచనలతో నిత్యకృత్యాల్లోకి దిగాడు.



సుమబాల ఆరునెలలక్రితం తన పోస్టుగ్రాడ్యుయేషన్ పూర్తిచేసింది.

ఆమె చేసింది సోషల్‌వర్క్ ఎం.ఎ. కావడంతో చదువుపూర్తయి డిగ్రీచేతికిరాగానే ఉరకలువేసే ఉత్సాహంతో సోషల్‌వర్క్ మొదలుపెట్టాలని ఊగిపోయిందిగానీ తల్లి స్వభావం తెలిసి ఆ ఉత్సాహాన్ని మనసులోనే దాచుకుంది. నెమ్మదిగా, నిశ్శబ్దంగా యుద్ధం మొదలుపెట్టింది.

కామేశ్వరి చిన్నప్పట్నించి పెంచుకున్న తన భావాలనీ, అభిప్రాయాలనీ జాగ్రత్తగా సిమెంట్ కాంక్రీటుచేసి పెట్టేసుకుంది. అంతేగానీచదివి నేర్చుకోవడం చూసి అలవరచుకోవడం ఆమెకి తెలీదు. అలాంటి ఆలోచనే ఆమెకిరాదు. ఒకవేళ ఎవరేనా చెప్పబోతే వాళ్ళని పట్టివెధవలమాదిరి జమకట్టిపారేస్తుంది.

ఆమెలో ఎంతోలోతుగా పాతుకుపోయిన కొన్ని అభిప్రాయాల్ని తుడిచివెయ్యాలని భర్త విశ్వనాథ్ ప్రయత్నించి విఫలమయ్యాడు. నిజానికి సుమబాల ఎం.ఎ చదవడం కామేశ్వరికి యిష్టంలేదు. ఆమె డాక్టరీ చదివి ఊరునీ, దేశాన్నీ ఏలెయ్యాలనీ, రెండుచేతులా డబ్బు సంపాదించి ఇంటినిండా పొయ్యాలనీ ఆ తల్లి మొదట్లో ఆశపడింది. కాని అందుకు భిన్నంగా సుమబాల మొదటినుంచి మరోలా ఎదుగుతూ వచ్చింది. సైన్సు, లెక్కలు అంటే సుమ ఇష్టపడేదికాదు. పొలిటికల్‌సైన్సు, హిస్టరీ, ఎకనామిక్స్, సోషియాలజీ, లిటరేచరు లాంటి వాటిలోనే ఆసక్తి కనబరిచేది. మిగిలిన విషయాల్లో భార్యమాట జవదాటకపోయినా, సుమబాల చదువువిషయంలో మాత్రం విశ్వనాథం పట్టుపట్టి కూతురికి ఇష్టమైన సబ్జెక్ట్సుతో చదివించాడు.

సోషల్ వర్క్ అంటే కామేశ్వరికి మరీకోపం. ఊరికే పేదవారిమీద, రోగిష్టివారిమీద, మోసపోయినవారిమీదా జాలిచూపిస్తుంటే ఆమెకి మనసు రగిలిపోతూంటుంది. తండ్రీ కూతుళ్ళ మాటలు సహించలేకపోయేది. చదువుకుంటున్నప్పుడు కూడా ప్రాక్టికల్స్ కోసమూ, క్లాసులు తీసుకుందామనీ సుమ బీదాబిక్కీ దగ్గరకివెళ్తే, కామేశ్వరికి చిరాకుగా వుండేది. అయినా సుమ బీదపిల్లల్ని పోగేసి రోజులతరబడి వాళ్ళతో గడిపేది వాళ్ళకి ఏవేవో చెప్పేది. అలాంటిసమయంలో విశ్వనాథ్ కూతురికి ఏంకావల్సినా యిచ్చేవాడు. ఆమెవాళ్ళకి ఏవోఒకటి కొనితినేందుకు పెట్టేది. ఒకసారి తనదగ్గర డబ్బులెక్కువలేక తనే యింట్లో ఉప్మాతయారుచేసింది. అసలే అలవాటులేదు. చిన్నతనం-అప్పుడు చేతివేళ్ళు కాలినందుకు తల్లి తిట్టిన తిట్లు సుమకి ఎప్పుడూ గుర్తుంటాయి. కాలిన చెయ్యికన్నా ఆమె మాటలు సుమని ఎక్కువగా బాధించాయి. అందుకే ఈ చదువు అసలు బి.ఎ.తోనే ఆపెయ్యమని కామేశ్వరి ఎంతో రాద్ధాంతంచేసింది. కానీ కుదరలేదు. సుమ ఎం.ఎ కూడా చేసేసింది. ఆ సందర్భంలోనే తల్లికీ, సుమకీ ఒక ఒప్పందం కుదిరింది. ఎం.ఎ పూర్తిచేసిన ఆరునెలల్లో కామేశ్వరి చూసి, నిర్ణయించిన సంబంధం చేసుకోవాలి సుమ. అలగాజనంతో తిరుగుతూ పెళ్ళివాయిదావేస్తే తల్లి సహించదు- అదీ ఒప్పందం.

ఎం.ఎ పరీక్షలు పూర్తవుతుండగానే సుమ తన పనిలోపడిపోయింది. నిస్వార్థమైన దృష్టితో అనాథబాలబాలికలకి ఏదో చెయ్యాలని తాపత్రయపడుతున్న సుమ చాలా తక్కువ సమయంలో సోషల్ వెల్ఫేర్ వారిదృష్టిని ఆకర్షించింది. అధికారులు ఆమెకి మంచి




పుత్సాహం యిచ్చి అందులో వెల్‌ఫేర్ ఆఫీస రుగా రమ్మని కోరారు. ఆమె వారికి వెంటనే ఏమీచెప్పకుండా తనపనిలో తనుండిపో యింది. అలాంటి ఓ కార్యక్రమంలోనే ట్రైనింగ్ విద్యార్థులబృందంతో స్పెషల్ గెస్టుగా హైద్రా బాద్ వచ్చింది. ఆ బృందం విశాఖవెళ్ళిపో యిన తర్వాత తను మరోమూడురోజులు మావ య్య గారింట్లో వుండిపోయింది.-

తల్లి పెళ్ళికొడుకుకోసం దుర్భిణివేసి వెదు కుతోందని సుమకి తెలుసు. ఇంతకాలం సుమ మనసులో ఏ ఆలోచనాలేదు. పెళ్ళిఅనేది చాలా అనాసక్తికరంగా మాత్రం వుండేది. ఎంతసేపు మనుమల కుండే రకరకాలసమ స్యల గురించీ వాటికి పరిష్కారం గురించి ఆలోచిస్తూ గడిపేయడం ఆమె తత్వమైపో యింది.

ఇంతలో అనుకోకుండా హైదరాబాద్ ట్రిప్‌లో వాసుని కలుసుకోవడంతో ప్రశాంత మైన సరస్సు కలకలమైనట్లు సుమమనసులో అలజడి మొదలైంది.

నిన్నటిదాకా తల్లిని బతిమాలుకుంది సుమ.

"అమ్మా! ఒక్క సంవత్సరం అవకాశంఇ వ్వవే! ఈ చదువుకున్న చదువు కాస్త సార్థకమ వుతుంది" అని.

"నీ బతుకు ముందు జాగ్రత్తగా దిద్దుకో తర్వాతే ప్రపంచసంస్కరణ" అంటూ విది లించి కొట్టింది కామేశ్వరి. అలాగని సుమని మరీ కట్టడిలోపెట్టలేదు. తనుమాత్రం వరుల వేట తీవ్రంగా సాగిస్తూవుంది- సంవత్సరం తర్వాత అమ్మ చెప్పినట్టు చేసేద్దాం అనుకున్న సుమ నిర్ణయాన్ని ఈ హైద్రాబాద్ ప్రయాణం మార్చివేసింది. పెళ్ళి అంటేనే చాలాచిరా కుగా, అయిష్టంగా అనిపించే సుమబాల సందిగ్ధస్థితిలో పడిపోయింది. అమ్మా నాన్నా ప్రతిపాదిస్తే తను తన అభిప్రాయం చెప్పవల సిందిపోయి, ఇప్పుడు తనే తన మనసులోని ఇష్టం చెప్పాల్సివచ్చినందుకు బెరుకుగా వుంది. ఎన్నో కొరుకుడుపడని ప్రశ్నలు సుమని వేధించటం మొదలుపెట్టాయి.

వాసు తనకి మావయ్య అవుతాడు. తామిద్ద రికీ మూడేళ్ళు తేడావుంది. కడసారిగా పుట్టిన ఆ తమ్ముడిమీద అమ్మకి ప్రేమాభిమానాలే లేవు. ఉంటే ఇంతకాలం వాసు మాటయినా ఇంట్లో ఎత్తకుండా ఎలావుండగలదు? హైదరా బాదులో తను వాళ్ళింటికి వెళ్తున్నట్లు కూడా అమ్మకి తెలీదు. నాన్నగారే తెలియనీవద్దనిచె ప్పారు. ఎందుకు? ఎందుకు? ఎందుకని-

సుమ ఆలోచనలు స్వేచ్ఛావిహంగాలై మాన సఆకాశవీధిలో విహరిస్తున్నాయి. ఒక్కొక్కసారి ఒకేచోట గిరిటీలు కొడ్తున్నాయి.

ఆలోచించి ఆలోచించి అలసిపోతోంది. చిరాకుపడిపోతోంది. ఇదేమీ జరగలేదని, అంతా ఒక కల అని సరిపెట్టుకుందామని ఎంతోప్రయత్నం చేస్తోంది. అలాంటి నిర్ణయా నికొచ్చిన అయిదు నిముషాలకి మళ్ళీ మనసు మారాం చెయ్యడం మొదలుపెట్టి, వాసులేక పోతే తను బతకలేనసేభావంతో బెంబేలుప డటం మొదలుపెట్టేది.

ఏదిఏమైనా తన మనసులోవున్న భావాలు, ఆలోచనలు అన్నీ ముందు తండ్రికే చెప్పా లని నిర్ణయించుకుంది. తండ్రిదగ్గర సుమకి బాగా చనువువుంది. ఆయన ఎడ్రస్‌ఇచ్చి వెళ్ళమంటేనేగదా తను మామయ్యదగ్గరికి వెళ్ళింది.

ఈ సంజాయిషీ ఆమెకెంతో ఊరటగాఅని పించింది. నాన్న నావక్షం అనే భరోసా కొండంతబలాన్నిచ్చింది.

* * *

రెండురోజులుగా సుమ గురించి ఇంట్లో అందరూ కబుర్లు చెప్పుకున్నా సీరియస్‌గా ఎవరూ ఏమీమాట్లాడుకోలేదు. తర్వాత ఎవరి పనుల్లో వారు పడిపోయారు ఒక్కవాసుతప్ప.

వాసుకి మాత్రం నిరంతరం సుమ ఆలోచ నలే. ఆమే రూపమే అతన్ని వెంటాడుతోంది. తన మనసులోని బాధ ఎవ్వరూ పట్టించుకోవ డంలేదని అప్పుడప్పుడు ఉక్రోషంగా కూడా ఉంటోంది.

సుమ పేరు పేరునా అందరికీ ఉత్తరాలు రాసింది క్షేమసమాచారాల్తో. వాసుకి రాసిన ఉత్తరంలోమాత్రం తండ్రి ఆఫీసు ఎడ్రసు ఇచ్చింది. వాసులో అలజడి మరీ ఎక్కువైంది. తను ఆమెకి జవాబురాయాలావద్దా అనే మీ మాంసలోపడిపోయాడు-

ఆ సాయంత్రం జగదీశ్ వస్తూనే- "వానూ! వెంకట్రావుగారు ఉత్తరం రాశారు నాలుగు రోజుల్లో వస్తున్నట్లు" అని చాలా మామూలుగా చెప్పారు.

వాను గుండెల్లో రాయిపడింది. ఆ వెంకట్రావుగారు ఎందుకొస్తున్నారో తెలుసు. తనలాంటి చిక్కుల్లోపడబోతున్నాడో అతనికర్థమైంది. ఎలాగైనా అన్నయ్యతో ఈ విషయం త్వరగా మాట్లాడాలనుకున్నారు.

* * *

సుమ ఇంట్లోదిగుతుంటేనే ఇరవైరోజుల తర్వాత వచ్చిన కూతుర్ని కొరకొరలాడుతూ చూసింది కామేశ్వరి.

విషయాలు మరీ దాచటం ఇష్టంలేని విశ్వనాథ్ సుమ వెళ్ళగానే భార్యకి అసలుసంగతి చెప్పారు. కామేశ్వరి భర్తమీద తాడెత్తునఎగిరింది. ఇవుడు కూతురు ఇంట్లో అడుగుపెట్టగానే నణుగుడు మొదలుపెట్టిన కామేశ్వరి స్వరం అంతకంతకీ పెరిగిపోసాగింది.

"మీకెందుకా దౌర్భాగ్యులమీద అంతద యా" అంటూ ఎత్తిపొడిచింది.

"నీకర్థంకావటంలేదుగానీ కామేశ్వరీ బంధుత్వాల విలువ మరికొంతకాలం గడిచాక తెలుస్తుంది. పోగొట్టుకున్నవి మళ్ళీ రమ్మంటే రావు" అన్నారు విశ్వనాథ్.

ఈమాటలు విని కామేశ్వరి గయ్యిమనిలేచింది.

"నాకా బాంధవ్యాలూవద్దు. ప్రేమలూవద్దు. ఆ వాళ్ళవిషయాలు తల్చుకుంటేనే వెర్రెత్తిపోతుంది" అంటూ ఊగిపోయింది.

"నువ్వే విషయాలు తల్చుకుని ఎవ్వర్ని ద్వేషించవలసిన పనిలేదు. ఇందులో ఎవ్వరు దేనికీ బాధ్యులుకారు" అన్నారు భార్యని సముదాయించేధోరణిలో.

"అవునో కాదో- నాకు తెలియదు. నాకనవసరం- నాకు వాళ్ళనిచూస్తే చిరాకుగా ఉంటుంది. వాళ్ళ తప్పేమీలేకపోవచ్చు- కాని వాళ్ళని నేను చూడలేను, భరించలేను. ఏం? నాకు వాళ్ళతోఉండకపోతే గడవదా? అసలు ఆ ఛాయలేవీ ఇటువైపు పడాల్సినపనిలేదు"

అని ఖచ్చితంగా తేల్చేసింది.

విశ్వనాథ్ మాట్లాడలేదు. అతనికి వాను మీద ఎంతో అభిమానం. జగదీశ్‌తో ఎప్పుడూ కాంటాక్ట్‌లోనే ఉన్నారు ఇన్నాళ్ళూ! అయినా కామేశ్వరికి ఆ సంగతిచెప్పటు. విశాలాక్షికి జగదీశ్ కూడా చెప్పరు. గొడవలు ఇష్టంలేని ఈ మగవాళ్ళిద్దరూ ఆడవాళ్ళదగ్గర ఈ విషయందాచారు. ఇప్పుడు విశ్వనాథ్ బాధపడ్డాడు. తను అనవసరంగా సుమని హైదరాబాద్ పంపి కోరిమరీ గొడవతెచ్చుకున్నానా అని విలవిల్లాడారు.

ఆరోజంతా కామేశ్వరి సుమతో మాట్లాడలేదు. సుమ ఏంచెయ్యాలోతోచక దిగాలుగా అయిపోయింది. అక్కడినుంచి తెచ్చుకున్న ఆనందం క్షణంలో హరించుకుపోయింది. కొండంత అలజడిమాత్రం మనసులో నిండిపోయింది. దుఃఖం ఆగిందికాదు. అసలు ఏమీ వినకుండానే ఒక అవగాహనకివచ్చేసి సాధించే తల్లిమీద సుమకి భలేకోపమొచ్చింది. వెంటనే విశాలాక్షి అత్తయ్య గుర్తుకొచ్చింది. అత్తయ్యని ఎంతఅడిగినా అమ్మగురించి ఒక్కమాటచెప్పలేదు. ఇక్కడ తన తల్లి వాళ్ళని గురించి మాట్లాడుతున్న విధానం చూస్తుంటే తన మనసు తూట్లుపడుతోంది.

విశ్వనాథ్ మాత్రం కూతుర్నిపిలిచి బాధపడవద్దని నెమ్మదిగాచెప్పి ఆఫీసుకెళ్ళిపోయాడు. సుమ తండ్రిమాటలవలన కొంచెం ధైర్యంతెచ్చుకుంది. సెంటర్‌కెళ్ళామని బయలుదేరింది-

అలాగే ఓ రెండురోజులు ముభావంగా ముక్తసరి సంభాషణలతో గడిచిపోయాయి! మూడో రోజు తల్లి "సాయంత్రం పెందరాళేరా... మనింటికి గెస్టులొస్తున్నారు. వాళ్ళకి నువ్వే అటెండ్ అవ్వాలి" అంది.

మాటలు అవేఅయినా వాటివెనుక మరెన్నో అర్థాలు స్ఫురించాయి సుమకి. అంతాగందరగోళంగాఉంది. నిన్ననే వానుకు ఒక క్షేమసమాచారలేఖరాసింది- వాను ఈ సమస్యని ఛేదించటానికి వస్తాడనే నమ్మకమేముంది?- అసలు ఎందుకీ కక్షలూ కార్పణ్యాలు- తనకర్థంకావటంలేదు.

అయితే తనేం చెయ్యాలో సుమ నిర్ణయించుకోలేకపోయింది. నిరాశానిస్పృత్తువా




ఆమెని ఆవహించాయి. ఏమీతోచలేదు. ప్రతి ఘటించేశక్తి క్రమంగా కోల్పోతున్నట్లని పించింది. అమ్మ చెప్పినట్లు వినేద్దామని ఓక్షణం అనిపించి, మరుక్షణమే మనసంతా గుబులువ్యాపించి కళ్ళల్లో నీరూరటం మొద లుపెడుతోంది. తను జీవితంలో రాజీవడలే నేమో అనిపిస్తోంది. తీరా మూడుముళ్ళూవ ద్దాక తను నిగ్రహించుకోలేకపోతే ఆ తర్వాత మరీ అసహ్యంగా రభసఅయ్యేఅవకాశంఉంది. అది ఊహిస్తేనే భయంతో ఆమె వణికిపో తోంది. అసలీపెళ్ళి అనేదానికి దూరంగా పారి పోవాలనిపిస్తోంది.

తను ఊరునించి వచ్చాక తండ్రితో అన్నీ మాట్లాడలేదు. చూచాయిగానైనా అసలు విషయం చెప్పలేదు. అంతలోనే కొంపల మీద కి తీసుకొచ్చింది అమ్మ.

సుమ నెమ్మదిగా బయలుదేరి సెంటర్‌కివె ళ్ళి తండ్రికి ఫోన్‌చేసింది. విశ్వనాథ్ కూతుర్ని ఓదార్చి తను వెంటనే అక్కడికొస్తున్నట్లుచెప్పా డు.

తండ్రికోసం ఎదురుచూస్తూ కుర్చుంటే తల్లి వచ్చేప్పుడు గోడకో, కుర్చీకో చెప్పినట్లుచెప్పిన మాటలు గుర్తుకొచ్చాయి.

"ఈపూటవెళ్ళినా, మధ్యాహ్నంరానని చె ప్పిరా, చెమటలు ఓడుతూ వాళ్ళఎదుట కూర్చోడం మర్యాదగా ఉండదు" సుమ మాట్లాడలేదు.

"పెళ్ళిమాట ఎత్తకుండానే అన్నీ గ్రహించే స్తుంది. అక్కడ మాత్రం పెట్టాడు దేవుడు తెలివి-

అయినా ఆమాత్రం జ్ఞానంఉండద్దూ! అయ్యో అమ్మకిష్టంలేదుకదా! మనం మాత్రం వెళ్ళిరానుకు పూనుకునేదేముంది? అని తెలి యద్దు" అంది మళ్ళీ.

సుమ నన్నగా, విషాదంగా నవ్వుకుంది. అమ్మఅంతగా సణగవలసినపనిలేదు. ఏదీచె ప్పుడు నూటిగా. తను అనుకున్నట్లుగా ఎదుటి వారు గ్రహించి చెయ్యాలి. అంతే!

ఇంతలో కారాగిన శబ్దం వినిపించింది. విశ్వనాథ్ కారుదిగుతూనే కూతుర్నిచూస్తూ- "ఏమ్మా సుమా ఏంజరిగింది. ఎందుకలావు న్నావు" అన్నాడు. తండ్రి ప్రేమగా వలకరించే సరికి ఎక్కడోదాగివున్న బేలతనం బిలబిల మని కన్నీరైజారింది.

"ఛీ... ఏమిటిది చంటిపిల్లల్లాగా. ఏమైంది? పదు... కార్లో ఎక్కు- మాట్లాడు కుందాం" అన్నాడు.

సుమ చటుక్కున కళ్ళనీళ్ళు తుడిచేసుకుని తను బయటకెళ్తున్నట్లు తల్లితో చెప్పేసి తండ్రి పక్కన కార్లో కూర్చుంది.

"ఏమిటలా వున్నావు? నాకొక్క పదినిమిషా లు మాత్రమే సమయముంది. నువ్వు రెండు ముక్కల్లో చెప్పేయి. నిన్ను మళ్ళీ ఇక్కడేదించి నేను వెళ్తాను" అన్నాడు.

"నాన్నా... మీకెన్నో చెప్పాలనుకున్నాను. కానీ ఏమీ చెప్పలేదు. ఇప్పుడీ పదినిమిషాల్లో ఏమీ చెప్పలేననిపిస్తోంది" అంది నెమ్మదిగా తలొంచుకుని.

"అలాగంటే ఎలాగమ్మా? నువ్వు రెండు మా టలు చెప్పినా నేనునిన్ను పూర్తిగా అర్థంచేసుకో గలను" కుడి చేయి స్టీరింగ్‌మీద వున్నా ఎడంచేత్తో కూతురి భుజం తట్టాడాయన.

సుమ ఒక్కక్షణం ఆగి- "ఈరోజు అమ్మేదో పెళ్ళిచూపులులాంటివి ఎరేంజ్ చేసిన ట్లుంది. నాకిప్పుడే యిష్టంలేదునాన్నా" అంది.

అతను నెమ్మదిగా నవ్వి- "అమ్మ నీకిచ్చిన గడువు అయిపోయింది. అమ్మ మాటంటే మాటే... తిరుగుండదు- నీకు తెలుసుగా. అయినా యిప్పుడు ....." —

"అందుకే అమ్మకి నేను చెప్పలేను. మీరు అడ్డుపడి ఇది ఆపవచ్చుగా" అంది గారంగా తండ్రి వైపుచూస్తూ.

ఈసారి విశ్వనాథ్ కాస్త గట్టిగానే నవ్వాడు.

"అమ్మ నేచెప్తే వింటుందన్న నీ నమ్మకం నాకానందంగానే వుందిగానీ, అసలు నీకున్న అభ్యంతరమేమిటో నూటిగా చెప్పు" సుమ మరేం చెప్పలేకపోయింది. తండ్రివంక జా లిగా చూసింది.

అతను నవ్వి "అమ్మలూ! ప్రతిదానికీ అలా కంగారుపడితే ఎలా? ధైర్యంగా వుండాలి" అన్నాడు.

సుమబాల రోషంగా తండ్రివైపు చూసింది.

"నువ్వు మధ్యాహ్నం యింటికెళ్ళు- అమ్మ చెప్పినట్లు" అన్నాడు.

"తప్పదంటారా?"

"ఏముందమ్మా అందులో – మనింటికి గెస్టులొచ్చినట్లు వాళ్ళకి మర్యాదలు చెయ్యాలటెందవ్వ"

సుమబాల తండ్రినుంచి తెలీకుండానే భరోసా చిక్కించుకుంది. వుషారొచ్చింది. తనకి అయిష్టమైన విషయం వస్తే తండ్రి తప్పకుండా తనవైపే నిలుస్తారని నమ్మకం కుదిరింది.

మధ్యాహ్నం ఇంటికి వచ్చేసింది. వస్తూవస్తూ అనుకుంది- తను ముభావంగా వుండకుండా తనే మాట్లాడుతూ తల్లితో కలిసిపోతే గొడవ ఎక్కువ వుండదు-అని.

భోజనంచేసి డ్రాయింగ్‌రూములో సోఫాలు, టెలిఫోను అన్నీ శుభ్రంగా తుడిచింది. అనీ ఎక్కడివక్కడ వుండేలా సర్దింది. మూడుగంటలకి వంటింట్లో తల్లిచేస్తున్న పనిలోకి సహాయంగా వెళ్ళింది. కామేశ్వరి కొంచెం ఆశ్చర్యపోయింది. కూతురు ఇంతమాత్రం మామూలుగా కనిపించగానే ఆమెకి అందలమెక్కినంత ఆనందం కలిగింది.

"ఎందుకమ్మా ఇవన్నీ పెట్టుకున్నావు? బజారునుండి తెప్పించి స్వీట్స్, హాట్, ఐస్‌క్రీము-కూల్‌డ్రింక్స్ సిద్ధం చేసేస్తే హాయిగా వుండేదిగదా" అంది.

ఈసారి కామేశ్వరి మరింతగా ఆశ్చర్యపోయింది.

కాస్సేపు సుమ అవీయివీ సర్దింది.

కామేశ్వరి కూతుర్ని నెమ్మదిగా మందలిస్తూ- "నువ్వెళ్ళి విశ్రాంతిగా కూర్చో — మరీ అలసిపోతే ముఖం పీక్కుపోయి నీరసంగా కనిపిస్తావు" అంది.

సుమ నవ్వుకుంటూ ఇల్లంతా కలియతిరిగి, నీట్‌గా వుండేట్లు చూసింది. ఇంటిముందు గులాబీలు వాడి కొన్ని సగంరాలిపోయివుంటే అవన్నీ తెంపేసి మొత్తం ఒక్కసారి చుట్టబెట్టి వచ్చేసింది.

పైకి ఎన్నిపనులు చకచక చేసుకుపోతున్నా అంతరంగం ఆలోచనలతో నిండిపోయివుంది.

ఒక ప్రాణి పుట్టాక బాల్యం, చదువు-సంధ్య, పెళ్ళి, డబ్బు, అంతస్తు, హోదా ఇవన్నీ చుట్టువక్కల వారిమీద ఆధారపడి ఉంటాయి. వాటివల్ల ఆ వ్యక్తికి కలిగే ఆనందమో, దుఃఖమో, కీర్తి కీడో- ఏదయినా చుట్టువక్కలవారికీ ఆనందం, దుఃఖం కలిగిస్తుంది; అవమానమూ కలిగించి అవకీర్తి చుట్టబెట్టనూవచ్చు.

"నేనూ- నాయిష్టం" అంటూ స్వార్థంతో వ్యవహరించే వారివల్ల వారికి సంబంధించినవారంతా ఎంతో కొంత బాధపడాల్సివస్తుంది.

ఇప్పుడు తను తనిష్టం అని వాసుమావయ్యని పెళ్ళిచేసుకుంటానంటే అమ్మ బాధపడుతుంది. తనతో అనుబంధం తెంచేసుకుంటుంది. నాన్నగారు మా యిద్దరి మధ్యా నలిగిపోతారు. నాన్నగారికి తనంటే ఎంతోయిష్టం. అమ్మకి తనంటే యిష్టంలేదని తనెలా అనుకుంటుంది? కానీ అమ్మకి పంతం ఎక్కువ. ఎదుటివారు ఎవరైనా సరే... తను చెప్పినట్లు వినాలి. చెయ్యాలి. అలాచేస్తే అమ్మ ఎంతో సంతోషిస్తుంది... ప్రేమిస్తుంది. ఏదైనా తేడావస్తే మాత్రం సర్దుకుని మామూలుగా ఉండలేదు. నాన్నగారలాకాదు- తన యిష్టాల్ని మనోవాంఛల్ని ఎక్కువ ఆదరిస్తారు. కక్ష సాధించినట్లు మాట్లాడరు. అందుకే ఆయనతో ఏదైనా చెప్పుకోవాలనిపిస్తుంది.

ఇంతవరకు అమ్మ చెప్పినట్లు వింటూనే వచ్చింది తను. తన బట్టలన్నీ అమ్మకి నచ్చిన రంగులే. తన నగలన్నీ అమ్మకిష్టమైన డిజైన్లే. తను చిన్నప్పటినుంచి నోట్‌బుక్ మీద అట్ట కూడా ఏది వేసుకోవాలో అమ్మే శాసించేది; తనూ శిరసావహించేది. కాని యిప్పుడది తన పెళ్ళి విషయమైపోయింది. ఒకనెల్లాళ్ళక్రితం అయితే తనకంటూ పెళ్ళివిషయంలో ప్రత్యేకమైన యిష్టాలు, అభిప్రాయాలు లేవు. అమ్మ అన్నీ ఆలోచించి చేసిన సంబంధానికి తను మారుపలకకుండా తలవంచి తాళికట్టించుకునేదే. అప్పట్లో అయితే అమ్మానాన్నల కంటే తన సుఖం గురించి ఎవరు ఆలోచిస్తారు?- అనే భావం తనను నడిపించేది.

కాని......తను హైద్రాబాద్ వెళ్ళడం, వాసుతో పరిచయం తన ఆలోచనా విధానంలో ఎంతో





మార్పును తెచ్చిపెట్టింది. మనసులో అలజడి రేపెట్టింది; మనస్తాపాన్ని కలిగించింది. తను పైకి ఎంత గంభీరంగా, ఎంత మామూలుగా వుందామనుకున్నా లోపల అంతరంగం ఒక కల్లోలిత మహాసముద్రంలానే ఉంది.

సరిగ్గా నాలుగు గంటలకి టెలిఫోన్ మోగింది. కామేశ్వరి ఫోన్ అందుకుంది.

తల్లి ముఖంలో వచ్చే మార్పులవల్ల ఆమెకి ఇష్టంలేని విషయం ఏదో వింటోందని గ్రహించింది సుమ. ఏమైవుంటుందా- అని ఆశ్చర్యపోయింది.

కామేశ్వరి నెమ్మదిగా ఫోను క్రెడిల్‌మీద పెట్టి అక్కడే సోఫాలో ఉస్సూరంటూ కూలబడింది. ఎంత దాచినా దాగని నిరుత్సాహం ఆమె ముఖంలో కొట్టొచ్చినట్లు కనిపిస్తోంది. సుమకి కొంచెం భయం వేసింది. తల్లిని పలకరించాలంటే బెరుకుగా అనిపించింది. అయినా నెమ్మదిగా దగ్గరికెళ్ళి-

"ఎక్కడినుంచమ్మా ఫోను?" అంది. కామేశ్వరి నిశితంగా, కించిత్ అనుమానంగా సుమకేసి చూసింది. ఏంమాట్లాడలేదు. సుమ మరికొంచెం ధైర్యంపుంజుకుని "ఎక్కడి నుంచంటే మాట్లాడవేమిటమ్మా?" అంది.

"ఇంకెవరు... మీనాన్నగారు" అంది.

"ఏమిటట?

"ఏంలేదు. మనం వస్తారనుకుంటున్న అతిథులు ఈవేళ రావడంలేదుట" అంది.

"ఏం... ఎందుకనీ" అంది సుమ- ఏదో తెలియని ఆనందం మనసునొక్క ఊపు ఊపేసినా అది బయటపడకుండా.

"ఏమో... వాళ్ళవాళ్ళకెవరికో హార్ట్ఎటాక్ వచ్చిందట" అంది.

"అయ్యో...' అంది సుమ-

కామేశ్వరి లేచి వంటింట్లోకి వెళ్ళి చేస్తున్నవి త్వరగా ముగించి, అన్నీ సర్దేసి, స్నానం చేసి తనగదిలోకెళ్ళి పడుకుంది.

సుమే కాఫీ కలిపి, తనోకప్పు తీసుకుని తల్లికి గదిలోకి తీసుకెళ్ళింది.

అక్కడ తల్లి కేవలం అలా ఇంటికప్పువైపు చూస్తూపడుకోవడం సుమకి విడ్డూరంగా అనిపించింది.

సుమ తల్లివక్కనే కూర్చుంది. సుమ చేతిలో కప్పు అందుకుని ప్రేమగా కూతురి ముంగురుల్ని సవరించింది.

"ఎందుకమ్మా అంత డల్‌గా అయిపోయావు" అంది సుమ.

కామేశ్వరి పరీక్షగా కూతురివంక చూసి- "ఆ వస్తానన్న గెస్టులు ఎవరో నీకుతెలుసా" అంది.

సుమ తలొంచుకుని చీరకుచ్చెళ్ళు సవరించుకుంటూ- "బహుశా పెళ్ళివారు కావచ్చు" అంది.

"అవును... అందుకే నాకు నిరుత్సాహమైంది"

సుమ సుస్మితంగా నవ్వుతూ- "భలేఅమ్మవు నువ్వు- ఉంటే నాకుండాలి నిరుత్సాహం- నీకెందుకు" అని ఖాళీచేసిన కప్పులు రెండూ తీసుకుని లోపలికెళ్ళిపోయింది.

వెళ్ళిపోతున్న కూతురు నవ్వుతోందని వెనుకనుంచే కనిపెట్టిన కామేశ్వరి ఆశ్చర్యపోయింది.'అసలీపిల్లని ఎలా అర్థంచేసుకోవాలి? నానా రాద్ధాంతం చేస్తుందనుకుని తను భయపడితే చల్లగాతేల్చింది'అని విశ్రాంతిగా నిట్టూర్చింది.

వెంటనే కామేశ్వరి వక్కమీంచిలేచింది. తనకి తనే చెప్పుకుంటున్నట్లు-

"ఇందులో కొంపమునిగిందేముంది? ఈవేళకాకపోతే రేపొస్తారు" అంది.

అప్పుడే గుమ్మందగ్గర కొచ్చిన సుమ అందుకుంది.

"అంతే- అలాగే ధీమాగావుండాలి. నువ్వు మంచి చీరకట్టుకో నాన్నగారు వచ్చినవెంటనే అలా బీచ్‌కెళ్దాం- ఈలోగా నేనూ డ్రస్‌చేసుకుంటాను"అంది.

కూతురి మాటలతో ఉత్సాహాన్ని పుంజుకుంది కామేశ్వరి.

సుమకి మాత్రం చాలా రిలీఫ్‌గావుంది. తనకే విధమైన ఆందోళన కలగకుండా ఈ గండం గడిచింది. దీనివెనుక నాన్నగారి ప్రమేయంవుందా- అని ఒక్కక్షణం అనిపించినా

తనకలాంటి ఊహవచ్చినట్లు కూడా తల్లి గ్రహించకూడదని గట్టిగా అనుకుంది.



విశాలాక్షి జగదీశ్‌కి కాఫీ అందిస్తూ నెమ్మదిగా అంది- "మా అఖిరిపిన్ని ఉత్తరం రాసింది. ఆమె కూతురు మందాకిని ఎమ్మెస్సీ చేసిందిట. మన వానుకి చేసుకుంటే బాగుంటుందని- మీ వీలు తెలియజేస్తే తనే బయలుదేరివస్తానని రాసింది"

జగదీశ్ కాఫీ నెమ్మదిగా తాగి- "వానుని అడుగు వాడి అభిప్రాయం తెలుసుకొని చూడచ్చు" అన్నాడు.

అతని మాటలు పూర్తవుతుండగానే వానువచ్చాడు "ఏమిటన్నయ్యా?" అంటూ.

"అదేరా... మీ వదినకి వేలువిడిచిన చెల్లెలు ఓ అమ్మాయివుందిట. ఆమె నిన్ను పెళ్ళాడాలని ఉవ్విళ్ళూరుతోందట" అన్నాడు కొంత గంభీరంగానూ, కొంత హాస్యంగాను.

వాను వెంటనే- "వేలువిడిచినావద్దు కాలు విరిగినావద్దు. వదినా... నాకలాంటి గొడవలేంవద్దు- అలాంటివేమీ తెచ్చిపెట్టకు ఇప్పుడు" అన్నాడు.

"భలేవాడివే... అసలు పెళ్ళేచేసుకోవా ఏమిటి?" అంది విశాలాక్షి.

"చేసుకోను... ప్రస్తుతం నాకలాంటి ఆలోచనేలేదు. పైగా చాలా విసుగ్గావుంది" అన్నాడు.

"మరేపాపం! విసుగ్గానేవుంటుంది- పెళ్ళవకపోతే" అంటూ వాను నెత్తిమీద నున్నితంగా తట్టి లోపలికెళ్ళిపోయింది విశాలాక్షి.

వానుకి గుండె ఝల్లుమంది. ఆడపిల్లలా సిగ్గువచ్చాడు. ఏదో తన అంతరంగంలోని విషయాన్ని వదిన కనిపెట్టేసినట్లు తికమకవడ్డాడు. అక్కడ తను మరికాస్సేపు వుంటే తన ముఖంలో భావాలు అన్నయ్య చదివేస్తాడేమోనని అక్కడినుంచి కదిలాడు.

"వానూ..."

అన్నగారి పిలుపువిని అనుకున్నంతా అయిందని వాను నెమ్మదిగా వెనక్కితిరిగి "ఏమిటన్నయ్యా?" అన్నాడు.

"కూర్చో" అన్నాడు జగదీశ్.

అన్నయ్యని చూస్తే వానుకి తండ్రిలాంటి భావంతో కొంచెం భయం, బెరుకు కలుగుతుంటాయి. నిశ్శబ్దంగా అన్నగారి ఎదురుగా కూర్చున్నాడు.

"వానూ... నువ్వు వదిన మాటలు పూర్తిగా తీసిపారేయకు. నీకిప్పుడు పెళ్ళిచెయ్యాలనుకోవడం సహజం. నీకు తగిన చక్కటి పిల్లదొరకాలంటే కొంచెం ప్రయత్నంచెయ్యాలి. వద్దు వద్దు అనుకుంటూ కూర్చుంటే మంచివాళ్ళూ, మనకి కావలసినవాళ్ళూ దాటిపోతారు" అన్నాడు.

వాను ఆశ్చర్యపోయాడు. అన్నయ్య ఈ విషయం ఇంత సీరియస్‌గా మాట్లాడటంతో అతని గుండె దడదడలాడింది. అన్నగారిలా మాట్లాడటం ఇదే మొదటిసారి. వాను చదువు గురించిగానీ, మరే అలవాట్లగురించిగానీ అన్నయ్య ఎప్పుడూ ఏమీచెప్పలేదు. ఆ అవసరం రాలేదు. అన్నిక్లాసులు మెరిట్‌లోవస్తూ ఎమ్.టెక్ చేసి ఇంజనీర్‌గా ఎదిగి, స్వశక్తితో ఉద్యోగంలో స్థిరపడిన వానుని చూస్తే జగదీశ్‌కి- విశాలాక్షికి ఎంతో గర్వంగావుంటుంది. వాను తమవాడని చెప్పుకోడానికి వారెంతో గర్వపడతారు. ఎప్పుడైనా వానుకి సలహా ఇవ్వాల్సి వచ్చినా విషయం కొంచెం వేళాకోళంతోకలిపి ఊరికేన్నూరించేలా చెప్తాడు జగదీశ్. అంతేగాని సీరియస్‌గా ఏదీ సాగలాగడు.

"ఏం... మాట్లాడవు?" అన్నమాటలకి వాను ఉలిక్కిపడ్డాడు. అతనికి తన మనసులో మసకమసకగావున్న భావాలు చెప్పాలంటే బెరుకుగానూవుంది, చెప్పకుండా దాచుకోవాలంటే గుబులుగానూవుంది.

"అలాగేగానీ.... అన్నయ్యా- నీతో కొంచెం మాట్లాడాలి" అన్నాడు ధైర్యంగా.





# మీ పాపాయికి
# అందించండి సెరిలాక్ లాభం



## తొలిసారిగా ఘన పదార్థాలను ఇస్తూ

4 నెలల నుంచీ మీ పాపాయికి,
పాలతోబాటు ఘన పదార్థాలు కావాలి
సెరిలాక్ లాభాన్నీ అందించండి.
పోషకాహార లాభం : సెరిలాక్
ప్రతి మోతాదులోనూ మీ పాపాయికి
కావలసిన పోషక పదార్థాలు, ప్రొటీన్లు,
కార్బోహైడ్రేట్లు, కొవ్వు పదార్థాలు,
విటమిన్లు, ఖనిజాలూ అన్నీ వున్నాయి.
అన్నీ సమ పాళల్లో వున్నాయి.
రుచి లాభం : పాపాయిలకు సెరిలాక్
రుచి ఇష్టం.
సమయం ఆదా లాభం : సెరిలాక్
ముందుగా వండినది. దానిలో పాలూ,
పంచదార వున్నాయి. దానిని వెచ్చటి
నీటితో కలిపితే చాలు.
ఎంపిక లాభం : ఎంచుకునేందుకు
మూడు రకాల సెరిలాక్ వుంది.
మీ పాపాయికి సమతూకంలో
పోషకాహారాన్ని అందించేందుకూ,
తయారుచేయటంలో పరిశుభ్రతను
పాటించేందుకూ, డబ్బా మీది
సూచనలను జాగ్రత్తగా పాటించండి.




6 మాసాలు నించి




4 మాసాలు నించి




6 మాసాలు నించి

ఉచితం
సెరిలాక్ బేబీ కేర్ బుక్
వ్రాయండి. సెరిలాక్
పోస్ట్ బాక్స్. నెం 3
న్యూ ఢిల్లీ 110008




SWAMY/FSL/5112/TEL

జగదీశ్ పేపర్లోంచి తలతిప్పి-

"సరే... స్నానంచేసిరా- అలా బయటికె ళ్దాం" అన్నాడు.

తను చెప్పబోయేదానికి ఏవిధమైన ఆశ్చ ర్యం ప్రకటించకుండా అన్నయ్య అలా అనటం వానుకి ఎంతో రిలీఫ్‌గా అని పించింది.

కారు నెమ్మదిగా సాగుతోంది. వాను డ్రైవ్‌చే స్తున్నాడు. ఎండాలేదు. వానాలేదు. వాతావ రణం చల్లగా, కాస్తంత మబ్బుగావుంది. జగ దీశ్ విశ్రాంతిగా జేరగిలబడికూర్చుని ఓర కంటితో వానుని చూస్తున్నాడు. వాను దీక్షగా కారునడుపుతున్నా మనసులో ఆలోచిస్తున్నా డు- ఎలామొదలుపెట్టాలా అని. అన్నయ్యని చూస్తే ఇదేంపట్టినట్టులేదు. హాయిగా చల్లగా లిని అనుభవిస్తూ ప్రకృతిదృశ్యాలు చూస్తున్నా డు. తనేదో చెప్తే విందాం, లేకపోతే మానేద్దాం అన్నట్టుంది అతని ధోరణి. తన ఆతృతేగానీ అన్నయ్యకేమీలేదన్న ఊహఅతనిలో ఉక్రోషం పెంచింది. ఎలా మొదలుపెట్టాలాఅని సంగ్ది గ్ధస్థితిలోవున్న తనని మరొక్కసారి అన్నయ్య ప్రేమగా అడిగితేనేం అని బాధకలిగింది. అంతలోనే అన్నయ్యే అడగకపోతే తనేంచెప్ప కూడదనే పంతం కూడా కలిగింది.

జగదీశ్ వానుని జాగ్రత్తగా గమనించటం మొదలుపెట్టాడు. ఏదో చెప్తానని బయలుదేర దీశాడు. కాని నిశ్శబ్దమే రాజ్యంచేస్తోంది. నిజా నికి వాను చెప్పదల్చుకున్నది మూడొంతులు తను గ్రహించేశాడు. కాని వాను ముఖతానే అతను ఏంచెప్పదల్చుకున్నాడో అది తనకి తెలియాలి. ఇలాంటి విషయాల్లో ఊహించటం జగదీశ్‌కి ఇష్టం ఉండదు. ఒక దానికి మరొకటి అనుకునే ప్రమాదం ఉంటుందని అతనికి భయం. అందుకే వాను చెప్పదల్చుకున్నది అతనే చెప్పాలని ఆశిస్తు న్నాడు.

వాను స్వతహా చాలా మెత్తని స్వభావంగల వాడు. ఎదుటివాళ్ళు కష్టపెట్టుకుంటారంటే తన మనసులోని మాటకూడా చెప్పలేని మొహ మాటస్థుడు. నిజంగా ఇంత సున్నితంగా మగ పిల్లలు వుండరేమో అనిపిస్తుంది.

ఇలా ఎవరి ఆలోచనల్లోవారుండిపోగా కారు గండిపేటవైపు పరుగు పెడుతోంది.

చివరికి జగదీశే నిశ్శబ్దాన్ని భంగపరుస్తూ-

"ఎక్కడికెళ్తున్నాం?" అన్నాడు.

"ఫలానా అని ఒకచోటకేమీకాదు, అలా వెళ్ళగలిగినంత దూరం వెళ్తూ మాట్లాడు కుందామని ... " అన్నాడు.

"ఓకే... పెట్రోలు బాగావుందోలేదో చూసుకు న్నావా?"

"ఫుల్‌గా వుంది"

"సరే... మరింక మొదలుపెట్టు" అన్నాడు జగదీశ్.

మళ్ళీ వానుకి సమస్య మొదలైంది- ఎలా మొదలుపెట్టాలా అని.

చిన్నగా నవ్వుతూ- "ఇంత నాన్చుడైతే ఎలారా" అన్నాడు జగదీశ్.

ఈ మాటకి వాను చిన్నబుచ్చుకున్నాడు. సిగ్గుపడ్డాడు.

"అదికాదన్నయ్యా... చెప్తాను- నాక్కొంచెం టైమియ్యి, నన్ను తొందరపెట్టకు" అన్నాడు గంభీరంగా.

"బోలెడు టైము యిప్పటికే యిచ్చాను" అంటూ గలగలా నవ్వాడు జగదీష్.

వాను చేసేదిలేక తనూ నవ్వాడు. వెంటనే చెప్పాలని మొదలుపెట్టబోయి ఆగాడు.

జగదీశ్ వానుకేసి పరిశీలనగా చూసి.

"వానూ... ఒక్కసారి కారాపు" అన్నాడు. వాను నెమ్మదిగా పక్కకి తీసి కారాపాడు.

"నాకేసి చూడు" అని కాస్సేపు చూసి-

"నువ్వు చెప్దామనుకుంటున్నది నేను చె ప్పనా?" అన్నాడు.

"చెప్పు చూద్దాం" అన్నాడు వాను. అలా అనడంతో అతనికి ఒక వెసులుబాటు కనబ డింది. అన్నయ్యేదో చెప్తాడు, అదికాదని తను అసలు విషయం చెప్పడానికి కొంచెం ధైర్యం చిక్కుతుంది అని ఆశ.

"నువ్వు సుమగురించి నాకేదో చెప్దామను కుంటున్నావు కదూ?" అన్నాడు.

వాను గతుక్కుమన్నాడు. అన్నయ్య తెలి విగా గ్రహించేశాడని ఆశ్చర్యపోయాడు. తనె





క్కువ చెప్పనవసరం లేకుండానే విషయం తెలిసిపోతుందని ఆనందం కలిగింది. ఏది యేమైనా తను మాత్రం చాలా నిక్కచ్చిగా వుండాలనే దృఢ నిర్ణయం వచ్చింది.

"ఏమిటి... నేను పొరబాటు అన్నానా?" అన్నాడు.

"లేదన్నయ్యా! నువ్వు కరెక్ట్‌గా చెప్పావు. నేను సుమగురించి చెప్దామనే వచ్చాను. ఎందుకో ఎప్పుడూ ఎవ్వరిని చూసినా కలగ నంత ఆత్మీయత సుమ విషయంలో నాకు కలిగింది. కానీ నాకెంత ఆలోచించినా మన కుటుంబాల మధ్యవున్న అగాధానికి కారణం అర్థంకావటంలేదు. వదినని ఒకటి రెండుసా ర్లు కదిపి చూశాను. ఆమె కూడా నాకేం చెప్పలేకపోయింది. నేను సుమని పెళ్ళి చేసుకో వడమనేది దుస్సాధ్యమైన విషయమంటావా"

జగదీశ్ రెప్పవేయకుండా తమ్ముడివైపు చూస్తుండిపోయాడు. వాసు ఎంతో నెమ్మదిగా, గంభీరంగా, స్పష్టంగా చెప్పిన విధానానికి అత ను ముగ్ధుడయ్యాడు. అతని కళ్ళల్లోకి పరీక్షగా చూస్తే అది అతను తొందరబాటుతో తీసుకున్న నిర్ణయం కాదని, చాలా లోతుగా ఆలోచించు కుని మరీ నిర్ణయంచేసుకున్న విషయమనీ తెలుస్తుంది.

"ఒరే వాసూ... నువు నాకు తమ్ముడివైనా నాకు నిన్ను చూస్తే పుత్రవాత్సల్యం కలుగు తుంది. బహుశా దానికి కారణం మనిద్దరిమధ్య ఉన్న వయసుతేడా, నువ్వు నాచేతులమీదగా పెరగడం కావచ్చు. అందుకే నీ మంచికోరి ఏది చెప్పటానికైనా నేను జంకను. నువ్వు సుమని పెళ్ళి చేసుకోవాలని అంత దృఢంగా అనుకుంటే ఎంతోకొంత అశాంతిని నువ్వు ఎదుర్కొనక తప్పదు. నేనూ, వదినా పూర్తిగా నీవైపు నిలబడగలమని కూడా చెప్పలేను" అని ఆగాడు.

అయితే పరోక్షంగా నా సహాయ, సలహాలు ఎప్పుడూ నీకుంటాయి" అని ముగించాడు.

"అదేమిటి అన్నయ్యా" అని చటుక్కున అడిగాడు వాసు.

★ ★ ★

"ఎందుకని నాన్నగారూ?" అంది సుమ తండ్రి వైపు పరిశీలనగా చూస్తూ.

"నువ్వలా సూటిగా ప్రశ్నిస్తే చెప్పటం కష్టమే! అయినా నేను నీ నుంచి ఏమీ దాచాలనీ, నిన్ను బాధపెట్టాలనీ అనుకోవ డంలేదు. మీ అమ్మ ఆలోచనా విధానం చాలా చిత్రమైంది. అది సరైన విధానం కాదని నాకు తెలిసినా నేనామెని అణు మాత్రం మార్చలేక పోయాను. ఒక విధంగా చెప్పాలంటే ఆమె ఎంతో మొండిగా వున్నా నేనామెని బాధించటం ఇష్టంలేక సర్దుకుపోతూంటాను. నిజానికి ఆమెని వ్యతిరేకించాల్సినంత అవ సరం కూడా నాకు కలగలేదు. ఎందుకంటే అది నా ఇంట్లో సమస్య కాకపోవటమే. ఆమె అభిప్రాయాలు ఆమెవిలే అని కొట్టిపారేశాను. ఇప్పుడు ఈ విషయం ఇలాంటి మలుపుతిరు గుతుందని నేనెప్పుడూ ఊహించలేదు. మరి... సమయమొచ్చినప్పుడు చెప్పకతప్పదు" అంటూ సుదీర్ఘంగా ఊపిరి పీల్చుకున్నాడు విశ్వనాథ్.

సుమ అసహనంగా కదిలింది. తండ్రి రెండు ముక్కల్లో విషయం చెప్పేస్తే పోతుంది. ఈ వుపోద్ఘాతం ఏమిటబ్బా అనిపించిందామె కి.

అంతలో ఫోన్ మ్రోగింది. జగదీశ్ మాట్లాడు తున్నాడు. వాసు, విశాలాక్షిలతో తనిప్పుడే హై ద్రాబాద్ నుండి వచ్చానని ఫలానా హోటల్లో దిగుతున్నాం రమ్మని చెప్పాడు. సుమని తీసు కుని విశ్వనాథ్ వాళ్లను కలుసుకున్నాడు. వాసు, సుమల కోరిక మేరకు విశాలాక్షి గతాన్ని వినిపించింది

★ ★ ★

మేళతాళాలతో కొడుకూ కోడలూ గుమ్మంలో కి వచ్చి నిలబడగానే సుశీల హడావిడిగా హారతి పళ్ళెం, ఎర్రనీళ్ళు పట్టుకొచ్చింది-

విశాలాక్షి కొత్త పెళ్ళికూతురుగా ఆయింట్లో కుడికాలు మోపుతోన్న ఆక్షణంలో తొలిసారిగా అత్తగార్ని చూసి కించిత్ ఆశ్చర్యపోయింది. పల్చగా, తెల్లగా చెంపకి చేరడేసికళ్ళతో చెంప లు ధగధగలాడిపోతూ కనిపించిన సుశీల తనకి అత్తగారంటే ఎలాగో అనిపించింది. సుశీల హారతి ఇచ్చి యిద్దర్నీ అప్యాయంగా

లోపలికి ఆహ్వానిస్తుంటే రెండేళ్ళ పసివాడు వచ్చి ఆమె కాళ్ళకి చుట్టుకుపోవడం చూసి మరీ ఆశ్చర్యపోయింది.

అప్పుడే పదిహేనేళ్ళు నిండి పదహారులో పడింది విశాలాక్షి. ఇంతలో జగదీశ్వర్రావుతో పెళ్ళయింది. మెట్రిక్ పాసయిన వుత్సాహంతో పైకి చదువుతానని కాస్త హఠం చేసినా, తల్లి దండ్రుల బోధలకి త్వరలోనే లొంగిపోయి పెళ్ళి కి వొప్పుకుంది విశాలాక్షి. అయితే పెళ్ళయిన మరునాటి నుండే భర్త అనురాగంతో ఆమె పూర్తిగా ఆనందంలో మునిగిపోయింది. కాలేజీ చదువుల గురించి పూర్తిగా మర్చిపోయింది. జగదీష్ చదివింది ఇంజనీరింగ్ అయినా చక్కని సాహిత్యాభిలాష, పుస్తకపఠనంమీద మక్కువవున్న వాడుకావడంతో అతనామెకి మరింత వుత్సాహాన్ని పంచియిచ్చాడు. అంద మైనదేకాక, తెలివైన భార్య దొరికిందని అతను మురిసిపోయాడు. తను ఎన్నో చెప్పాడు. మరె న్నో చదివించాడు. చాలా తక్కువ సమయంలో వాళ్ళిద్దరూ మంచి మిత్రులైపోయారు. ఆ మైత్రి రోజురోజుకీ ఒకరినొకరు మరింతగా పెన వేసుకునేలా చేసింది.

పెళ్ళయిన మూడునెలలకి అత్తారింటికి కా పురానికొస్తున్న విశాలాక్షిని చూసి అంతావిస్తుపో యారు. ఆమె కళ్ళనీళ్ళయినా పెట్టకుండా కలకల్లాడుతూ అత్తారింట్లో అడుగుపెట్టింది.

అయితే అలా అడుగుపెట్టిన మర్నాటికే అక్కడతనికి ఊపిరి సలపనట్లు అని పించిందామెకి. ఇల్లంతా విషాదంగా, మబ్బు పట్టిన ఆకాశంలా, గుబులు గూడుకట్టుకు పోయిన మనసులా అనిపించింది.

ఎంచిచూస్తే కారణమేమీ కనిపించలేదు. అందంగా, నిండుగా వుండే అత్తగారి ము ఖంలో కళలేదు. కళ్ళనిండా నీలినీడలు. మామగారు యింట్లో అడుగుపెడుతుంటే పెర ట్లో పూసిన పువ్వులు సహితం ముడుచుకుపో తున్నట్లనిపించింది. అందరూ హాయిగా నవ్వు తూ తుళ్ళుతూవున్నట్లుగా ఉండదు. ఎవరి పనులువారివి. ఎవరి ధ్యానాలు వారివి. ఎవరి పుస్తకాలు వారివి. ఒకరితో మరొకరు ఎక్కువగా మాట్లాడినట్లు కనిపించరు. -అంతే.

తనతో ఏకాంతంలో జగదీశ్ చూపించే ఉత్సాహం, సరదా మాటకారితనం అన్నీ పగ లు యింట్లో తిరిగేటప్పుడు ఏమైపోతాయా అని విశాలాక్షి ఎప్పుడూ అనుకొనేది. ఆ ఇంట్లో మరింత ఉత్సాహంగా అందరూ వుండచ్చనీ, వుంటే బాగుండుననీ అనుకునేది.

రెండేళ్ళ వాసు మాత్రం బిక్కుబిక్కుమంటూ వచ్చి రానిమాటలతో అప్పుడప్పుడు తనదగ్గర కొస్తుంటే ఆ క్షణాలే విశాలాక్షికి ఎంతో బాగుండేవి. జగదీష్ పుట్టిన సుమారు ఇర వైఏళ్ళ తర్వాత, నలభైపడిలో కొచ్చిన తరు ణంలో పుట్టినవాసు అత్తగారికి కొడుకులాకూడా అనిపించడు అలాఅని మనుమడిలాగా కూడా అనిపించడు.

వయసు చిన్నదైనా విశాలాక్షి చాలా తెలి వైంది, చురుకైంది. ఆమెది పెద్దమనసు. అలాంటి విశాలాక్షికి ఆ పసివాడిలో ఏదో దయనీయమైన పరిస్థితి కనిపించింది.—అ యితే ఆ ఊహకి ఒక రూపంలేదు. సాక్ష్యమూలే దు. అయినా ప్రేమతో దగ్గరకు తీసింది వాసుని. వాడి బుగ్గలు మెత్తగా దూదిపింజల్లా వుండేవి. బాదుపాలు చెయ్యడానికి పెరుగు, వెన్నవేసి మెత్తగా పిసికి కలిపిన మైదా పిండిలా వుండేవి వాడి బుగ్గలని విశాలాక్షి నవ్వుకునేది.

* * *

వాసు విశాలాక్షి దగ్గర బాగా మాలిమయ్యా డు. ఎప్పుడూ కొంగుపట్టుకుని తిరగడం మొ దలుపెట్టాడు. తీర్చిదిద్దినట్లుండే వాడి ముఖక వళికలు విశాలాక్షికి ముచ్చటగా వుండేవి.

ఓ రోజు వాసుని చూస్తే మరీ ముద్దువచ్చి అత్తగారితో అంది "ఎలాగైనా వాసు కనుము క్కుతీరు బాగుంటుంది. మంచి అందగాడవు తాడు" అని.

ఈ మాటలు విని సుశీల గడగడ వణికిపో యింది. భయంగా చుట్టూకలియచూసింది. అత్తగారంతగా ఎందుకు భయపడుతోందో విశా లాక్షికి అర్థంకాలేదు. ఆలస్యంగా, కాని వయ సులో పుట్టడంవలన ఆ పిల్లాడిమీద తల్లి తండ్రులకి మోజులేదని మాత్రం గ్రహించగ లిగింది.

ఆ రోజు మధ్యాహ్నం చాలా ఎండగావుంది. అన్నంతినేసి మంచంమీద పడుకుని పుస్తకం




పట్టుకుంది విశాలాక్షి. కాని కొద్ది నిమిషాలల్లోనే పుస్తకం మంచం కిందపడిపోయి నిద్రలోకి జారుకుంది. ఎంతసేపు అలా నిద్రపోయిందో ఆమెకే తెలీలేదు. ఉలిక్కిపడి లేచేనరికి నిశ్శబ్దంగావున్న యింట్లో ఎక్కడో సన్నగా ఎవరో ఘర్షణపడుతున్నట్లు వినిపించింది. నెమ్మదిగా లేచి మండువాలోకి వచ్చింది. మామగారి గొంతు వినిపించింది ఆయన గదిలోంచి.

" ఈ దరిద్రుడ్ని నా కంటపడకుండా చూడలేకపోతే చంపిపోగులుపెట్టి విసిరేస్తాను." అంటున్నాడు— ఆయన.

విశాలాక్షి రెండు అడుగులు వెయ్యడం— మామగారి గుమ్మంలోంచి వాసు ఒక్కతోపుతో విసురుగా బయటపడటం జరిగిపోయింది. ఒక్క క్షణం తేడాతో ఆమె అతన్ని పొదువుగా పట్టుకోలేకపోవడంతో గా వాడి తల అక్కడున్న స్తంభానికి కొట్టుకుంది. వాడు కెవ్వునఅరిచాడు.

విశాలాక్షి రెండు అంగలువేసి వాడిని అందుకోబోయింది గాని అంతలోనే సుశీల మెరుపులావచ్చి పిల్లాడ్ని ఎత్తుకొని పడమటింటివైపు వెళ్ళిపోయింది—

విశాలాక్షి కొయ్యబారిపోయి రెండు నిమిషాలు అలాగే నిలబడిపోయింది. అంతలోనే తేరుకుని నోరెండిపోయే దాహం వేస్తుంటే వంటింట్లోకి వెళ్ళేధైర్యం చాలక దొడ్లో నూతిదగ్గరికి వెళ్ళింది. నీళ్ళుతోడుకుని ముఖం కడుక్కుంది. అవే తాగింది. చల్లగా వున్నాయి. కొంచెం ఉపశమనం కలిగినట్లుగా అనిపించింది.

ఓ పావుగంట అలాగే నూతి గట్టుమీద కూర్చుంది. గుండెల్లో సన్నని భయం, మంట— ఏమిటో తెలీని గాభరా బయలుదేరింది. జగదీశ్ త్వరగా వచ్చేస్తే బాగుండునని ఎన్నిసార్లో అనుకుంది—

నెమ్మదిగా వంటింట్లోకి తొంగిచూసింది. అక్కడ కనిపించిన దృశ్యం ఆమెని కలచివేసింది. చిరుచాపమీద అత్తగారు పడుకునుంది. ఆమె డొక్కలోదూరి వాసు యింకా వెక్కిళ్లమధ్య సన్నగా ఏడుస్తున్నాడు. తడి తువ్వాలు వాడి నుదుటి మీంచికట్టివుంది. అది నిద్రకాదు. నీరసంకాదు. ఆమె జీవచ్ఛవం మాదిరిగా వుంది. వాసుచుట్టూ ఆమె చేతులు పెనవేసుకుని వున్నాయి. ఆ చేతుల వేళ్ళు కదిలీకదలకుండా వాడివీపు నిమురుతున్నాయి.— బాగా పరీక్షగాచూస్తే దు:ఖాతిశయంతో ఆమెగుండెలు గుట్టుగా ఎగిసిపడుతున్నాయని తెలుస్తుంది.

ఆమె పడుకున్న తీరు శోకాన్ని పోతపోసినట్లుంది. విశాలాక్షి క్షణం స్థాణువులా నిలబడిపోయింది. తనక్కడికి వచ్చి అదంతా గమనించినట్లు అత్తగారు గ్రహిస్తే, పరిస్థితి బాగుండదని చడీచప్పుడూ కాకుండా అక్కడినుంచి కదిలి తమ గదిలోకి వచ్చింది. అయితే మనిషి కదిలివచ్చినా మనసక్కడేవుండిపోయింది. ఆమెని తనెళ్ళి ఓదార్చాలని ఎంతగా అనిపించినా ధైర్యం చాలిందికాదు. ఆలోచనలు ఆమె బుర్రనిండా రొదచెయ్యడం మొదలుపెట్టాయి. ఈ ఇంట్లో ఏదో ఘోరమైన రహస్యం దాగివుంది. అది తెలిస్తేగానీ తనేమీ యోచించలేదు. అది తెలిస్తేనే ఎవరైనా ఈ వాతావరణాన్ని అర్థంచేసుకోగలరు. చేతనయితే మార్చగలరు.

అయితే తను ఎవర్నడిగి తెలుసుకోగలనా అని ఆలోచించింది. భర్తనే అడగాలి. లేదంటే ఆడబిడ్డ కామేశ్వరి చెప్పాలి. కామేశ్వరి పెళ్ళికి వచ్చి హడావిడిగా వెళ్ళిపోయింది.

విశాలాక్షి జగదీశ్‌కోసం ఎదురుచూడటం మొదలుపెట్టింది. ఈరోజెలాగైనా అడిగి తెలుసుకోవాలనుకుంది దృఢంగా.—

పనిమనిషి వచ్చినట్లయి లేచివెళ్ళింది. అప్పటికే అత్తగారు లేచిగిన్నెలు సవరించటం కనిపించింది. వాసు అమాయకంగా, ఆదమరచి చాపమీద పడుకుని నిద్రపోతున్నాడు. ఆ క్షణంలో వాణ్నిచూసిన విశాలాక్షికి ఏడుపాగలేదు.

* * *

సాయంత్రం జగదీశ్ ఉత్సాహంతో ఉరకలు వేస్తూ యింటికొచ్చాడు. చేతిలో కాగితం, ముందుగా భార్య చేతిలో పెట్టాడు. అతనికి హైద్రాబాద్‌లో వుద్యోగం వచ్చింది. ఆ వార్త విన్న అత్తగారి ముఖంలో కొత్తకాంతి చూసింది విశాలాక్షి. ఆరోజు ఆమె కాస్త ఎక్కువగానే, ఆనందంగానే మాట్లాడటం చూసి ఆశ్చర్యపోయింది విశాలాక్షి. అప్పటి ఆమె ముఖం

మునురు చాటున మగ్గిమగ్గి ఒక్కసారి బయట కొచ్చిన చందమామలా అనిపించింది.

"అంతా కోడలి అదృష్టం. ఒరే జగ్గూ, అమ్మాయి వచ్చిన వేళమంచిది, ఆ పిల్ల గుణంమంచిది. అందుకే నీకు మంచి ఉద్యోగ మొచ్చింది" అంది.

ఆ మాటలకి విశాలాక్షి నిజంగా ఆనందపడి పోయింది.

"అవునూ, దూరమైపోతా గర్రా ఎలాగూ?" అంటూ ఒక్కక్షణంలో విషాదంగా అయిపో యింది. ఆ బాధ చూస్తే విశాలాక్షికి కూడా బాధ కలిగింది. అయ్యో వెళ్లకుండా వుంటే బాగుండును అనుకుంది. కాని వచ్చింది ఉద్యోగం కానీ మరోటికాదు. వెళ్ళకుండా వుండే ప్రసక్తిలేదు. అంతా కాస్త హుషారుగావున్న ఆ సమయంలో తాను అడగాలనుకున్నది ఎలా అడగాలా అనే సంగ్దిగ్ధస్థితిలో మౌనంగా వూరు కుండిపోయింది విశాలాక్షి.

విషయం విని సింహంలాంటి మామగారు చిరునవ్వు నవ్వారు. ఆయన ముఖం ప్రస న్నంగా కనిపించటం అదే మొదలు. మర్నా డు జగదీశ్ హైద్రాబాద్ వెళ్ళిపోయాడు.

"వెళ్తున్నానేగానీ నా మనసంతా నీ దగ్గరే వుంటుంది. నీకు మరీ తోచకపోతే మీ అమ్మగా రింటికి వెళ్ళు- అమ్మ నీకేమీ అడ్డుచెప్పదు" అన్నాడు జగదీశ్, వెళ్తూ-

అతనటు వెళ్లగానే పుట్టింటికి వెళ్ళిపోవా లని పించలేదు విశాలాక్షికి. ఏదో తెలియని అనుబంధం ఆమెనక్కడే ఆపింది.

ఆ తరువాత భర్త ఉత్తరం కోసం ఎదురు చూడ్డం తప్ప మరేపనీ లేకుండా పోయింది. ఇక్కడి గిన్నె అక్కడ పెట్టనీయకుండా అన్నీ అత్తగారే చేసుకుపోవడంతో విశాలాక్షికి పుస్తకా లు చదవడమేవుద్యోగమైంది. పాను మాత్రం ఆమెనంటిపెట్టుకునే వుండేవాడు.

మూడోరోజు సుశీల ప్రేమగా "రేపు మీ వాళ్ళింటికి వెళ్ళి నాలుగురోజులుండిరామ్మా" అంది.

విశాలాక్షికి ఏం సమాధానం చెప్పాలో తెలీలే దు. సిగ్గువేసింది. తలొంచుకుని నెమ్మదిగా

"ఆయన శనివారం వస్తానన్నారు. అప్పుడు ఇద్దరం కలిసి వెళ్లామని—" అంది.

"అయితే సర్లే- నీకు తోచకుండా వుంటే పుస్తకాలేమైనా చదువుకో" అంది మళ్ళీ-

"అలాగే" అంది విశాలాక్షి.



అర్థరాత్రి ఆదమరిచి నిద్రపోతున్న సమ యంలో పానుకెక్కటిల్లి ఏడుస్తున్నట్లు విని పించి విశాలాక్షి వులిక్కిపడి లేచింది.

నిద్రమత్తులో వుండి ఒక్కక్షణం ఏమీ అర్థం కాలేదు. నెమ్మదిగా మత్తు వదిలిన కొద్దీ చెవుల కి ఏడుపు వినిపించటం మొదలుపెట్టింది. అది సామాన్యమైన ఏడుపు కాదు. ఎవరో ఏదో పుచ్చుకుని బాదేస్తున్నట్లు అనిపించి, విసు రుగా మంచం మీంచి లేచి తలుపు తీసుకుని హాల్లోకి వచ్చింది.

అక్కడామెకి కనిపించిన దృశ్యం చూడగానే గజగజవణికిపోయింది. మామగారు పసివాణ్ణి బెల్టుపెట్టి ఇష్టం వచ్చినట్లు బాదేస్తున్నారు. పాను మెలికలు తిరిగిపోతూ గగ్గోలు పడిపోతూ ఏడుస్తున్నాడు.

విశాలాక్షి మరొక్క క్షణం ఆలస్యం చేయ కుండా తడబడుతూ పరుగెట్టికెళ్ళి పానుని రెండు చేతుల్లోకి తీసుకుని తన గదిలోకి పరుగె ట్టింది. అంత కంగారులోనూ ఆమె కళ్ళు అత్తగారి కోసం ఒక్కక్షణం వెదికాయి. సుశీల గోడవారుగా చాపచుట్టలా పడుకుని వుండటం కనిపించింది. విశాలాక్షి మరేమీ ఆలోచించ కుండా తన గదిలోకి వెళ్ళి పానును మంచం మీద పడుకోబెట్టింది.

ఆమె మనసాక్షణంలో ఆవేశంతో ఊగిపో యింది. ఆ పసివాడిమీద కరుణతో కరిగిపో యింది. తెల్లగా మృదువుగావున్న ఆ చిన్నారి




ఒళ్ళంతా వాచిపోయివుంది. ఎర్రటిచారికలు కాళ్ళమీద, చేతులమీద, ముఖంమీదా స్పష్టంగా కనిపిస్తుంటే భోరున ఏడ్చేసింది. పసివాడి దుస్థితికి ఆమె గుండెలు తరుక్కుపోయాయి. వాను భయంతో విశాలాక్షి మెడచుట్టూ చేతులతో చుట్టేసి అతుక్కుపోయాడామెని. తనకి రక్షణదొరికిందనే విషయం అర్థమైందేమో ఏడుపు ఆపాడుగానీ ఎక్కిళ్ళు మాత్రం ఆగటంలేదు. ఎగిరెగిరిపడుతున్నాడు.

వానుని పడుకోబెట్టి ఒళ్ళంతా కొబ్బరినూనె రాసింది. వానునిచూస్తే తనే అతనికి తల్లి అనేభావాన్ని పొందటం మొదలుపెట్టింది. విశాలాక్షి వానుమీద చెయ్యివేసి, ఏడుస్తూ పడుకుంది. తనకెందుకేడుపొస్తోందో తనకే తెలియదు. మనసులో తెలియని భయం ఆవహించింది. బయటకెళ్ళి అత్తగారెలావుందో చూసే ధైర్యం ఆమెకి లేకపోయింది. తనని తను నిగ్రహించుకోలేకపోయింది. తెలతెలవారుతుండగా మంచి నిద్రపట్టేసింది.

ఆరోజునుంచీ వాను పూర్తిగా విశాలాక్షి దగ్గరే ఉండిపోసాగాడు. స్నానం చేయించడం, బట్టలువేయడం, అన్నం తినిపించటం- అన్నీ ఆమే చేస్తోంది. ఉండుండి ఒక్కసారి తల్లిదగ్గరికి పరుగెట్టి ఆమె మెడచుట్టూ చేతులువేసి, ఆమె గుండెల్లో ఒదిగిపోయి గారాలుచేసే వానునిచూస్తే, పక్షిరెక్కలచాటున రెక్కలురాని గువ్వ కువకువలాడుతున్నట్లు చూసి మురిసిపోయేది విశాలాక్షి. అయితే వాను కొద్దిక్షణాలు మాత్రమే తల్లిదగ్గరవుండి, మళ్ళీ ఉరుకులు పరుగులతో విశాలాక్షి ఒళ్ళోకి వచ్చివాలిపోయేవాడు.

విశాలాక్షికి వానుసంరక్షణ ఒక వ్యాపకమైంది. వాడి ప్రతిచేష్టనీ విశ్లేషించుకోవడం మామూలైపోయింది.

ఆరోజు బాదం చెట్టుకింద కూర్చుని విశాలాక్షి నవల చదువుకుంటున్న సమయంలో వాను దూరంనుండి వేగంగా పరుగెట్టుకొస్తూ, రాయిని తన్నుకుని బోర్లాపడ్డాడు...చిత్రం! ఏడవలేదు. భయంగా చటుక్కున లేచి, వెనక్కి తిరిగిచూసి, మళ్ళీ పరుగెట్టి విశాలాక్షి ఒళ్ళో పడ్డాడు. వాడి ముక్కులోంచి రక్తం కారుతోంది. మోకాళ్ళు డోక్కుపోయాయి.

"అయ్యయ్యో... ఎందుకునాన్నా అంతపరుగూ? చూడూ! ఎలా రక్తం వస్తోందో" అంటూ ఆమె హడావిడిపడుతూ నీళ్ళకోసం నూతివైపు వేగంగా కదులుతూ అప్పుడే మధ్యాహ్నం నిద్రనుంచి లేచిన మామగారు అటుగా వస్తుండటం గమనించింది. ఆయన్నిచూసి భయపడిపోయి వాను అస్తవ్యస్తంగా పరుగెట్టబోయి బోర్లా పడిపోయాడని గ్రహించి విశాలాక్షి మనసు విలవిల్లాడిపోయింది. వాను కళ్ళల్లో భయమేగానీ తగిలిన దెబ్బలతాలూకు బాధ కనిపించటం లేదు.

మోకాళ్ళకి- మోచేతులకి కొబ్బరినూనె రాసింది. లావుగా వాచిన పెదిమకి పంచదార అద్దింది. వానుని ఒళ్ళోపెట్టుకుని కూర్చుంది. పుస్తకం చదవాలన్న ఆసక్తి చచ్చిపోయింది. జీవితం అన్నిటికంటె పెద్ద పుస్తకం, అదిచదివి అర్థంచేసుకునే శక్తేవుంటే అంతకు మించిన జ్ఞానం లేదు అనిపించించింది.

అప్పుడే అక్కడికొచ్చిన సుశీల వానుని చూసి, "ఎప్పుడు పడ్డాడూ? ఎప్పుడీ దెబ్బలన్నీ తగుల్చుకున్నాడు?" అంటూ వాపోయింది. పిల్లాణ్ణి చేతుల్లోకి తీసుకుని వాడికేసి జాలిగా చూసింది. వాడిముఖం దయనీయంగా వుంది. విశాలాక్షి నెమ్మదిగా జరిగింది చెప్పింది.

సుశీల భయం భయంగా దిక్కులుచూసి "నీదగ్గరే కూర్చొబెట్టుకో, ఆయన కంటబడితే మరేంలేదు" అంది.

వాను వదిన ఒళ్ళోపడుకుని అంతలోనే నిద్రలోకి జారుకున్నాడు. విశాలాక్షి వానుని భుజంమీద వేసుకుని తన గదిలోకి వెళ్ళింది. వానుని మంచంమీద పడుకోబెడుతుంటే, ఆమెకి అలసటగా అనిపించింది. పిల్లాడి పక్కన తనూ ఒరిగింది.

"వానుకి తండ్రిని చూస్తే ఎందుకంత భయం? భయం చాలామంది పిల్లలకి ఉంటుంది. అలాగే పిల్లలమీద పెద్దలకో పంకూడా. కానీ ఒకప్పుడు కాకపోతే మరొకప్పుడు పిల్లల్ని దగ్గరకితీయడం, ముద్దుచేయడం ఉంటుంది. ఇక్కడ అలాంటి దృశ్యమే తన కంటపడలేదు. ప్రేమలేకపోగా విద్వేషపూరిత

మైన ఆ తండ్రి చూపుల్ని ఈ పసివాడెలా తట్టుకోగలడు? ఆ చూపుల్లోని వేడిని వాడెలా భరించగలడు?

అసలా తండ్రికెందుకంత ద్వేషం?

ఇలా ఎన్నో ప్రశ్నలు... ఒక్కదానికీ తను సమాధానం చెప్పుకోలేని ప్రశ్నలు... జవాబులేని ప్రశ్నలు.

"వదినా ... వదినా" ఎవరో పిలుస్తున్నారు. విశాలాక్షి గదితలుపు ఓరగా తీసి చూసింది పక్కింటి సత్యవతి పిన్నిగారు వస్తూ కనిపించింది. విశాలాక్షి వెనక్కెళ్ళి మంచంమీద వాలింది –

మళ్ళీ మనసులో ప్రశ్నల రణగొణధ్వని మొదలవబోతూండగా బయటినుండి మాటలు వినిపించాయి.

"ఏమిటే అంత రుసరుసలాడుతూ వచ్చావు?" అంటోంది సుశీల, సత్యవతితో.

"రుసరుసేంకాదుగానీ – ఆ కొంపలో పని గెత్తిపోతోంది. ఒక్కక్షణం తీరికుండదు. ప్రతివాళ్ళూ ఏదో ఓపనిచెప్పే వాళ్ళే. అసలు నాగురించి ఆలోచించేవాళ్ళేలేరు" – అంటూనే అక్కడ కూలబడింది ఆమె.

"పోన్లే! ఏదో చంటివెంటా బాదరబందీ లేనిదానివనీ– కాస్త విడిమనిషివనీ... అందరూ ఏదో ఒకటి చెప్తారులే" నెమ్మదిగా అంటూ కత్తిపీట తీసుకుని కూరగాయలబుట్ట ముందుకు లాక్కుని కూర్చుంది.

సత్యవతి ఆ బుట్టా, కత్తిపీటా తన ముందుకు లాక్కుని "ఓ గిన్నెలో ఇన్ని నీళ్ళు పోసి ఇలాపడేయ్– అవునులే నీవన్నదీ నిజమేలే! తేరగా జీతం, బత్తెం యివ్వక్కర్లేని నౌకర్ని దొరికాను కదూ! పాపం అందరికీ లోకువ" అందిబాధగా.

"అక్కడచేసిచేసి వస్తావు. ఇక్కడకూడా ఈపనులు ఎందుకులే- ఇటివ్వు" అంది సుశీల.

"కాదులే వదినా! నిజానికి నాకు పనిచెయ్యాలంటే బద్ధకమే వుండదు. ఇంటెడిపనీ నేకాపోతే ఎవరు చేస్తున్నారు?" అంటూ వంకాయలు తరగడం మొదలు పెట్టింది సత్యవతి.

సుశీలేం మాట్లాడలేదు.. మళ్లీ సత్యవతే అందుకుంది–

"నాకో ఆలోచనొస్తోంది. ఆ వాసుగాణ్ని నాకిచ్చేయి వదినా! నేపెంచుకుంటాను. నీకూ బాధవుండదూ– అన్నయ్యా గోలావుండదు" అంది.

"ఇంకానయం– మీ అన్నపిల్లలు లేరూ– చివరివాణ్ని నీకు దత్తత యిస్తారని మీ అమ్మమ్మ అంది. మరి నువ్వు ఇలాంటి మాటలంటే– మీవదిన చీపురు కట్టతీస్తుంది–"

"ఆ......ఆ......తీస్తుంది! నోరుమూసుక్కూర్చుంటే అందరూ పట్టుకొస్తారు చీపురుకట్టలు. నువ్వేన్నైనా చెప్పు వదినా! నాకా పిల్లాడంటే ఒళ్ళుమంట. వాడిక, వాళ్ళమ్మకీ, చివరికి మా అన్నయ్యకీ కూడా నాడబ్బు మీదా, నావెనుకవున్న ఆస్తిమీదా ప్రేమేగానీ నామీదకాదు" అంది సత్యవతి.

"అ....చిన్నపిల్లాడికేం తెలుస్తుందిలే"

"అలాఅనకు. వాడికిప్పుడు పదేళ్లేగానీ వాడిది ఇరవైఏళ్ళ బుద్ధి. అయినా చాలా చిన్నప్పటినుంచి పెంచుకుంటే వాళ్ళకి నామీద ప్రేమ వుంటుంది. నాకూ పిల్లల ముద్దుతీరుతుంది. వాడికిప్పుడు అన్నీ తెలుసు... వాళ్ళమ్మ తెలుసు, నేను అత్తననీ తెలుసు, నాకువాణ్ని డబ్బుకోసం యిస్తున్నారనీ తెలుసు" అంది. సుశీల భయం భయంగా అటూయిటూ చూసి–

"సత్యవతీ! నిజంగా నువ్వు వాసుని తీసుకుంటే నాకంతకంటే కావల్సిందేముంది? వాడీ యింట్లోనరకం చూస్తున్నాడు" అంటూ కళ్ళనీళ్ళుపెట్టుకుంది.

"ఛా! అదేమిటే – నేనేదో బాధపెట్టడానికే వచ్చినట్లుంది– ఊరుకో– నేనాలోచిస్తున్నాను. వాణ్నే పెంచుకుందామని–"అంది.

ఇంతలో విశాలాక్షి వాసునెత్తుకుని వచ్చింది. పిల్లాణ్ని చూస్తూనే- "అదేమిటా దెబ్బలూ - అయ్యో ఏమైంది" అంది సత్యవతి.

సుశీల నెమ్మదిగా- "అదే చెప్తున్నా మీ అన్నయ్య దూరంగా కనిపిస్తే భయపడి పరుగెట్టి బోర్లాపడ్డాడు" అంది.

సత్యవతి పిల్లాణ్ని తీసుకుని విలవిల్లాడిపోయింది. విశాలాక్షి గ్లాసులో పాలుపోసి, వంచదార వేసికలిపి మళ్ళీ వాసుని అందుకుని





తన గదిలోకెళ్ళిపోయింది.

"సుశీలా! నీ కోడలు మాత్రం మహా బుద్ధి మంతురాలు. నిజంగా నీదెంతో అదృష్టం" అంది.

"నిజం... ఆ పిల్లని చూస్తే నాకాశ్చర్యమేస్తుంది. ఎంత ఓర్పు! ఎంత మంచితనం! ఆ పిల్లే యింట్లో లేకపోతే వాసెప్పుడో చచ్చిపోయేవాడు" అంది దుఃఖంగా.

"ఛా! అలా మాట్లాడకు. ఆ దేవుడికి తెలుసు. దేనికితగ్గ మార్గం దానికి చూపిస్తాడు".

"నా కడుపులో మాట చెప్పనా!... ఈ పరాయి పిల్లకున్న జాలీ, దయా మా కాముడికి లేదు"

"ఉష్! అన్నయ్యలేచి వస్తున్నట్లున్నాడు పొద్దు పోయింది. నావని నాకోసం కాచుకునే వుంటుంది - వెళ్తానొదినా"

"ఉండు కాస్త కాఫీ యిస్తా"

"ఎక్కడిదీ"—

"విశాలాక్షి వచ్చినప్పటినుండి, ఇంట్లో కాఫీ పెడుతున్నాం. ఆ పిల్లకి అలవాటనీ" అంటూ కాఫీ కలిపి ఇచ్చింది సుశీల

★ ★ ★

సత్యవతి పప్పు రుబ్బుతున్నా బుర్రలో వేగంగా ఆలోచనలు సాగుతున్నాయి. అదేవేగంతో పోటీపడుతూ ఆమె చకచకా పాత్రం తిప్పుతోంది.

వయసు పాతికేళ్ళే అయినా సత్యవతి వైధవ్యంవల్ల మరీ చాదస్తపు యింట్లో వుండటంవల్ల వయసుకిమించి కనిపిస్తుంది. సత్యవతి తల్లి కాంతమ్మ మళ్ళీ కడుపుతోవుంది. ఆమె నీరసంగా వుందని పొరుగింటి బామ్మ వంటసాయానికొచ్చింది. పైపనంతా సత్యవతి చేస్తోంది. తెల్లవారి నాలుగు గంటలకి లేచి, అప్పట్నించీ రెక్కలు ముక్కలు చేసుకుంటున్నా పని ఇంకా మిగిలేవుంది. ఆరోజు సత్యవతి తాతగారి తద్దినం. ఆరోజు తల్లైనా కాంతమ్మ అన్న మాటలు సత్యవతికి కారం రాసినట్లున్నాయి!

"ఏమిటో బామ్మగారు! ఇదంతా సత్యవతే చేసేయగలదు. నేనూ కాస్త ఓపికగా వుంటే అయ్యేపోయేది. మిమ్మల్నిలా అవస్థ పెట్టాల్సొచ్చింది" అంటోంది.

"దాందేముంది... మా యింట్లో చేసుకోమూ"!

"సరేగానీ సత్యవతికి తల తీయిస్తే మంచిదేమో"

"అవును... అదీ నిజమే. అనుకున్నా కుదరటంలేదు. కాలం మారుతోంది. మన మాటెవరు వింటారు"

"అవునమ్మా, మంచి చెప్తే వినరు. ఇంతటితో అయిపోయిందా? పరలోక గతులు వద్దూ" బామ్మగారు దీర్ఘం తీసింది.

"మన ఆచారాలూ, వ్యవహారాలూ అందరికీ అలుసయిపోయాయి — నాకయితే జుట్టు తీయించాలనేవుంది. వాళ్ళనాన్న ఒట్టి బేలమనిషి- పోనిద్దూ అంటారు" అంది కాంతమ్మ, బామ్మగార్ని సంతోషపెట్టడమే ధ్యేయంగా —,

సత్యవతికి కళ్ళనీళ్ళు గిర్రున తిరిగాయి. ఆ రుబ్బురోలు పాత్రంతో ఇద్దరి తలలూ బద్దలగొట్టాలనిపించింది. బామ్మగారు పదోఏట వైధవ్యం పొంది, దుర్భరంగా బతికినా, అదేదో చాలా గొప్ప బతుకుగా భావించి, నీతులు బోధిస్తుంది సరే, మరి నలభై ఏళ్ళు పైబడి, ఇంకా పిల్లల్ని కంటున్న తన తల్లికి జ్ఞానం లేదు. కర్మ, నుదుటిరాత, విధి -అంటూ చింతిస్తూ వుంటుంది.

సత్యవతికి పదెకరాల పొలం వచ్చింది అత్తారినుంచి, ఆ వూళ్ళో వున్న పాతపెంకుటిల్లు కూడా వచ్చింది. ఒక్కొక్కసారి ఆలోచిస్తుంటే, అత్తగారూ, బావగార్లు వాళ్ళే మంచివాళ్ళనిపిస్తుంది సత్యవతికి. అక్కడికి వెళ్ళి వున్నా తనని జాగ్రత్తగా చూసుకుంటామన్నారు. కానీ తనే యిక్కడేదో ఒరిగిపోతుందని, ఈ చూరే పట్టుకు వేలాడుతోంది. లేచిందిమొదలు పని పని —, ముగ్గురు చెల్లెళ్ళు — ఒకరు విడిచి మరొకరు పురుళ్ళుకొస్తూనే వుంటారు. అన్నగారి పిల్లల చాకిరీకి అంతమేలేదు.

**సత్యవతి పిండి తీసుకుని ఇంట్లో కెళ్ళింది. సరిగ్గా అప్పుడే కాంతమ్మ అంటోంది- "ఈసారి దీనికి జుట్టు తీయించేస్తాను" అని.**

**సత్యవతి గయ్యిమని అరిచింది. "నువ్వెవరు నా జుట్టు తీయించటానికి. పిచ్చి పిచ్చిగా**

మాట్లాడావంటే నేను నూతులో దూకి చస్తానంతే" అంటూ కేకలేసింది.

బామ్మగారు గమ్మునుంది. కాంతమ్మ కాస్త ఆశ్చర్యపోయింది. "ఆ... ఆ... ఏమిటావినురు? మన సంప్రదాయాలు మనం వదులుకుంటామా?" అంది పెద్దరికాన్ని నిలబెట్టుకోవాలనే తాపత్రయంతో.

"అవును... మన సంప్రదాయమంటే గుండు చేయించుకోవడమే" అని సత్యవతి గట్టిగా అరిచేసరికి కాంతమ్మ తగ్గింది.

కూతుర్ని వక్కగా పిలిచి-"సత్తీ! ఏమిటాఅరుపులు. ఏదో బామ్మగారి దగ్గర వరువుపోతుందని అన్నాను. నిజంగా నీ జుట్టు తీయిస్తానా" అంది. సత్యవతి ఏడుస్తూ- "నాతల వెంట్రుకులు నీకప్రదిష్టన్నమాట" అని అడిగింది.

దూరంగా మంచంలో వడివున్న అమ్మమ్మ పిలిస్తే అటు వెళ్ళింది సత్యవతి.

కాంతమ్మ బామ్మగారితో- "ఏదో చిన్నతనం అంది-"

బామ్మగారేమనుకుందో మళ్ళీ మాట్లాడలేదు. సత్యవతి తీవ్రంగా ఆలోచిస్తోంది. తను సుశీల వదిన కొడుకుని పెంచుకుని- వాడ్ని తీసుకుని ఏ వట్నమోపోయి, తన డబ్బు పెట్టుకుని తనుంటే ప్రాణానికి సుఖంగా వుంటుంది. అని ఆమె ఆరాట వడటం మొదలెట్టింది.

మధ్యాహ్నం భోజనాలయ్యి, అందరూ ఎవరి దారిన వాళ్ళు వడుకున్న సమయంలో నెమ్మదిగా సత్యవతి తల్లిదగ్గర చేరి- "అమ్మా! నేను సుశీలొదిన కొడుకుని పెంచుకుంటానే" అంది.

కాంతమ్మ వులిక్కివడి- "ఏ సుశీల? మన సుశీల కొడుకునే" అంది ఆశ్చర్యంగా.

"అవును... ఏం?"

కాంతమ్మ భయంగా అటూయిటూ చూసి,

"చాల్లే నోరుమూసుకో. ఇప్పుడీ మాటలు వెంకూ విందంటే నానా అల్లరి చేస్తుంది. అయినా నీకిదేం బుద్ధి? సొంత అన్నపిల్లలుండగా, ఎవరి పిల్లాడ్నో పెంచుకుని, వున్న నాలుగురాళ్ళూ ఆ వరాయి వాళ్ల ముఖాన కొడతానంటావే?" అంటూ నిలదీసింది.

"అదంతే! నీకు తెలీదు. నాకు వాడంటే ఇష్టం"-

"బాగుందమ్మా, బాగుంది. ఈ మధ్య మరీ మితిమీరి పోతున్నావ్- జాగ్రత్త" అంటూ మందలించింది తల్లి. కానీ తల్లి మాటలకి ఒళ్ళుమండింది సత్యవతికి.

★ ★ ★

వెంకటలక్ష్మి పిల్లాడికి పాలిచ్చి నిద్రవుచ్చింది. పెద్దపిల్లలిద్దరూ వీధిలో ఆడుకుంటున్నారు. ఆమె భర్త రామబ్రహ్మం సావిట్లో ఊయ్యాల బల్లమీద కూర్చుని ఊగుతూ, వక్కనే ప్లేటులో పెట్టుకున్న జంతికలు కరకరలాడిస్తున్నాడు. వెంకటలక్ష్మి ఇది మంచి సమయమనుకుంది. అత్తగారెక్కడో నిద్రపోతోంది. గాదె గది వక్కన ముసలమ్మ వడుకునుంది. అన్నిటికంటే ముఖ్యం ఆడబడుచు సత్యవతి యింట్లో వున్నట్టు లేదు. అదే ఆమెకి కావలసింది.

"ఏమండీ" అంటూ భర్తదగ్గరగా వెళ్ళింది...

రామబ్రహ్మం భార్యవంక ఆప్యాయంగా చూశాడు. నెల్లాళ్ళక్రితమే దర్జాగా మగపిల్లాడ్ని కన్న భార్యని చూస్తే రామబ్రహ్మానికి గర్వంగా అనురాగంగా అనిపించింది. అంతక్రితమే అతనికో కొడుకు, కూతురూ ఉన్నారు. అయితే మళ్ళీ భార్య నెలతప్పినవ్పటినుంచి మగపిల్లాడు వుట్టాలని రామబ్రహ్మం అన్ని దేవుళ్ళకీ మొక్కుకున్నాడు. దేవుళ్ళమాట ఎలావున్నా అష్టకష్టాలు వడి అబ్బాయిని కనాల్సిన వెంకటలక్ష్మికే పెద్ద లంచం ఎరచూపించాడు- అదే మూడుపేటల చంద్రహారం.

రామబ్రహ్మం అంత త్వరగా ఒక మగపిల్లాణ్ని కనాలనుకోవడంలో కొండంత యోచన వుంది- అతని చెల్లెలు సత్యవతి ఇల్లువట్టిన విధవాడబడుచు. అయితే ఆమె వెనకాల వది ఎకరాల భూమీ, వన్నెండు కాసుల బంగారం వున్నాయి. సత్యవతికి జీవితాంతం వట్టెడు మెతుకులు పెట్టాల్సిన బాధ్యతవుందిగానీ, ఆమె మీద మరోకానీ ఖర్చు పెట్టాల్సిన అవసరం లేదు.

ఆమె ఆస్తికి ఓ వారసుణ్ని అంటగట్టి, ఆ





ఆస్థిని కట్టుదిట్టం చెయ్యాలని అతనెప్పటి నుంచో ఆలోచిస్తున్నాడు. అలా ఒక కొడుకుని దత్తతివ్వాలనుకుంటే తనకో కొడుకు వుండాలి కదా! ఇప్పుడా సమస్య తీరింది-

ప్రస్తుతం సమస్య ఒకటే. అది వెంకటలక్ష్మి కి మూడు పేటల చంద్రహారం చేయించటం-

"ఏమిటీ దీర్ఘంగా ఏదో ఆలోచిస్తున్నారూ?" అంటూ వెంకటలక్ష్మి తనూ ఉయ్యాలబల్ల మీద కూర్చుంది.

"అబ్బే ఏమీ లేదు పిల్లాడు పడుకున్నాడా?" అన్నాడు.

"ఆ... పడుకున్నాడు గానీ - మీరే మాట మర్చేట్టూ, నన్ను ఏమార్చేట్టూ వున్నారు" అంది గోముగా.

"అదేవిటే వెంకూ! నిన్నెలా మోసం చేస్తానూ? కాకపోతే బంగారం రేటుకాస్త పెచ్చుగా వుంది. అదీకాక ఈసాలుకి దిగుబడి తక్కువగా వుందని, రావలసిన శిస్తులు రాలేదు" అన్నాడు.

"అదిగో నాకీ కుంటిసాకులు చెప్తేనే ఒళ్ళు మంట. ఇవన్నీ ఎప్పుడూ వుండేవే-" అంది నిష్ఠూరంగా.

"భలేదానివే... నేనేమన్నా అబద్ధమాడుతున్నానా" అన్నాడు రామబ్రహ్మం గుప్పెట్లోకి జంతిక తీసుకుని పటపట నలిపేస్తూ.

"నాకదంతా అనవసరం. మూడోనెలలో బాలసారెనాటికి నామెళ్ళో మూడుపేటల చంద్రహారం వుండాల్సిందే" అంది ఖచ్చితంగా.

"అమ్మబాబోయ్... నువ్వలా పట్టుబడితే నేనేమైపోతానే వెంకూ" అన్నాడు రామబ్రహ్మం. సరిగ్గా అప్పుడే పెరట్లోంచి అటురాబోతున్న సత్యవతి చటుక్కున ఆగిపోయింది- అన్నగారి అభ్యర్థన, వదినగారి వయ్యారం చూసి, తనప్పుడు అక్కడికెళ్ళడం వుచితంకాదని ఆగిపోయింది. ఆమెలోని ఆడమనసు అక్కడనుంచి కదలనివ్వలేదు. నెమ్మదిగా తలుపుచాటుకు తప్పుకుంది.

బాగుందండీ వరస. మీరన్నమాట మీరు నిలబెట్టుకోలేరు గానీ, నేనేదో పట్టుబడుతున్నానంటారేం?" అంటూ సాగదీసింది.

"నిజమే కానీ వెంటనే చేయించాలంటే

"ఏం... ఏం చూసుకుని చేయిస్తానన్నారు?"

"ఏమోలే... నువ్వంతలో మగపిల్లాణ్ని కంటావా అని అన్నాను"

"నేనేం అంత చేతకానిదాన్ని కాదు. ఈమాటలన్నీ నాకెందుకు, నా చంద్రహారం నాకు కావాలి"

"పోనీ ఏం చెయ్యమంటావో చెప్పు" అన్నాడు బుజ్జగిస్తూ.

"ఓయబ్బో! నేచెప్తే వినేట్టు!" అంది ఎద్దేవా చేస్తూ.

"అదేవిటీ... నువ్వు చెప్పింది నేనెప్పుడు వినలేదూ?"

"ఇదిగో! ముందే చెప్తున్నా! నాకు తోచింది నేను చెప్తా. మళ్ళీ నన్నేదైనా అన్నారంటే ఊరుకోను" అంది ఒయ్యారంగా.

"ఏమీ అనను... చెప్పు"

"మీ వంట డబ్బులయితే బోలెడు ఖర్చులు. ఇంత సంసారం ఈడ్వాలి. మీచెల్లెలి వంట డబ్బులుంటాయిగా" అంది.

రామబ్రహ్మం గతుక్కుమన్నాడు. వెంటనే సమాధానం చెప్పలేకపోయాడు.

"అదిగో! చూశారా? మీముద్దుల చెల్లెలి డబ్బు ఊసెత్తితే నోరుపడిపోతుంది?" పచ్చగా వంటిమీద పెట్టుకునే యోగ్యత ఆమెకెలాగూ లేదు- నేచేయించుకుని పెట్టుకుంటే తప్పా" అంది.

తలుపుచాటున నిలబడి వీళ్ళ మాటలు వింటున్న సత్యవతి మెటికలు విరిచింది, చెవులు రిక్కించి అన్నయ్య జవాబుకోసం ఆత్రుతగా ఎదురుచూడసాగింది.

"ఇదిగో వెంకటలక్ష్మి నామాటవిను. నేనెప్పుడూ సత్యవతిని డబ్బు అడగలేదు. దాని డబ్బుదానికే ఇస్తూవచ్చాను. అదేనాకు ఖర్చులకిచ్చేస్తూ వచ్చింది. పైగా ఎప్పుడే అవసరం వచ్చినా, అన్నయ్యా డబ్బు నాదగ్గరుంది తీసుకో అంటుంది. మిగిలిందేదో- ఆ పేరయ్య తాత దగ్గరవడ్డీకి తిప్పుకుంటోంది. మనం ఒక్కసారిగా ఇంత డబ్బు- అదీ బంగారం కోసం అడగటం బాగుండదేమో!" అన్నాడు.

"చూశారా చూశారా- కష్టం సుఖం పంచు



కునే కట్టుకున్న పెళ్ళాంకన్నా చెల్లెలంటేనే మీకభిమానం. అవునులెండి. అయినవాళ్ళూ అయినవాళ్ళూ ఒకటి– నేనెలాగైనా పరాయిదా న్నేగా'' అంది నిష్ఠూరంగా.

''ఛా! అవేం మాటలు. చూడూ! డబ్బు అడిగితే లోకువై పోతాం – ఎలాగూ మనబ్బా యిని అదిపెంచుకుంటే అంతా వాడిదే– అంటే మనదేగా–'' అన్నాడు బాగా గొంతుత గ్గించి.

''చాల్లెండి... ఈకబుర్లకేం నేను కరిగిపోను, నాకుమాత్రం చంద్రహారం కావల్సిందే. మీమ గాళ్ళ కబుర్లు ఇలాగే ఉంటాయి, పనయ్యేవ రకు అవి కోటలు దాటతాయి. పని అయ్యాక గప్‌చిప్'' అంది మొండిగా.

''అయితే ఇప్పుడేంచెయ్యమంటావు?'' అన్నాడు నిస్సహాయంగా. ఆమె మరికాస్త దగ్గ రగా జరిగి భర్త చెవిలో అంది. అయినా ఆమాటలు స్పష్టంగా సత్యవతికి వినిపించనే వినిపించాయి.

''మారుమాట్లాడకుండా మీచెల్లెల్ని ఓవె య్యి రూపాయలడగండి– సూటయాభైకి మించి బంగారం లేదు, ఆరుకాసులతో అందంగా వస్తుంది. అయినా మీరెందుకంత మొహమాటపడుతున్నారో నాకర్థంకావటంలే దు, ఏం? వృత్తినే అడుగుతున్నామా? ఇంట్లో పడితినటంలేదా? మనతో పాటే చూస్తు న్నాంగానీ వేరేచూస్తున్నామా''

''అవుననుకో''

''అనుకో– ఇనుకో కాదు అడగండి. అవసర మైన పనుందని చెప్పండి– లేదా చంద్రహారం వచ్చాక, ఇదేమిటని అడుగుతుందని భయంగా వుంటే– మా అన్నయ్య చేయించి పంపాడని చెప్పుదాం. ఏం? అర్థమైందా'' అంది నిక్కచ్చిగా.

''అయిందిలే– కానీ.....''

''ఏమిటీ కానీ అర్థణా– ఇంతోటి మీచెల్లెలి డబ్బు ఎవరూ తినేయరులెండి–'' అనికొంచె మాగి–

ఉక్రోషపడిపోయింది ''ఛీ...ఎంతసిగ్గు లేదో నాకు. ఏమిటో చంద్రహారం కోసం మురిసిపో తున్నాను కనక అడిగాను. మొన్నరాత్రి కల కూడా వచ్చింది. తళతళలాడుతున్న చంద్ర హారం వేసుకుని, బాలసారపీటల మీదకూర్చు న్నట్లు– ప్చ్! దేనికైనా పెట్టిపుట్టాలిలెండి. ఊరి కే ఆశపడితే సరిపోతుందా? యోగ్యతవుండ ద్దూ?''

''ఉష్ ఊరుకో... ఏదో కొంపమునిగిపోయిన ట్లు- ఇదిగో చూడు! బాలసారెనాటికి నీకు చంద్రహారం వుంటుంది. నువ్వేకమాట్లాడకు'' అన్నాడు నిశ్చయంగా.

వదిన ఏమంటుందో విందామని ఊపిరి బిగపట్టింది సత్యవతి.

ఇంతలో ''సత్తీ'' అంటూ మంచంలోంచి ముసలమ్మ పిలుపు వినిపించింది.

సత్యవతి గుట్టుగా అక్కడినుంచి మండవా గదిలోకొచ్చి అమ్మమ్మని చూసింది-

''కాసిన మంచినీళ్ళు ఇవ్వుతల్లీ'' అందామె.

సత్యవతి ఆలోచిస్తూ వంటింట్లోకెళ్ళింది. తన డబ్బుమీద వదినకి ఎంతవ్యామోహంగా వుందో అర్థమైంది. వదిన మాటలకి అన్నయ్య కాదనలేదనీ అర్థమైంది. ఇంక వాళ్లబ్బాయిని పెంచుకుంటే తనని కరకరా కొరుక్కుని తినేస్తా రనీ అర్థమైంది. సత్యవతి అమ్మమ్మకి మంచినీ ళ్ళిచ్చి- ఆమెకాళ్ళదగ్గర కూర్చుని ఆలో చించటం మొదలుపెట్టింది-

అటువైపుగా వచ్చిన వదినగారి ముఖంలో కనిపిస్తున్న అతిశయాన్నిచూసి ఆమె విషయం అర్థంచేసుకుంది. భర్తని అన్ని సందర్భాలలో లొంగదీసుకుని తమమాట నెగ్గించుకునే వదినకి తనమీద ఏమాత్రం జాలీ, దయా లేవుకదా అని అనుకుంటుంటే సత్యవతికి కళ్ళల్లో నీళ్ళూరాయి. తన నిస్సహా యస్థితికి మనసు కుంగిపోయింది. బేలగా దుఃఖం పొంగుకొచ్చింది. తనవంటిమీద వచ్చగా బంగారం పెట్టుకునేయోగ్యతలేదా- ఎందుకులేదూ? తనమొగుడు చచ్చిపోవ డంలో తన తప్పేముంది? తన నగలు పెట్టుకో కూడదనీ- మంచి చీరకట్టుకోకూడదనీ ఎక్క డుందీ- ఇలాంటివాళ్ళంతా కల్పించి, తన లాంటి నిర్భాగ్యుల్ని సృష్టించి, చాకిరీకి వాడుకో వడానికి ఉపయోగించుకుంటున్నారు. తనెంత కాలమిలా పడివుండాలి. సుఖంలేకుండా.





కాంతిలేకుండా- సత్యవతి ఆలోచిస్తున్నకొద్దీ కన్నీళ్ళు ఊరుతూనేవున్నాయి. రెండుసార్లు ఎగపీల్చింది-

అమ్మమ్మకదిలింది- "ఏమే సత్తి వందూ, ఏడుస్తున్నావా" అంది.

"లేదులే అమ్మమ్మా!" అంది. ఆ మాటల్లో దుఃఖం కనిపిస్తూనేవుంది-

"ఎందుకే... ఎవరేనా ఏమైనా అన్నారా?" అంది నెమ్మదిగా.

సత్యవతేం మాట్లాడలేదు. నిశ్శబ్దంగా అమ్మమ్మవక్కలో వడుకుంది. ఆ ముసలిప్రాణం విలవిల్లాడిపోయింది. సానుభూతిగా మనమరాలిమీద చెయ్యేసి వడుకుంది.



సత్యవతిని గుమ్మంలోచూసి ఆవదేళ్ళపాప లోపలికి తుర్రుమంది. "అమ్మా సత్యవతత్త యొచ్చింది" అని ఓ కేకవేసింది-

"పేరయ్య తాతవున్నాడా?" అంది ఎదురుగావచ్చిన రామాయమ్మనిచూసి.

"ఉండాలిచూడు... కచ్చేరీగదిలోవున్నాడు నాన్న" అంది.

సత్యవతి గదిలోకెళ్ళింది. అక్కడా ముసలాయన ఏవో కాగితాలుచూచుకుంటున్నాడు-

"తాతయ్యా" అంది

"ఎవరూ, సత్యవతా- రామ్మా- ఏమిటిలావచ్చావు" అన్నాడు.

"నేనోమాటచెప్పాలనివచ్చాను. మరోలాఅనుకోకు తాతయ్యా" అంది నూటిగా.

ముసలాయన కళ్ళద్దాల్లోంచి నిశితంగా సత్యవతినిచూసి- "ఏమిటో" అన్నాడు.

"నాడబ్బు మాఅన్నయ్యొచ్చి అడిగితే ఇవ్వకండి" అంది.

"ఏం...ఎందుకమ్మా?" అన్నాడాయన నెమ్మదిగా.

"అంతే... ఇవ్వద్దు" అంటుంటే ఆమెకి ఏడుపొచ్చింది.

డెబ్బై ఏళ్ళు పైబడిన పేరయ్య తాతకి అంతాకాకపోయినా కొంత అర్థమైంది. ఏదో జరిగింది వసిపిల్ల బాధపడుతోందని పించిందాయనకి. నెమ్మదిగా బుజ్జగింపుగా అసలు విషయం రాబట్టాలని నిర్ణయించుకున్నాడాయన.

"సత్యవతీ! ఏమిటలావున్నావు. నిన్నెవరైనా ఏమైనా అన్నారా?" అన్నారాయన.

"నన్నేమీ అనలేదు గానీ- తాతయ్యా! ఎవ్వరికీ నా డబ్బేగానీ నేనక్కరలేదనిపిస్తోంది. కేవలం నాడబ్బునే ఆశించేవాళ్ళకి నేను డబ్బెందుకివ్వాలి?" అంది.

పేరయ్యకి ఆమె బాధ అర్థమై జాలి పెల్లుబికింది. పాపం! వయసులోవుండగా వైధవ్యం ప్రాప్తించింది. ఏ అచ్చటాముచ్చటా తీరలేదు. కొంవచూస్తే మహాచాదస్తవు కొంప. ఇప్పుడిప్పుడే ఇలా భర్తపోయినవారిని కొన్ని యిళ్ళల్లో చదివిస్తున్నారు. ఏదో ఒక వ్యాపకం కలిగిస్తున్నారు. మొన్నామధ్య రాజమండ్రిలో ఒక జడ్జీగారు తన కూతురికిలాగే అయితే మళ్ళీ పెళ్ళిచేశాడు. నిజమే- పాపం! ఎన్నాళ్ళు ఈ చాకిరీ చేస్తూ ఏ సుఖమూ లేకుండావడి వుండటం?

"ఏమిటి తాతయ్యా! నీవేదో ఆలోచనలో పడిపోయినట్లున్నావు" అంది సత్యవతి.

"అబ్బే లేదమ్మా! అసలేం జరిగిందో నాకు చెప్పు"

"నా డబ్బు పెట్టి వాళ్ళు బంగారం కొని నగలు చేయించుకుంటారట- నేను పచ్చగా బంగారం పెట్టుకోడానికి యోగ్యత లేదుట"

"ఎవరన్నారామాట?"

"నాతో అనలేదు. అన్నయ్యతో మా వదిన అంటోంది. నా దగ్గర డబ్బు తీసుకుని ఆవిడగారికి అన్నయ్య చంద్రహారం చేయించాలిట" అంది అక్కసుగా.

"ఇప్పుడు డబ్బు లేకుండా అర్జంట్‌గా చంద్రహారమెందుకుట" అన్నాడాయన.

"అదే పాపం! ఆమెగారు అన్నయ్యగారి కోరిక మీద మగబిడ్డని కందిట"

ఆయన నవ్వి- "మగబిడ్డయినా, ఆడబిడ్డయినా కనడం మన చేతిలోవుందా?"

"ఏమో ఎవరికి తెలుసు- అదీ- నా మెడకి చుట్టడానికి"

"అంటే-"

"వాడినే నాకు పెంపు యిస్తారట" అంది సత్యవతి. పేరయ్యా తాత కాస్సేపు ఆలోచించి- "సరేలే- నువ్వెళ్ళు- నే చూస్తాను" అన్నారు.

"డబ్బు అడిగితే వడ్డీల్లో తిరుగుతోందని చెప్పు" -చివరిగా అంది సత్యవతి. ఆయన చిన్నగా నవ్వి "నాకు తెలుసులే తల్లీ! నువ్వు బాధపడకు అన్నారు"

ఇప్పుడు సత్యవతి మనసు స్థిమితంగా వుంది. పేరయ్యా తాత మంచివాడు. మనసులోని మాట ఇట్టే గ్రహిస్తాడు. సాయం చేస్తాడు. ఎగతాళి మాటలూ, ఎద్దేవా చేష్టలూ చేయడు. నిజంగా తను సుశీలాదిన కొడుకుని పెంచుకుంటే తాతయ్యా తనకి సాయం చేస్తాడు. తన యిష్టానికీ, తన మాటకీ విలువ యిస్తాడు- తాతయ్యా కల్పించుకొని మధ్యవర్తిగా వుండి తన డబ్బు ఊర్జితం చేశాడు కనుక వున్నది రెండింతలైంది గానీ- వీళ్ళ చేతుల్లోపడితే ఈపాటికి నగమైవుండేది.

ఆలోచనలతో యింట్లో అడుగుపెడుతుంటే నూకాలమ్మ ఎదురై - మిమ్మల్నోపాలి, సుశీలమ్మ రమ్మనింది" అని చెప్పింది.

"సర్లే... వస్తానని చెప్పు" అంది.

'ఇంతవరకు చేసిన పెత్తనాలు చాలవు కాబోలు మళ్ళీ మరోపిలుపు" అంటూ నన్నా యినొక్కులు నొక్కుతున్నవదినని చూసి ముఖం తిప్పుకుంది సత్యవతి. ఆమె మాటలు విననట్లూరుకుంది.

వెంకటలక్ష్మికి నగలమీదా, చీరలమీదా ఎంత మోజు వుందో ఇంట్లో పెత్తనం మీద కూడా అంత మోజు వుంది. ఎప్పుడూ ఇంట్లో వుండే ఆడబిడ్డ పెత్తనమేమైనా చేస్తుందేమో ననే భయం వుంది. అత్తగారూ, మామగారూ అడ్డువున్నారు కనుకగానీ లేకపోతే ఒక ఆట ఆడించాలనే సరదావున్న మనిషి వెంకటలక్ష్మి.

తన కొడుకుని పెంపుకివ్వబోతున్నాంకదాని ఆమెతో మంచిగా వుందామని ఎప్పుడూ అనుకోదు. ఎవరికోసం దత్తత తీసుకుంటుంది? తన కోసమేకదా? తలకొరివిపెట్టేందుకే కదా? పెంచుకున్నాక డబ్బివ్వకేంచేస్తుంది?- అనే ధోరణిలో వుంటుంది. పైగా తనుగాబట్టి కన్నబిడ్డని దత్తతిస్తోందని, తనని చూసి తనే గొప్పపడిపోతూంటుంది. "మాకేమైనాపిల్లలు బరువా? ఏదో అయిన పిల్ల- మనం చూడకపోతే ఎవరు చూస్తారూ అని చేయడంగానీ" అంటూంటుంది అత్తగారితో.

కాంతమ్మకి కూడా కోడలు చెప్పింది సబబుగానే అనిపిస్తుంది. కూతురు సత్యవతి కాస్త ఒదిగి మణిగి ఉంటే బాగుండుననిపిస్తుందామెకి. రేపు తాము చనిపోయినా, ముందు ముందు సత్యవతిని చూడాల్సినవాళ్ళు వాళ్ళే కదా" అంటుందామె.

అందుకే కోడలేమైనా అన్నా సత్యవతినే కేకలేసి కోడల్ని వెనుకేసుకొస్తుంది. ఇందువల్ల సత్యవతికీ తల్లంటే ప్రేమగావుండదు. తల్లితో కష్టం సుఖం, మనసులో మాట చెప్పుకోవాలనిపించదు- మరీ బాధగా వుంటే సుశీలాదిన దగ్గరికి పోయి కడుపులో మాట చెప్తుంటుంది.

"ఏమే సత్యవతీ... కందివప్పు అయిపోవచ్చింది, కందులు వేయించాలన్నాను. ఎక్కడికే పెత్తనాలు. అప్పుడే మూడయిపోయింది. ఎప్పుడు కందులు వేయిస్తావు, ఎప్పుడొంటచేస్తావు" అంటూ కాంతమ్మ సాగదీసింది.

"కందులు రేపుచూస్తాలే, వంట చేస్తా కాస్తాగి" అంది విసురుగా.

"ఎమిటా విసురు... నువ్వు చెయ్యకపోతే వనేం ఆగిపోతుందనుకోక. నాకు నలతగా వుండటం వల్ల నీమీద ఆధారపడాల్సివస్తోంది" అంటూ వుస్సురని కూర్చుంది కాంతమ్మ.

"ఎందుకలా గింజుకుంటావ్. నేనేం చెయ్యననలేదుగా, రేపుచేస్తా. నాకీరోజు కుదరలేదు- అంతే" అంది.

"అవున్లే... నీకీమధ్య పొగరెక్కింది" అంది




కాంతమ్మ.

"అవును... ఎక్కింది. అయితే ఏమిటీ?" అని తలెగరేసింది.

వెంటనే వెంకటలక్ష్మి కల్పించుకుని- "పోనీ లెండి అత్తగారూ- నేవున్నాగా చేస్తాను" అంది.

"అదేమిటమ్మాయ్ అలాగంటావు. పచ్చి బాలింతరాలవు. మూడో పురుడు పుట్టింట్లో పోయకూడదని ఇక్కడున్నావ్‌గానీ, అప్పుడే మీ నాన్న మూడు ఉత్తరాలు రాశారు"

"అయ్యోపాపం! కోడల్ని పంపకపోయావా మరి?" అని సత్యవతి వదిన వైపు తిరిగి వేళాకోళంగా- "నే చేస్తాలే వదినా- రేపు వేయి స్తానంటే ఊరుకోదు. నువ్వేచెప్పు- ఆవిడ నీకా అత్తగారు- నాకా?" అంది.

వెంకటలక్ష్మికూడా నవ్వి "పోనిస్తూ" అంది.-

"నీ ముఖానికి అత్తగారూ, అందాలు- వుంటే నారాతిలా ఎందుకుంటుంది?" అంటూ దీర్ఘంతీసింది కాంతమ్మ.

సత్యవతి చకచకా వంట మొదలుపెట్టింది— అదికాస్తాచేసి అక్కడపారేస్తే— సుశీలొదిన్ని చూసి రావచ్చు" అనుకుంటూ పనిలోపడింది.

★ ★ ★

సత్యవతి సుశీల అడుగుపెట్టేసరికి అంతా ఇంట్లో నిశ్శబ్దంగా ఉంది.

"వదినా! సుశీలొదినా" అంటూ లోపలికడు గుపెట్టింది.

ఎవరూ పలకలేదు. "ఏమయ్యారంతా. ఇల్లు బావురుమంటోంది" అంటూ లోపలికి వెళ్ళబోతుంటే అప్పుడే లేచివస్తున్న సుశీలకన బడింది. ఆమె అక్కడే నేలమీద పడుకు నుంది. మూర్తీభవించిన శోకంలాఉన్న సుశీ లని చూసి గతుక్కుమంది సత్యవతి.

"ఏమిటొదినా" అంది భయంగా.

"ఏముందే సత్తీ! చచ్చిపోవాలని ఉంది

ఇంకా ఎందుకీ బతుకు? ఎవరికోసం? ఎవరి ఆదరణ, ఆప్యాయతాపొందడానికి? ఏమీలేదు. పిల్లలుకూడా వాళ్ళవాళ్ల సంసారా లేర్పడి బాగానే ఉన్నారు"

"అదేమిటొదినా... ఏమైంది"

"ఇంకా ఏంకావాలి.. కాముడు వచ్చివెళ్ళిం దిగా నానారభసా చేసింది. పాపం ఆ పిల్లని కూడా అనరాని మాటలంది" అంది ఏడుస్తూ.

"నాకర్థం కావడంలేదు... ఈ సంగతి కాము డెందుకంతగా పట్టించుకుని వేపుకు తింటోందో నాకర్థం కావటంలేదు" అంది సత్యా వతి.

"నాఖర్మ... దానికఠినమైన మనసూ- అంతే"

"ఇప్పుడేం చేస్తావు?"

"ఏం చెయ్యగలను"

"ఏమే సత్యావతీ! నేలేకపోయినా వాసుని నువ్వు జాగ్రత్తగా చూస్తావుగా?"

"ఛ... అవేం మాటలే, నువ్వుకాస్త ఓర్పుగా, నిదానంగా ఉండాలి. చచ్చేంచేస్తాము- బతికే సాధించాలి" అంది ఓదార్చుతూ సత్యవతి.

"ప్చ్! ఇంక సాధించేదేముంది? నాకే ఆశా లేదు. నిజం కాముడు పెళ్ళిఅవాలని, ఈ బొందెలో ప్రాణాలు ఉగ్గపట్టుకుని ఉన్నాను. ఇంక ఫరవాలేదు. దాని బతుకు అది బతుకు తుంది. అదృష్టం కొద్దీ జగ్గూకీ మంచి పిల్లవ చ్చింది, దురదృష్టజాతకుడు వాసు. వాడు పుట్టడం నాకుశాపమో, వాడికేశాపమో తెలీదు కాని, నేనీబాధ భరించలేకుండా ఉన్నాను" సుశీల వెక్కివెక్కి ఏడ్చింది.

"ఛ! ఊరుకో... ఇంట్లో ఎవరూ లేరూ?"

"కాముణ్ని దింపిరావడానికి మీ అన్నయ్యా వెళ్ళారు. కోడలు ఆవీదికి పుట్టినరోజు పే రంటానికి వెళ్ళింది. నేనెంతో బతిమాలితే వె ళ్ళింది. పైగాకూడా వాసుని కూడా తీసుకెళ్ళిం ది"

"మళ్ళీ గొడవేమైనా జరిగిందా?"

"గొడవ జరగని రోజంటూ ఉండదు. నేపో యినా నువ్వా పసికందుని కాస్తకనిపెట్టుకుని ఉండు"

"అవేం మాటలు వదినా! నువ్వలా అంటుంటే నాకేమిటో చాలా భయంవేస్తుంది" అంది సత్యవతి.

"భయమెందుకే, నా మటుకు నాకు బతక డానికే భయంగాఉంది. చావులో ఏముంది?"

కాస్సేపు ఇద్దరూ నిశ్శబ్దంగా కూర్చున్నారు.



ఉన్నట్టుండి— "నేవెళ్తానొదినా! బాగా పొద్దు పోయింది" అంటూ బయలుదేరింది సత్యవతి. ఆమె మనసంతా కలతగా ఉంది. సుశీల మాటలు ఆమెకి భయం కలిగిస్తున్నాయి. బాధతో ఆమె హృదయం గిజగిజలాడిపోతోంది. ఏమీ, ఎవ్వరికీ చెప్పుకోవడానికి లేదు పెదవి విప్పేందుకు లేదు.

★ ★ ★

రామబ్రహ్మం మాటాపలుకూ లేకుండా నిశ్శబ్దంగా పడుకున్నాడు. నిద్రపోకుండా అలా నిశ్శబ్దంగా పడుకోవడం అలవాటులేదు. అందుకే వెంకటలక్ష్మి వెంటనే పసికట్టేసింది.

"ఏమిటలా వున్నారు?" అంది దుప్పటి సర్దివేస్తూ.

"అబ్బే... ఏంలేదు" అన్నాడు. అన్నాడే గాని అతని కంఠంలో 'చాలావుంది' అనే ధ్వని వినిపిస్తోంది. వెంకటలక్ష్మి ఆవులించకుండానే పేగులు లెక్కపెట్టగల సమర్థురాలు. అందుకే ఆమె ఊరుకోలేదు.

"ఏమీ లేకపోవడమేమిటి? మీ ముఖం అద్దంలో చూసుకోండి" అంది.

"నాకద్దమెందుకులే... నువ్వున్నావుగా" అని అటుతిరిగి పడుకున్నాడు.

"సరసాలకేంగానీ, అసలేం జరిగిందో చెప్పండి" అంది.

అసలు విషయం చెప్తేగానీ వెంకటలక్ష్మి ఊరుకోదని రామబ్రహ్మానికి స్పష్టంగా తెలుసు. జాప్యం చేసినకొద్దీ మరింత రాద్ధాంతం, రభస. అందుకే అతను చెప్పేయడానికే సిద్ధపడ్డాడు. ఎటూ ఈరోజుకాకపోతే రేపయినా తెలిసేదే. అందుకే భార్య ముఖంలోకి చూసి-

"డబ్బు సమకూరలేదు" అన్నాడు.

ఒక్కసారి వెంకటలక్ష్మి గతుక్కుమంది. అంతలోనే ఆమె ముఖం కోపంతో ఎర్రబడింది-

"ఏం... ఎందుకనిట?" అంది వెటకారంగా.

"పేరయ్యా తాత దగ్గరకెళ్ళాను- డబ్బు వడ్డీలకి తిరుగుతోందనీ, నోట్లు మళ్ళీ మొన్ననే తిరగరాశాననీ అన్నాడు" అన్నాడు.

"అయితే మనకవసరం వస్తే కూడా అడక్కూడదా?" అంది.

"అంటే...? మనకవసరం వుండదని అనుకుని తాతయ్య అలాచేసి వుంటాడు."

"ఆయనిష్టమేనేవిఁటి చేసెయ్యడానికి? మనతో ఒకముక్కయినా అనలేదు- అసలు మన డబ్బు మనకివ్వడానికేం ఆ ముసలాడికి"

"తప్పు... పెద్దాయన్నలా అనకూడదు"

"హు... పెద్దతనం నిలబెట్టుకుంటే వుంటుంది. అదంతా ఎందుకుగానీ మన సంగతేవిటి?" అంది ఆత్రుతగా.

"నేనూ అదే ఆలోచిస్తున్నాను. చేయించటం ఖాయం, కాకపోతే కాస్త అటూ యిటూ" అన్నాడు భార్య ఎక్కడ అలిగి కూర్చుంటుందోనని.

అయినా వెంకటలక్ష్మి తక్కువేంకాదు.

"అయినా ఈ డొంకతిరుగుడెందుకు? సూటిగా సత్యవతినే అడగండి" అంది.

"అడగచ్చనుకో....."

"అనుకో- ఇనుకోకాదు... అడగండి"

"రేపు తెల్లారినాక అడుగుతాను" అన్నాడు.

"ఎందుకూ రేపువరకు ఆగటం- ఇదేమైనా అర్థరాత్రా- నిండా ఏడుగంటలు కాలేదు. వంటింట్లో పనిలోవుంది. మీరెళ్ళి అడగండి. నేను ఈ చుట్టుపక్కలుండను లెండి. మరొక్క మాట- నేనేదో బలవంతంగా అడిగాననబోకండి, బాగుండదు" అంది.

రామబ్రహ్మానికి తెలుసు ఇక తప్పదని- నెమ్మదిగా లేచి వంటింట్లోకి వెళ్ళాడు. సత్యవతి కందివచ్చడి రుబ్బుతోంది.

"ఏమిటే సత్తీ... ఇంకా వంటకాలేదా?" అంటూ పలకరించిన అన్నయ్యని చూసి అవాక్కయిపోయింది సత్యవతి. అతనలా రావడం ఆమెకి కొత్తగా అనిపించింది. వెంటనే సర్దుకుంది. ఆకలేస్తోందేమో వచ్చివుంటాడనుకుంది.

"అయిపోయింది. ఏం? ఆకలేస్తోందా? ఇదిగో, పదినిముషాలు" అంది.

"అబ్బే... కంగారేంలేదు. ఆకలీ లేదు. నెమ్మదిగా చెయ్యి ఫరవాలేదు" అన్నాడు- అతని మాటల్నిబట్టి కొంచెం అర్థమైంది. ఏదో రాచకార్యం నిర్వహించబోతున్నాడని- వెంటనే ఆమె గంభీరమైపోయింది.




ఇంతలో కాంతమ్మ అటుగా వచ్చి- "ఏమి ట్రా రామం! ఇక్కడ కూర్చున్నావు" అంది. ఆ సమయంలో తల్లి అక్కడికి రావడం అతనికి నచ్చలేదు. ఆమె ఏక్షణానికెలా మాట్లాడు తుందో ఎవరికీ తెలీదు- తన అదృష్టం బాగుంటే 'ఇవ్వవే' పోయిందేముంది? మీలో మీరు సర్దుకోకపోతే ఎలా? అనగలదు. లేక పోతే-

"దాని డబ్బు ఎందుకురా? తప్పు- ఆడపిల్ల డబ్బు తినకూడదు" అని తనకే ఎదురు తిరగగలదు- అందుకే సందేహిస్తూ కూర్చు న్నాడు. కాంతమ్మ గోరు చిక్కుడికాయలు ముందేసుకుని కూర్చుంది రేవటి వంటకోసం- అతనొక్క క్షణం ఆలోచించాడు. ఇప్పుడు తను ఈ సంగతి అడక్కుండా లోపలికెళ్ళినా వెంకట లక్ష్మి కొరికేస్తుంది, ఏదో ఒకటి తేలిపోవడమే మంచిది.

"ఏమే సత్యవతీ! నీ డబ్బులోంచి నాక్కొంచెం డబ్బుకావాలి" అన్నాడు.

'సత్యవతీ' అన్న మన్ననలో భావం ఇట్టే గ్రహించింది. ఆశ్చర్యంగా చూసి "అదేవిఁటి కొత్తగా అడుగుతున్నావు"

"అవును... నాకో పదివేలివ్వు. నా వంటలో యిస్తాను" అన్నాడు ధైర్యంగా.

"ఎందుకూ" అంది చటుక్కున.

రామబ్రహ్మం అబద్ధమాడదల్చుకోలేదు, సు న్నితంగా నవ్వుతూ- "మీ వదినకి చంద్రహారం చేయిస్తానని మాటిచ్చాను. మగపిల్లాడు పుడితే- అందుకనీ..."

అతని మాటలు పూర్తికాకుండానే కిసుక్కున నవ్వింది హేళనగా- కాంతమ్మ అందుకుంది. "ఏమిరా? మగపిల్లాడంటే గొప్పా? ఆవిడ అను కుంటే ఆడో, మగో కనేయగలదా?" అంది.

తల్లిమాటలు బాధ కలిగించినా రామబ్ర హ్మాం బయటపడలేదు. అతనికి తల్లి ఏక్షణాన ఎలా మాట్లాడుతుందోననే భయం వుంది అందుకే. "ఏదోలేవే! నాకుమగపిల్లాడు కావాల నిపించి అడిగాను. కంది కదా"

"ఓయబ్బో! మాలావు పెళ్ళాం, అవునూ రామం! నీకు మగపిల్లాడున్నాడుగా! మళ్ళీ ఎందుకడిగావురా" అంది.

రామబ్రహ్మానికి మంచి అవకాశం దొరికింది.

"అదేవిఁటమ్మా! అందరం ఒకలాగే వుంటామా! నేను పైకి మాట్లాడనుగానీ, సత్యవ తంటే నాకెంతో ప్రేమ. దాని బతుకలా తెల్లా రిందని నాకెంతో జాలి. దానికీ ఒకదారీ, ఒక ఆశా వుండాలి కదా! అందుకే నా కొడుకుని దానికి పెంచుకోడానికిచ్చేస్తున్నా" అన్నాడు.

కాంతమ్మ ఒక్కసారిగా కరిగి నీరైంది. తన కొడుకు అంతదయగా ఆ మాటనడం ఆమె కెంతో ఆనందాన్ని కలిగించింది. దాన్నంటు కునే తన కూతురు బతుకిలా అయిందే అనే బాధ కూడా ఆమెని కలచివేసింది- ఏదియే మైనా వున్నంతలో ఇది గొప్ప సంగతే, అన్నద మ్ములకి ఆ మాత్రం ఆపేక్షవుంటే సత్యవతి అదృష్టవంతురాలే అని కాస్సేపు మురిసిపో యింది. ఆ ఆనందంలో వెంటనే అందు కుంది-

"ఏమే సత్తీ! వాడికి డబ్బు కావాలంటే నిన్నడగాలా, మగాడికామాత్రం సాతంత్రంలేదా?" అంది...

సత్యవతి అదను కోసం చూస్తూవుంది.

"నాడబ్బు వాడుకోడానికి నన్నడక్క ఎవర్ని డుగుతాడు?" అంది.

"అదేమిటే... నీ వ్యవహారాలన్నీ వాడేగా చూస్తున్నదీ?

"అందుకనేకదా! అడుగుతున్నాను" అన్నా డు రామబ్రహ్మం.

"పేరయ్య తాతని అడక్కపోయావా?"

"అడిగాను... కానీ డబ్బువడ్డీలకు ఇచ్చాన న్నాడు. నువ్వు గట్టిగా కావాలంటే యిస్తాడు" అన్నాడు.

"నేను గట్టిగా కావాలనెందుకంటాను? నాకే మైనా వచ్చగా నగలు చేయించుకునే యోగ్యత వుందా?"

"అదేంటే ఈజన్మలో చేసుకుంటే వచ్చేజ న్మలో యోగ్యత వస్తుంది" అంది కాంతమ్మ.

తల్లి కల్పించుకునేసరికి సత్యవతి గయ్యి మని లేచింది. "నీకెప్పుడు నీకొడుకులు, కోడ ళ్ళు చల్లగా హాయిగా ఉండాలి. వాళ్ళకే అన్ని యోగ్యతలూవున్నాయి," అంది గట్టిగా.

"ఆ మాటలన్నీ ఎందుకు? నేనడుగుతున్నా ను. ఇస్తేయివ్వు లేకపోతే లేదు" అన్నాడు

రామబ్రహ్మం నిష్ఠూరంగా.

"నాకేం వ్యవహారాలు తెలుసుననీ....పేరయ్యా తాతనే అడుగు" అంది సత్యవతి.

ఈ మాటలు వింటున్న వెంకటలక్ష్మి రంగప్రవేశం చేసింది.

"మీరంతగా ఎవర్నీదేబిరించి అడగక్కరలేదు ఏం? చంద్రహారం లేకపోతే ప్రాణం పోతుందా? ఉన్నప్పుడే చేయించుకుంటాము" అంది వుక్రోషంగా రుసరుసలాడుతూ.

"మంచిమాట చెప్పావు వదినా! ఇలాంటివన్నీ ఉంటేనేకదా మరి" అంది.

ఇలా సత్యవతనేసరికి వెంకటలక్ష్మి అహం దెబ్బతింది. అవమానం జరిగినట్లుగా దుఃఖం పొంగుకొచ్చింది.

"నామంచి చెడ్డలు నువ్వేం చెప్పక్కరలేదు" అంటూ ఏడుస్తూ వెళ్ళిపోయింది.

రామబ్రహ్మం విసురుగాలేచి భార్యవెంట నడిచాడు.

కాంతమ్మ కొంత నిర్ఘాంతపోయినా, వెంటనే కూతురిమీద విరుచుకుపడింది. నీకు పెద్దంతరం, చిన్నంతరం లేదంది. మంచీమర్యాదా తెలీదంది. వాళ్ళ పంచనుండాల్సిన దానివి వారికడుపులో మెతుకులు తీసుకుని తినాల్సిన దానివంది. ఒకటేమిటి చాలా మాటలంది. అన్నిటికీ సత్యవతి ఆవేశంగా, చదీమంటే ఫెడీమని సమాధానాలు చెప్పింది. తనెవ్వరితిండీ తినటంలేదంది. తన బతుకు తనే బతుకుతున్నానంది. ఇంట్లోవుండనిస్తున్నారంటే రెక్కలు ముక్కలు చేసుకుని చాకిరీ చేస్తున్నానంది. నీ దగ్గరనుండి అందరూ తీరిగ్గా పిల్లల్ని కంటున్నవాళ్ళే, గొడ్డులావని చేస్తున్నది ఎవరు? నేను కాదా అంటూ నిలేసింది, తల్లీకూతురూ పెంకులెగిరిపోయేలా కేకలు వేసుకున్నాక, సత్యవతి రుసరుసలాడుతూ వడమటింటి గదిలోకెళ్ళి తలుపేసుకుని మంచంమీద వాలిపోయింది. ఆమెకి రోషంతో ఏడుపొచ్చింది. కళ్ళనీళ్ళు తుడుచుకుని తీవ్రంగా ఆలోచించటం మొదలెట్టింది. ఎంతోసేపు ఆలోచించి ఒకనిర్ణయానికొచ్చింది.

పేరయ్యా తాతతో చెప్పి, తను సుశీలాదినకొడుకుని పెంచుకుని, వాడ్ని తీసుకుని పాతిక మైళ్ళ దూరంలో బస్తీకెళ్ళిపోయి, పొలంమీద వచ్చే డబ్బులు పెట్టుకుని బతికేయాలని గట్టిగా అనుకుంది. అలాఖచ్చితంగా అనుకున్నాక, సత్యవతికి నిద్రపట్టేసింది. సత్యవతి అభోజనంగా పడుకుందని ఎవరూ పట్టించుకోనేలేదు.



గోలగోలగా ఎవరో అరుస్తూ, ఏడుస్తుండగా మళ్ళీ విశాలాక్షికి మెలుకువ వచ్చింది. వాసు పక్కనే నిద్రపోతూ అస్థిమితంగా అటూయిటూ పొర్లుతున్నాడు. ఆ పసివాడిఒంటి మీద చెయ్యి వేసి చూసింది. ఒళ్ళు కాలిపోతోంది.

బయట మరీ గోల వినబడుతోంది.

"ఓలమ్మో... ఓలమ్మో! ఇదెక్కడి గోరమోతల్లో". అంటూ పనిమనిషి నూకాలమ్మ కంఠం వినిపించగానే లేచి తలుపుతీసి బయటకొచ్చింది- ఏదో తెలీని భయం ఆమెని గజగజలాడిస్తుండగా పెరటివైపు నడిచింది.

"ఏమిటి నూకాలమ్మా?" అంది.

"ఇంకా ఏటంటారేంటమ్మగారూ! అంతా అయిపోయింది. ఇటు రండి" అంటూ అరిచింది. నూతి గట్టుకి కాస్త ఇవతలగా అత్తగారు పడివున్నారు. ఆమె పడివున్న తీరూ, ఆ రూపం చూడగానే తెలుస్తుంది- అది ప్రాణంతో వున్న మనిషి కాదనీ, శవమనీను. ఎన్నో అనుమానాలు విశాలాక్షిని ఒక్కసారి చుట్టుముట్టాయి. కానీ అన్ని ఆలోచనలకీ దు:ఖం ఒక్కటే రూపం దాల్చి ఆమె చెంపలమీద అశ్రుధారలు ప్రవహించటం మొదలుపెట్టాయి. కాళ్ళు తడబడిపోయాయి. ఒళ్ళంతా ఒణికిపోతోంది భయంతో. గొంతులోంచి మాటలురాక అవాక్కయి, కొయ్యబారిపోయినట్లుండి




పోయిందో క్షణం.

ఆమెకి తెలీయకుండానే చటుక్కున అత్త గారి దగ్గరకెళ్ళి చెయ్యి పట్టుకుంది. అది చల్లగా బిగునుకుపోయింది. ఇది నిజంకాకూడదు. ఇదికల... కల- అంటూ మనసు మొరాయిస్తూనే ఉంది. "పిచ్చిదానా... ఇది వచ్చినిజం" అని వాస్తవం ఆమెని నవాల్‌చేస్తూనే వుంది. ఆమెకి దు:ఖం రెండింతలైంది. ఎవరికి చెప్పాలో, ఏం చెప్పాలో, ఎలా చెప్పాలో తెలీని అయోమయ పరిస్థితి. ఆమె కళ్ళముందు అర్థరాత్రి జరిగిన సంఘటన ఇప్పుడు జరుగుతున్న సంఘటన కలగా పులగంగా కదులుతూ భయపెడుతున్నాయి. ఇంతలో మామగారు బయటకొచ్చి-,

"ఏమిటీ... ఏమైందీ?" అనడం, రెండు అడుగులు అత్తగారివైపు వెయ్యడం; ఆమెని పరీక్షించి, కంగారుగా బయటకెళ్ళిపోవడం చూస్తూ స్థాణువులా వుండిపోయింది. అప్పుడు మరింత పరీక్షగా చూసింది. ఎడమ కంటి కింద నల్లగా కమిలిపోయి వాచివుంది. చేతుల నిండా, ముఖం నిండా దెబ్బలు. విశాలాక్షి హృదయం భగభగమండిపోయింది. తనా యింట్లో అడుగుపెడుతుండగా అందంగా, లేతతమలపాకులాంటి చెక్కిళ్ళతో తనకి హారతివళ్ళెంతో ఎదురొచ్చిన ఆ రూపం ఒక్కసారి కళ్ళల్లో మెదిలింది. గుండెల్లోంచి దు:ఖం ఉప్పెనలా ఎగిసిపడింది. ఆ అందం ఎందుకూ కొరగాకుండా వికృతంగా మారిపోయిందనే బాధ ఆమెని నిలువెల్లా కాల్చివేసింది. అందంగా, సున్నితంగా విరిసే పువ్వును కాలికింద వేసి ఎవరో నలిపేసినట్లు విశాలాక్షి విలవిల్లాడిపోయింది.

ఆమె ఇంతవరకూ తను ఇంట్లో చావు చూడలేదు. డెబ్బైరెండేళ్ళ అమ్మమ్మా, ఎనభై ఏళ్ళ మామ్మా ఇంకా బతికే వున్నారు. ఈ అర్ధాంతరచావు విశాలాక్షిలో పైశాచికమైన భయాన్ని కలిగించింది.

పక్కింటి గోడమీంచి ఎవరో పిలుస్తుంటే అటు చూసింది. "ఏమిటమ్మాయ్... ఏమైందీ?" అంటోందామె-

ఏం జవాబు చెప్పాలో, అసలు చెప్పవచ్చో, చెప్పకూడదో తెలీడంలేదు.

ఆమె మళ్ళీ పిలిచింది-

చేసేది లేక "మా అత్తగారు.... " అంటూ చూపించి యింట్లోకి పరుగెట్టింది.

వెనుకనుంచి సూకాలమ్మ మాటలు వీపులోంచి శూలాల్లా గుచ్చుకుంటున్నాయి.

"దొంగసచ్చినోడు ఏమీ ఎరగనట్టు ఈదిలో కెళ్ళిపోయాడు" అని ఇంకా ఏవేవో అంటోంది సూకాలమ్మ. అవి మామగార్ని వుద్దేశించి అన్న మాటలని అర్ధమవుతూనేవుంది - ఏవేవో ఊహిస్తూ విశాలాక్షి మరీ తల్లడిల్లిపోయింది.

మూడురోజులు పచ్చిమంచి నీళ్ళుముట్టకుండా ఏడ్చాడు జగదీశ్.ఒంటిమీద దెబ్బలవలన నూట నాలుగు జ్వరంతో మూసినకన్ను తెరవకుండా బాధపడి నాలుగోనాడు కళ్ళు తెరిచాడు వాసు. ఆ మూడురోజులూ జగదీశ్‌ని, వాసునీ రెండు కళ్ళకి రెప్పలుగా కాపాడుకుంది విశాలాక్షి.

సుశీల ఎలా చచ్చిపోయిందో ఎవరికీ తెలికుండానే, ఎటువంటి ఆరాలు రాకుండానే దహనకాండ జరిగిపోయింది. విశాలాక్షి తల్లి వచ్చి పదిరోజులూ ఆదుకుంది. కామేశ్వరి పన్నెండు రోజులున్నా ఆమె ఏడుస్తున్నంత సేపు అదంతా బుడిబుడి రాగాలుగానే అనిపించింది విశాలాక్షికి. అంత బాధలోనూ ఎంతో ఆశ్చర్యమేసింది. కామేశ్వరి మాటలతీరు చిత్రంగా అనిపించేది. ఆమె తల్లి చనిపోయినందుకు బాధపడుతోందో, లేక ఆ తల్లి దురదృష్టానికి వగస్తోందో ఒక్కొక్కసారి అర్థమయ్యేదికాదు.

"ఒక్కొక్కరి జీవితమంతే వదినా ! అలాంటి దురదృష్టవంతులకోసం మనం బాధపడీ ప్రయోజనం లేదు"

"కొన్ని కొన్ని మనం చేతులారా చేసుకుంటాం. వాటికి ఫలితం అనుభవించితీరాలి"

"మంచితనం మంచితనం అంటే ఎవరిక్కావాలి- సమయానికి తెలివిగా వుండాలి. అది ముఖ్యం"

ఇలా అప్పుడప్పుడు కామేశ్వరి పలికే పలుకులు విశాలాక్షికి చాలా అయిష్టంగా వుండేవి. అవి అసంబద్ధంగా వినిపించేవి. దురదృష్ట

వంతులకోసం మనం బాధపడి ప్రయోజనంలే దు! అంటే ఏమిటి!—

అత్తగారు చేతులారా ఏంచేసుకుంది? ఎందుకలా తల్లిగురించి మాట్లాడుతుంది కామేశ్వరి—

తెలివైనవాళ్ళు మనకి ఎక్కడైనా దొరుకుతారుగానీ మంచివాళ్ళు దొరకటం ఎంతకష్టం!—

ఇలా ప్రతిదానికీ విశాలాక్షికి ప్రతి ఆలోచన కలిగి కామేశ్వరిమీద విసుగ్గా అనిపించేది.

తల్లి పన్నెండోరోజు వెళ్ళబోతూ కూతు ...తంగా హెచ్చరించింది-

"ఈ పిల్లాణ్ణి మరీ మాలిమిచేసుకోకు- నీకు గుదిబండ అవుతాడు" అని.

ఈ మాటలు విని విశాలాక్షి తల్లి వైపు ఉరిమిచూసింది— ఆమె మాటలు జగదీశ్ ఎక్కడ వింటాడో అని తల్లడిల్లిపోయింది.

ఎన్నో ఒట్లుపెట్టిగానీ జగదీశ్ చేత మజ్జిగ అన్నం తినిపించటం గగనమైపోయింది విశాలాక్షికి. అప్పుడూ కామేశ్వరి పోటుకు మాట ఒకటంది.

"ఎంత పుణ్యం చేసుకుంటే అంత— నువ్వంతగా ఏడుస్తూ కూర్చుంటే నీ ఆరోగ్యం చెడుతుందిరోయ్" అంది.

అప్పుడు జగదీశ్ కళ్ళలో చర్రున పాకిన కోపం విశాలాక్షి గమనించకపోలేదు—

"మా అమ్మదేవత. ఇది మా నాన్న పోలిక- అందువల్ల రాక్షసి" అన్నాడు నెమ్మదిగా— అతనాక్షణంలో కసిగా అన్నా అది నిజమే అనిపించింది విశాలాక్షికి.

ఆరోజు అంతా వెళ్ళిపోయారు. వెళ్తూ విశాలాక్షి తల్లి కూతుర్ని పంపమని అడిగింది. జగదీశ్ వెళ్ళమన్నాడు. విశాలాక్షి నేను రానుపొమ్మనేసింది. ఆమె మింగలేక కక్కలేక వూరుకుంది.

"పోనీ వెళ్ళు" అన్నాడు జగదీశ్.

ఆమె అతని మెడ చుట్టూ చేతులు వేసి- "ఇప్పుడు నేను మిమ్మల్ని వదిలి ఒక్కక్షణం కూడావుండను" అంది. జగదీశ్ ఆమెని గట్టిగా కౌగలించుకుని గుండెలు నిండుగా వూపిరి పీల్చుకున్నాడు. అప్పుడే అక్కడికొచ్చిన వాను- "ఒదినా! పాలివ్వవా" అన్నాడు బిక్కుబిక్కు చూస్తూ. విశాలాక్షి వానుని చటుక్కున ఎత్తుకుంది. జగదీశ్ వానుని పరీక్షగా చూస్తూ, సన్నగా పుల్లల్లా వున్న అతని కాళ్ళూ చేతులు నిమురుతూ-"వీడి ఆరోగ్యం గురించి శ్రద్ధచెయ్యాలి" అన్నాడు సాలోచనగా.

"మనం త్వరగా హైద్రాబాద్ వెళ్ళిపోదాం" అంది విశాలాక్షి.

జగదీశ్ కళ్ళల్లో మెరుపు మెరిసింది. "అక్కడే మంచి డాక్టరుకి చూపిస్తే సరి. ఈ వాతావరణం మారితే కొంత ఉత్సాహం కూడా వస్తుంది" అంది.

జగదీశ్ ఎంతో ఆనందంగా, ఆరాధనగా విశాలాక్షి వైపు చూశాడు.

* * *

ఇల్లంతా నిశ్శబ్దంగా వుంది. వాను నిద్రపోతున్నాడు. విశాలాక్షి ఏదో పుస్తకం తిరగేస్తోంది. అక్షరాల మీద చూపులు దొర్లుతున్నా ఒక్కముక్క కూడా అర్థంకావడం లేదు. సగం ఆలోచిస్తూ, సగం పుస్తకం తిరగేస్తూ మత్తుగా, విరక్తిగా పడుకునుందామె.

సరిగ్గా అప్పుడే వచ్చింది సత్యవతి. చనువుగా విశాలాక్షి దగ్గరకొచ్చి, ఎదురుగా వున్న మంచం వాల్చుకుని కూర్చుంది.

"ఏమిటిలా వచ్చారు?" అంది విశాలాక్షి.

"ఏముంది? ఆ యింట్లో ఆవిరెట్టేసినట్లుంది. ఊపిరాడక పరుగెట్టుకొచ్చాను."

విశాలాక్షికి సత్యవతి గురించి పూర్తిగా తెలీకపోయినా, కొంత తెలుసు. పావం, చిన్నవయసులో భర్తపోయి, పుట్టింట్లో అందరికీ చాకిరీ చేస్తూ కాలం గడుపుతోందని విశాలాక్షికి జాలి.

"విశాలా... ఈ వానుని నేను పెంచుకుంటానని సుశీలొదినకి చెప్పాను. సరేనందికానీ, మా వాళ్ళ సంగతి బాగా తెలుసున్న మనిషికదూ, 'మీ వాళ్ళూరుకోరే! అంది-నిజమే, అందరూ రాక్షసమేళం" అంది.

విశాలాక్షి ఏమీ మాట్లాడలేదు. సత్యవతి మళ్ళీ కళ్ళనీళ్ళు పెట్టుకుని-

"అదిలా అర్థంతరం చావు చస్తుందనుకోలేదు, ఏం. చేస్తాం? దాని బతుకలా తెల్లారింది" అంది.





"అనలేం జరిగింది" అని అడగాలని నాలుక చివరిదాకా వచ్చింది విశాలాక్షికి. కానీ వరాయివాళ్ళ ద్వారా యింట్లో గుట్టు అతగడం సంస్కారమనిపించలేదు. ఏదైనా అంతగా చెప్పాల్సింది వుంటే తన భర్తే తనకి చెప్తాడు. ఇంతలో తను బయటపడిపోవడం ఎందుకు? అని ఆలోచించి వూరుకుంది.

సత్యవతే మళ్ళీ మొదలుపెట్టింది.

"నిన్న ఈ విషయం, అదే దత్తత విషయం యింట్లో అనేసరికి పెద్దగాలి దుమారం రేగింది. అందరూ నన్ను నానామాటలూ అన్నారు. మా వదిన ఏడుస్తూ కూర్చుంది. మా అన్నయ్య ఎన్నెన్నో అర్థాలు లాగాడు. ఎందుకేనా అప్పుడు డబ్బు అడిగితే యివ్వకుండా దాటేశావు అంటూ దెప్పిపొడిచాడు".

విశాలాక్షి ఊరికే వింటోంది. ఆమెకన్నీ అర్థంకాకపోయినా సత్యవతి బాధ అర్థం అవుతోంది.

"నేనూ బాగా రెచ్చిపోయాను. నా యిష్టం వచ్చినట్లు చేస్తాన"ని ఖచ్చితంగా చెప్పేశాను.

"అయితే ఈ ఇంట్లో ఒక్కక్షణం వుండనివ్వం"అని అమ్మ అంది.

"పిల్లాణ్ని తీసుకుంటే వాళ్ళు వీడినేమైనా చేసేస్తారనే భయం వేసింది. వాళ్ళముఖాలు చూస్తే అలా అనిపించింది" అంది సత్యవతి.

అప్పుడు నెమ్మదిగా అంది విశాలాక్షి-

"అయినా వానునొదిలి ఆయనగారు ఒక్కక్షణం వుండరు"

సత్యవతి సాలోచనగా చూసి- "నిజమే...వాడు మంచివాడు, వాడికి తగిన భార్యవు దొరికావు. నాకు అదే తృప్తి. నేను సుశీల దగ్గర గొప్పలుపోయాను. పిల్లాణ్ణి నేను చూసుకుంటాననేదాన్ని- కానీ యిప్పుడేంచెయ్యాలి అని ఆలోచిస్తున్నాను" అంది.

"మీరా విషయం ఆలోచించకండి. వాను మా పిల్లాడు. మీరొకవేళ అడిగినా ఆయనొప్పుకోరు. వాళ్ళమ్మ మీద ఆయనకెంతో ప్రేమ. ఆమె పోయినందుకే బాధతో కుంగిపోయారు" అంది విశాలాక్షి.

సత్యవతి కాస్సేపు మౌనంగా కూచుండిపోయింది. ఆమెంతో బాధపడుతోందని విశాలాక్షికి అర్థమైంది. కేవలం తన అత్తగారి గురించి, ఆమెకి వయసుమళ్ళాక పుట్టినబిడ్డ గురించి సత్యవతి ఎందుకంత బాధపడుతోందో అర్థంకాలేదు. ఆ బాధ కొంత అసహజంగా కూడా అనిపించింది. అయినా విశాలాక్షి ఏమీ మాట్లాడలేదు.

"నాకు ఆ విషయం తెలుసు- పిల్లాణ్ణి నేను తీసుకున్నా తీసుకోకపోయినా, నేను పేరయ్యా తాతసాయంతో ఏదో ఒకటి చేస్తాను. విడోహోమ్సు అని వుంటాయట. అలాంటిచోటకెక్కడికైనా వెళ్ళిపోతాను" అంది.

విశాలాక్షి ఆమె వంక జాలిగా చూసింది.

జగదీశ్, విశాలాక్షి హైద్రాబాద్ ప్రయాణం నాలుగురోజుల్లోపడింది. మర్నాడు తెల్లవారుతూనే విశాలాక్షి వాళ్ళమ్మగారింటికి వెళ్ళి రెండే రోజులుండి వచ్చేట్టు ఆ మర్నాడు రాత్రి హైద్రాబాద్ ప్రయాణమయ్యేట్టు అంతా నిర్ణయమైపోయింది. ఏవేవో సామాను సర్దుకుంటూనే సరిపోయింది.

సాయంత్రం స్నానంచేసి చీర మార్చుకుని గదిలోకి వెళ్ళిన విశాలాక్షి భర్త పడుకున్న తీరుచూసి గతుక్కుమంది. అక్కడే కింద బొమ్మలపుస్తకంలో బొమ్మలు చూసుకుంటూ కూర్చున్నాడు వాసు. భర్తని వెనుకగా చూసి కూడా గ్రహించేసింది- అతనేదో మధనపడుతున్నాడని. పైగా తల్లి జ్ఞాపకాలు అతన్ని విపరీతంగా బాధపెడుతూంటాయని కూడా ఆమె గ్రహించుకుంది.

నెమ్మదిగా అతని దగ్గరగా వెళ్ళి "ఏమండీ" అంది. అతనులిక్కిపడి భార్య వంక చూశాడు. ఆ కళ్ళలో నీరుచూసి ఆమె చలించిపోయింది.

"మీరిలా బాధపడుతూంటే నాకేమీ బాగుండదు. పైగా చాలా బెంగగా వుంటుంది" అంది.

"విశాలా... నీకింతవరకూ చెప్పని రహస్యమొకటి నాగుండెల్లో చితిలా మండుతోంది. అది దాచిదాచి నా మనసు మండిపోతోంది. ఇంకా దాచాలని ప్రయత్నిస్తే నన్నే దహించేసేట్టుంది" అన్నాడు. అతని మాటల్లో బాధ, వైరాగ్యం, నిర్లిప్తత ఆమెని కలచివేశాయి.

"చెప్పండి... మీరేం చెప్పినా వింటాను. అది ఎలాంటి విషయమైనా శిరసావహిస్తాను'' అంది.

"నాకు తెలుసు విశాలా! ఆ విషయంలో నేనెంతో అదృష్టవంతుణ్ణి. ఒకనాటి నా మనోవేదన ఈరోజు నీకు చెప్పుకోడానికి స్వేచ్ఛవుంది. ఒక మాటియ్యి... నేను చెప్పేది విన్నాక కూడ వానుని నువ్వు ప్రేమించి, ఆదరించలేకపోయినా ద్వేషించనని మాటియ్యి'' అన్నాడు.

అతని కళ్ళల్లో కనిపిస్తున్న అభ్యర్థన చూసి ఆమె చలించిపోయింది.

"మీకింకా నేను పూ[illegible]నందుకు బాధగావుంది. మీరెంలాంటి విషయం చెప్పినా పసివాడు దేవుడితో సమానం. వాణ్ణి ద్వేషించే ప్రశ్నేలేదు''

జగదీశ్ విశాలాక్షి మాటలు విని అలాగే ఆలోచిస్తూ కూర్చున్నాడు.

జగదీశ్ ఆలోచన గతంలోకి వెళ్ళిపోయింది.

సత్యవతత్తయ్య తనని ఓదార్చుతూ, విచారంగా, విషాదంగా చెప్పిన కథ మాటకి మాటగా గుర్తురావడం మొదలుపెట్టింది.



సత్యవతికి చటుక్కున మెలకువవచ్చింది. వెంటనే పక్కమీంచి లేచింది. తలుపుతీసింది. చలి వణికించేస్తోంది. మసకవెల్తురు పల్చగా పరుచుకుంది. టైము ఎంతయివుంటుందో తెలీకపోయినా, ఖచ్చితంగా తెల్లవారుఝాము వేళ అని నిర్ధారించుకుని, బిందె తీసుకుని-కుచ్చెళ్ళు పెట్టిన చీర, తుండు గుడ్డ బిందెలో కుక్కి బయలుదేరింది.

అది కార్తీకమాసం. తెల్లవారితే సోమవారం. ఆ ఊరికి సుమారు రెండుమైళ్ళదూరంలో వుంది కృష్ణానది. ఈ మాసమంతా ఆ చుట్టుపక్కల ఊరి జనం స్నానానికి కృష్ణకి వెళ్తారు. పర్వదినాల్లో గుంపులుగుంపులుగా వెళ్ళి స్నానం చేసి రావడం ఎంతో ముచ్చట వారికి.

సత్యవతి చకచకా బయటపడింది. ముందు సుశీలొదినవాళ్ళింటికి చేరుకుంది.

"వదినా...'' అంటూ ఒక కేకపెట్టగానే సు[illegible] లేచి దొడ్డి తలుపు తీసింది.

"ఏమే సత్తీ... [illegible]'' అంది బద్ధకంగా. "సర్లే...పూర్తిగా తెల్లారేక బయలుదేరితే రాలేనమ్మా! తెల్లారేసరికి యింట్లో వుండాలి. నాకెంత పనో చెప్పలేను. నేనైతే ఉపవాసం అయినా రుక్కూ పిల్లలు ఉన్నారు. వంటావార్పూ తప్పదు'' అంది.

సుశీల చీర, తువ్వాలు, పట్టుకోక, పసుపు కుంకం పొట్లాలు పట్టుకుని బయలుదేరింది.

సత్యవతి బాలవితంతువు. ఉండేది పల్లెటూరు. దానికితోడు చదువు సంధ్యలు లేని బతుకు. జీవితంలో ఏ అచ్చటాముచ్చటా లేదు సరిగదా, ఇంట్లో ఒళ్ళు దాచుకోకుండా చాకిరీచెయ్యడమే కర్తవ్యంగా అనుకుంటుంది. పోయినజన్మలో ఏదోపాపం చేశాను. ఈ జన్మలోనైనా పుణ్యం చేసుకోవాలి. ఈ వైధవ్యం ఈ జన్మకే-మరి వచ్చేజన్మకి తనూ పిల్లాపాపలతో సంతోషంగా వుండదా ఏమిటి?- అనుకుంటుంది సత్యవతి. అందుకే ప్రయత్నపూర్వకంగా అందరితో ఎంతో మంచిగా ఉంటుంది. ఎవర్నీ చెడుమాటలు అనదు. ఎవరికి ఏ ఆపద వచ్చినా తానెళ్ళి సహాయంచేస్తుంది. అందుకనే ఎంత నీచప్రవృత్తిగలవారైనా సరే సత్యవతిని గురించి ఒక్క పొల్లుమాట అనడానికి సాహసించరు ఆ ఊళ్ళో.

అలాంటి సత్యవతికి ఎప్పుడైనా కడుపులో కష్టం చెప్పుకోవాలంటే ఆమెకున్నది ఒక్క సుశీల వదినే. ఆమె మొగుడు తనకి వరసకి అన్నయినా, సత్యవతికి అతనంటే ఎందుకో ఎక్కువ గిట్టేదికాదు. సుశీల మంచితనం, నెమ్మది సత్యవతికి చాలా యిష్టం.

"మీఅమ్మవుంది. మామ్మవుంది. రుక్కువచ్చిందంటున్నావు. మరెందుకే అంతహడావు





డి" అంది సుశీల జుట్టు విదిలించి ముడివేసు కుంటూ.

"నర్లే... నీకేంతెలీదు. మామ్మకి వంట్లో బాగో లేదు. నేను అన్నీ అమర్చియిస్తే, మడికట్టు కుని వండి దింపుతుంది. రుక్కు ఎప్పుడూ పనిచెయ్యదు. నాముఖం చూస్తే అసలు యిక్కడి చెంబు అక్కడపెట్టదు. దానిపిల్లల్ని కూడా నామీదకి తోలేసి నిద్రపోతుంది. పైగా మళ్ళీ నెలతప్పింది" అని కాస్సేపాగింది.

"వదినా ఓమాట చెప్పనా?" అంది ఎవరూ లేని రోడ్డుమీదే నడుస్తున్నా దిక్కులుచూస్తూ అతినెమ్మదిగా.

"ఏమిటీ?" అంది సుశీల.

"మాఅమ్మకి మళ్ళీ నెలతప్పింది. అసలే వంట్లో రక్తంలేదుట మొన్న రుక్కు మొగుడి స్నేహితుడొకాయన డాక్టరు వచ్చాడులే ఆయన చెప్పాడు— అయినా ఒకటే వాంతులు. తిన్నదేమీ వుండదు కడుపులో. నాకే జాలేస్తుంది. నిజం చెప్పద్దూ ఒక్కొక్కసారి ఎందుకో ఒళ్ళుమండిపోతుంది."

"అయినా యిప్పుడు పిల్లలంటే కష్టమే" అంది సుశీల.

అలాగే వాళ్ళిద్దరూ దారిలో మాణిక్యాన్నీ సోదమ్మనీ, నర్సినీ పిలుచుకుని నడక సాగించారు. ఏవేవో కబుర్లు చెప్పుకుంటూ హాస్యాలాడుకుంటూ వెళ్తున్నారు. వయసు అందరిలోకీ సుశీలకే ఎక్కువైనా, ఆమె ఎంతో నాజూకుగా అందంగా కనిపిస్తుంది.

"ఎన్నేళ్ళొచ్చినా బాలాకుమారే మాసుశీల" అంది మాణిక్యం.

"ఎన్నేళ్ళమ్మా పెద్ద చెప్తున్నావు" అంది సత్యవతి సుశీలవైపు సమర్థింపుగా.

"ఏనాటిసుశీలే మామ్మా" అంటూ బుగ్గలు నొక్కుకుంటూ పడీపడీ నవ్వుతూ నడుస్తోంది సోదెమ్మ.

సుశీల ముసిముసి నవ్వులు నవ్వుకుంటూ ముందుకు కదులుతోంది—

"ఏమే చుక్కైనా పొడవలేదు. ఒక్కపిట్ట కదిలినట్లు లేదు- ఎంతయిందోటైము" అంది నర్సి.

ఆమె మాటలు ఎవ్వరూ పట్టించుకోలే దు— అంతా కృష్ణానది ఒడ్డుకు చేరి ఇసుకలో నడవటం మొదలుపెట్టారు. ఒక్కసారి సుశీల గుండె ఝల్లుమంది. కారణమేమీలేదు. చాలా పల్చగా పరుచుకున్న వెన్నెలమబ్బులదాటున ఇంకా చీకటి అలుముకునే ఉంది. వాళ్ళలా ఒకరెండు ఫర్లాంగులు నడిస్తేగాని నీటిదగ్గరకి చేరుకోరు.

"ఏమిటే సత్తి, ఇంకా తెలవారటంలేదు. మనం చాలా ముందుగా వచ్చాశామల్లేవుంది" అంది సుశీల.

"ఆ.... తెల్లవారుతుందిలే" అని మాటపూర్తి చేసేలోగా వాళ్ళకి కనుచూపుమేరలో ఎవరో నడిచి వస్తున్నట్లు కనిపించింది.

"ఎవరే" అంటే "ఎవరూ" అంటూ అంతా తలోమారు అన్నారుగాని భయంతో కాళ్ళు చచ్చుబడిపోయాయి అప్పటికే—

ఆ నీడలు మాటలేమీ మాట్లాడలేదు. వేగంగా వచ్చి ఈ ఆడవాళ్ళ మీద పడ్డారు. అప్పుడు తెలిసింది వాళ్ళెంత ప్రమాదంలో యిరుక్కున్నారో అంతా ఘొల్లుమంటూ తలొక వైపు పరుగుపెట్టారు. అయినా వాళ్ళు ఆడాళ్ళని వొడిసిపట్టుకుని మెడలో గొలుసుల్నీ గాజుల్నీ లాగేసుకున్నారు. సుశీల చేతినందుకున్న వాడు మాత్రం ఆమెగింజుకుంటూ గిలగిల్లాడిపోతున్నా వదలకుండా ఆమెని కాస్త దూరంగా మోసుకుపోయి, రాక్షసరతి సాగించి వదిలేశాడు. చేతికి దొరికింది చేజిక్కించుకుని పావుగంటలో అంతా ఎటో పారిపోయారు. ఆడాళ్ళు నలుగురూ లబోదిబోమంటూ అక్కడే కూలబడ్డారు. అంతా ఎవరిభయం వలనవారు అయోమయంలో వున్నారు. సత్యవతి మాత్రం సుశీలకి జరిగిన అవమానం కళ్ళారాచూసింది. కొయ్యయిపోయిన సుశీలను నెమ్మదిగా సేదతీర్చి కూర్చోపెట్టింది. ఆ అయిదుగురూ వున్న చోటునుండి ఒక్కడుగుముందు కెయ్యలేకపోయారు. సుమారుగా ఒక్కొక్కరి నుంచీ మూడు వేలకి తక్కువ ఖరీదుండని నగలుపోయాయి. ఇంటికెళ్తే మగవాళ్ళు తిడతారు. ఏం సమాధానం చెప్పాలి. అప్పటికి ఇంకా పూర్తిగా తెల్లవారలేదు. వాళ్ళు తమలో తామే ఏడుస్తూ తమ ఖర్మనే తిట్టుకుంటున్నారు. వాళ్ళు బయ



లుదేరింది అర్ధరాత్రి అని వాళ్ళకి ఇప్పుడే అర్థమైంది.

"నా జిగినీ గొలుసుపోయిన పంటలు డబ్బుతోనే చేయించారు. ఇప్పుడు నేనేం చెయ్యను దేవుడో; ఇంటికెడితే నా దేవుడు కుళ్ళబొడిచేస్తారు" అంటూ రాగాలు తీసింది మాణిక్యం.

"నా గాజులు, నా నల్లపూసలు-- అయ్యో మరింక నగలు అనే మాటేలేదే జీవితంలో" అంటూ తలబాదుకుంది నర్సమ్మ

"మంగళసూత్రాలని కూడా చూడకుండా లాక్కున్నాడే. వాడిచేతులుబడా; మొన్న శ్రావణమాసంలో రూపులు కూడా సూత్రాలలోనే కట్టుకుని ఇప్పుడు వీళ్ల మొహనపెట్టానే- అయ్యో మెళ్ళో సూత్రాలులేకుండా ఎలాగమ్మో- ఇదేం అపశకునమే తల్లో" అంటూ గుండెలు బాదుకుంటూ కన్నీరు మున్నీరుగా ఏడుస్తోంది రత్నమ్మ. అందర్లోకి తక్కువగా ఏడుస్తున్నది సుశీల. ఆమె ఏం పోయిందని ఏడ్వాలో తోచని స్థితిలో వుంది. ఆమె నగలుతో పాటు, అంతకంటే అమూల్యమైంది పోగొట్టుకుంది. ఏడ్వడానికి కూడా వీలులేని పరిస్థితి ! సత్యవతి సుశీల స్థితి కనిపెట్టి భయకంపితురాలైంది. సుశీలని ఓదార్చుతూ కూర్చుంటే పదినిముషాల తర్వాత సుశీల నిజస్థితికి వచ్చి వెక్కి వెక్కి ఏడ్చింది.

"ఏమేసత్తీ! అంతాపోయిందే" అంటూ కౌగిలించుకుంది. సత్యవతికి అసలు విషయం తెలుసుకాబట్టి నెమ్మదిగా సుశీల చెవిలో- "ఇప్పుడేం మాట్లాడకు వదినా! జరిగింది ఎవ్వరికీ చెప్పకు. మర్చిపో- మరేం ఫర్వాలేదులే" అంటూ ఓదార్చింది.

ఇంతలో దూరం నుంచి మాటలు వినిపించాయి. అంతా ఒకేసారి ఘొల్లుమని ఏడ్చారు. ఆ వచ్చేవారు పరుగు పరుగున వచ్చి వీళ్లని చూసి విషయం తెలుసుకున్నారు.

తర్వాత జరగవలసిందే జరిగింది.

నగలు పోయినందుకు ఆయా ఇళ్లల్లో నానా రాద్ధాంతాలు జరిగాయి. సత్యవతి బాగా నూరిపోసి ధైర్యం చెప్పటంవల్ల, సుశీల గొలుసూ గాజులూ పోయినందుకు చీవాట్లు తిని నోర్మూసుకుని వూరుకుంది. అసలు విషయం చెప్పటానికి ఆమెకి భయం కమ్మేసింది. ఎవరికి చెప్తుంది? ఏమని చెప్తుంది చెప్పినందువలన తనని అర్థం చేసుకుని "అయ్యో" అనేవారెవరూ లేరని ఆమెకి తెలుసు. కట్టుకున్నందుకు కట్టెలా అతనితో కాపురం చెయ్యటమే తప్ప మనసు విప్పి మాట్లాడుకునే స్వేచ్ఛ ఆమెకు భర్త దగ్గర లేదు.

ఊరు ఊరంతా గోలగా దొంగతనం గురించి చెప్పుకున్నారు. దొంగలు కృష్ణ ఇసుకలో పరుగెట్టి అవతలి గట్టున అనుకున్న పల్లెలోకి వెళ్ళిపోయి వుంటారని వూహించి పోలీసు రిపోర్టిచ్చారు-

అంతటితో ఆ విషయం ఊర్లో పాతబడింది. కాని సుశీల జీవితంలో కొత్త సమస్య పుట్టుకొచ్చింది. నలభయ్యోపడిలో పడబోతున్న సుశీలకి నెల తప్పింది. అప్పటికి ఆమెకి ఒక కొడుకు, ఒక కూతురు. కూతురు కామేశ్వరికి పదిహేనేళ్ళు! పెళ్ళి సంబంధాలు చూస్తున్నారు.

సుశీల తనపోయిన శీలం గురించి చాటుగా ఏడ్చిందేగానీ, ఇలాంటి భయంకరమైన సమస్యని ఎదుర్కోవాల్సి వస్తుందని ఊహించలేదు- మొదటి నెల తను బయట చేరకపోయేసరికి తనకి అవి పోతున్నాయనుకుంది. అయినా ఏదో భయం అంతరాంతరాలలో గుబగుబలాడటం మొదలు పెట్టింది. రోజులుగడుస్తున్న కొద్దీ సమస్య గడ్డుదైపోయింది. మగపిల్లవాడు జగదీశ్ అన్నోంపున్నెం ఎరుగడు చదువుతప్ప-, ఆడపిల్లకు రేపో మాపో పెళ్ళి చెయ్యాలనే ప్రయత్నంలో వున్నారు. మంచంలో వున్న అత్తగారు మంచిదే అయినా తను చెప్పబోయే మాటల్ని ఎంతవరకు అర్థం చేసుకోగలదో తెలీదు. అసలు తను మాత్రం ఆనాటి దుర్ఘటన మళ్ళీ నెమరేసుకుని ఎలా చెప్పగలదు. అప్పుడు అనుకుంది సుశీల. "నిజంగా దేవుడనే వాడుంటే తనకింతటి నరకం అకారణంగా ఎందుకు సృష్టిస్తాడు. తనిన్ని రోజులూ గుడ్డిగా చేసిన పూజలు, నోములు, వ్రతాలు ఏమైపోయాయి? వాటి ఫలితం తనకేమీలేదా? తను పుట్టింది నిప్పులాంటి వంశం. మెట్టింది నిప్పులుకడిగే ఆచార పరాయణమైన సంప్రదాయం- తనిన్ని ఏళ్ళు ఎంతగుట్టుగా, ఎంత పవిత్రంగా నడు




ఇప్పుడు సెరిలాక్®
# కాయగూరల మంచితనంతో బాటు






## మీ పాపాయికి సెరిలాక్ లాభాన్ని అందించడానికి మరొక మార్గం




ఇదిగో. కేరట్‌లు. టొమేటోల మంచితనం చేర్చబడిన కొత్త సెరిలాక్ వెజిటబుల్. మీ బాబు కొత్త రుచులను అలవరుచుకుంటున్నప్పుడు మీరు అతని ఆహారంలో వైవిధ్యం చేర్చేందుకు.

సెరిలాక్ వెజిటబుల్‌కి సెరిలాక్ లాభాలన్నీ కూడా ఉన్నాయి-ప్రతిసారి తినిపించినప్పుడు పరిపూర్ణమైన పోషక శక్తి. చక్కటి రుచి. క్షణాలలో తయారుకావడం.

4 నెలల నుంచి మీ పాపాయికి పాలు త్రాగించడంతో బాటు. ఘన ఆహారం కూడా అవసరం ఉంటుంది. అతనికి సెరిలాక్ లాభాన్ని అందించండి. 4 నెలల నుంచి సెరిలాక్ వీట్ యివ్వటంతో మొదలుపెట్టండి. 6 నెలలు వచ్చిన తరువాత మీ పాపాయికి కొత్త సెరిలాక్ వెజిటబుల్, లే బా సెరిలాక్ ఆపిల్ లేదా సెరిలాక్ ఆరంజ్ యివ్వండి-మీకు ఏది నచ్చితే అది.

పరిశుభ్రంగా తయారుచేయడానికి. మీ పాపాయికి సమతూకంలో పోషకాహారం సమకూర్చేందుకు. దయచేసి. డబ్బా మీద ఉన్న సూచనలను జాగ్రత్తగా అనుసరించండి.



**సెరిలాక్ రక్షణ: పోషకాహారంతో పరిపూర్ణం-ఎంతో రుచికరం**



Nestlé

చుకుంటూ వచ్చింది! ఈనాడు తన తప్పు లేకుండా తనొక దోషిగా నిలబడాల్సిన స్థితిలో వుంది. నిజానికి తనది తప్పుచేసే వయసుకాదు. తన తలమీదికి పెద్దరికం ఎప్పుడో వచ్చేసింది. ఈ ఏడు కాముడికి పెళ్ళి చేస్తే- వచ్చే ఏటికి తను అమ్మమ్మ అవుతుంది.-

సుశీల మనసు రంపపుకోత అనుభవిస్తోంది. కానీ మార్గం తోచకుండా పోయింది. పల్లెటూళ్ళలో మనుషుల ప్రవృత్తి చిత్రంగా వుంటుంది. ఆడవాళ్ళు ప్రతి విషయానికి ఎంతో కుతూహలం చూపిస్తారు. మనకెందుకు అని ఊరుకోరు. పట్నవాసుల్లో ఈ ప్రవృత్తి వున్నా వారికి పట్టించుకునేందుకు తీరిక వుండదు. అందుకని సుశీల నెలతిరిగే సరికి బయట చేరలేదని, పనిమనిషి దగ్గర నుంచి మంచంలో వున్న అత్తగారి దగ్గర నుంచి, ఇరుగు పొరుగు వారంతా గుర్తించారు. అయినా తప్పుగా అనుకునే ప్రశ్నలేదు సుశీల సుగుణవతి. భర్త చాటు స్త్రీ.

సుశీలకి రోజురోజుకీ అనుమానం బలవటటం మొదలైంది. శరీరంలో చిత్రమైన మార్పు కనిపిస్తోంది. గొంతులో వికారంగా వుండటం, తరచూ నిద్రపోవాలనిపిస్తోంది. వంట చేస్తుంటే కొన్ని పదార్థాలు చూస్తే వాంతి వచ్చేట్టు వుండటం, ఇవన్నీ చూసి సుశీలకి గుండెలు భయంతో కొట్టుకోవడం మొదలుపెట్టాయి. జరిగిన అనుమానం గుండెల్లో మంటగావున్నా పైకి ఎలాగో గడుపుతున్న ఆమెకి ఈ గర్భునమన్న భూతంలా ఎదురైంది. ఆమెకి చెప్పుకోడానికి కూడా ఎవరూలేరు. చివరికి మనసులో దాచుకోలేక సత్యవతితో చెప్పి కుమిలికుమిలి ఏడ్చింది.

సత్యవతి సుశీల చెప్పింది విని నిర్ఘాంతపోయింది. ఎలాగోలాగ వదినకి సాయంచేద్దామని నిర్ణయించుకుందిగానీ ఆమెకి మార్గం కనిపించలేదు. సుశీలకి ధైర్యం చెప్పి యింటికెళ్ళిందిగానీ సత్యవతి మనసు మనసులో లేదు.

మర్నాడు అతిరహస్యంగా మంత్రసాని నాగమ్మకి కబురుచేసింది. కబురైతే చేసిందిగానీ ఆమెతో ఎక్కడ మాట్లాడాలి- ఎలా మాట్లాడాలి అనేది సత్యవతికి పెద్దసమస్య.

అయితే బాగా అనుభవంగల నాగమ్మ వీలయినంత గుప్తంగా వచ్చి సత్యవతిని కలిసింది. సత్యవతి విషయం చెప్పింది గానీ ఎవరికో, ఏమిటో చెప్పలేదు.

"ముందుగా నాతో ఓమాట చెప్పకపోయారా? మీకే తిప్పలూ లేకుండా చేసేదాన్ని" అంది.

"ఛా ... నోరుముయ్. నాకేంకాదు. నాకు చాలా కావలసిన వాళ్ళకోసం అడుగుతున్నాను" అంది సత్యవతి.

నాగమ్మ చిన్నగా నవ్వింది- "తెలుసులేమ్మా! అందరూ అలాగే చెప్తారు- నాకాడ మాట చెప్తే, అది నూతిలో వేసినట్టే- మీకేం భయంలేదు" అంది ఆరిందాతనం వెలగబెడుతూ.

సత్యవతికి కోపమొచ్చింది. "ఏం? నీకే! చెప్తుంటే అర్థంకావటంలేదా? నాకలాంటి పాడు ఆలోచన ఎప్పుడూ రాలేదు" అంది.

"పాడు ఆలోచనేముంది? ఏం మీరు మాత్రం వుప్పుకారం తింటంలేదా, ఇంట్లో అన్నావదినలు మీముందే కాపురాలు చేయడంలేదా?"

"ఇదిగో! ఇది నాకోసం కాదు. ఓ అమ్మకష్టంలో వుంది- నాకు మందు కావాలి"- అంది ఖచ్చితంగా. "సర్లెండి ... ఎవరికైతే నాకెందుకు? మీరడిగారు మీకు నేతెచ్చియిస్తా" అంటూ వెళ్ళిపోయింది నాగమ్మ.

సత్యవతి ఆలోచనలోపడింది. తను చూడబోతే బాలవితంతువు. ఏదిఏటువచ్చినా తన మీదకి లేనిపోని నిందలు వచ్చే ప్రమాదం వుంది. నాగమ్మలాంటిదిలాంటి సంగతులు పట్టించుకోదు. ఏదో పెద్దింటి విషయాలనీ, అవి సర్వసాధారణమేననీ సరిపెట్టుకుంటుంది. కానీ తమ సాటికుటుంబాల్లో నిప్పు లేకుండానే పొగలేస్తుంది. అమాయకులా పొగలో వూపిరాడక వుక్కిరిబిక్కిరై పోయి చావాల్సిందే-

సత్యవతికేం పాలుపోలేదు. తనింట్లో చిన్న అనుమానం వచ్చినా తనని వుప్పుపాతరేసేస్తారు.

"దేవుడా ... ఇప్పుడు నాగమ్మ యిచ్చే మందుతో సుశీల కష్టం గట్టెక్కించునాయనా" అంటూ దేవుడికి మొక్కుకుంది.





అనుకున్నట్లుగా మర్నాడు నాగమ్మ మందు తెచ్చి యిచ్చింది–, అది సుశీలమింగినా ఏమీజరగలేదు. ఇద్దరూ కంగారుపడ్డారు. ఈసమస్య ఎలా పరిష్కరించాలీ అని మళ్ళీ మొదటికొచ్చింది వారి ఆలోచన.

"సత్యవతీ! నువ్వు పాపమనుకున్నానరే–, ఈ సంగతిలా గడ్డుదైపోవడానికి ఒక్కటే కారణం, కామేశ్వరి పుట్టినప్పుడే ఆయనెళ్ళి పిల్లలు పుట్టకుండా ఆపరేషను చేయించుకొచ్చారు. అప్పట్లో అదిచాలా హేళన చేసే విషయం. నన్నూ అడగలేదు– ఇంట్లోనూ చెప్పలేదు తర్వాత చెప్పారు" అంది.

"నిజమే ... అన్నయ్యలా చేయకపోతే ఏదో కలిసిపోయేది. ఇప్పుడన్నయ్యకి తెలిస్తే చాలా గొడవైపోతుంది"–

"మరే ... అదే భయంగా వుంది. ఆయనా విషయం చెప్పినప్పుడు యింక పిల్లల్ని కనే అవస్థ తప్పిందని ఆనందించాను. పదిహేనేళ్ల తర్వాత నన్నా అవస్థ యిలాబాధిస్తుందనుకోలేదు" అంది.

"నువ్వేం బాధపడకు ... ఏదో ఒకటి చూద్దాం" అంది సత్యవతి. అనడమైతే అంది గానీ, మరేం చెయ్యలేకపోయింది.

మూడోనెలతో గుట్టు బట్టబయలైంది. విషయం పూర్తిగా యింట్లోచెప్పక తప్పలేదు. సుశీల మొగుడు అగ్గిరాముడే అయ్యాడు. ఏనాడూ కొట్టనంతగా చావచితకగొట్టేశాడా రాత్రి సుశీలని. అప్పుడే నూతిలోదూకి చచ్చిపోదామనుకుంది. కాని కళ్లముందు అన్నెం పున్నెం ఎరుగని పిల్లలు మెదిలారు. ముఖ్యంగా పెళ్లికావాల్సిన కామేశ్వరి వుంది. ఆమెకి సంబంధాలు చూస్తున్నారు. అటువంటి సమయంలో తనేంచేసినా కుటుంబానికి, పిల్లలకి అప్రతిష్ఠ.

సుశీల నరకాన్ని చవిచూస్తూ జీవితాన్ని గడుపుతోంది. బయటవాళ్లెవరూ పట్టించుకోలేదు. ఆమె వయసులో వున్నవారింకా పిల్లల్ని కంటూనేవున్నారు. ఆ పల్లెటూరులో అదేమంత అబ్బురమైన విషయం కాదు. ఆలస్యంగా కాన్పు వచ్చిందని, అదెంతో అదృష్టమని అందరూ పొగిడారు. సుశీల మాత్రం కుళ్లికుళ్లి ఏడుస్తూనే వుంది.

సుశీల మొగుడు ఈ గొడవలో మనసులో కచ్చిదాచుకోలేక మంచంలో వున్నముసలి తల్లితో చెప్పాడు. ఆమె నివ్వెరపోయింది. కలతపడింది. కంగారుపడింది. అయితే జీవితానుభవంతో ఒకేఒక్కమాట చెప్పింది.

"నాయనా! తప్పు జరగటంవేరు. అది బయట పడటంవేరు. తప్పు జరిగినా, అది నలుగురినోట్లో పడకుండా వుంటే కొంతనయం. మనకుండే బాధ మనకెలాగూ తప్పదు. బయటివాళ్ల సూటిపోటి మాటలు పడటం చాలా కష్టం. దాన్ని బయటపెట్టకు" అని బోధ చేసింది.

అతనొక్కటే మాటన్నాడు "ఆరోజే ఎందుకు చెప్పలేదూ యీ మాట. అంత జరిగాక తగుదునమ్మా అని యింటికెందుకొచ్చింది? ఆ కృష్ణలోనే దూకి చావకపోయిందా!" అని.

ఈ మాటలన్నీ శూలాల్లా గుచ్చుకుంటుంటే భరిస్తూ, దుఃఖిస్తూ కూర్చుంది సుశీల.

అప్పుడత్తగారు కోడలికి చెప్పింది.

"నువ్వేదైనా అఘాయిత్యం చేశావంటే మరింక నీ పిల్లకి పెళ్లికాదు. నీ పాపానబ్రతికి అది బతుకంతా ఏడ్వాల్సి వస్తుంది, అందుకే నిగ్రహించుకో– తప్పదు. ఏనాడో చేసినపాపం. అనుభవించక తప్పదు"

సుశీలకి కాళ్ళూచేతులూ కట్టేసినట్లయిపోయింది.

చదువుకోసం వేరే పట్టణంలో వుండటంవల్ల జగదీశ్‌కి యీ విషయాలు తెలియలేదు. కామేశ్వరి మాత్రం అన్నీ తెలుసుకుంది. పిల్లల విషయం ఒక్కొక్కసారి చాలా చిత్రంగా వుంటుంది. కొన్ని సమస్యల్ని ఒక్కొక్కరు ఒక్కొక్కలా అర్థంచేసుకుంటారు. కామేశ్వరి కొంచెం చదువుకున్నా స్వతః అహంకారి. పైగా వంశగౌరవాలమీద, ఆస్తిపాస్తులమీద, పాతివ్రత్యంమీద అప్పటికే కొన్ని అభిప్రాయాలు ఏర్పడివున్నాయి. ఆమెకి తల్లి సమస్యయందు సానుభూతి ఏర్పడలేదు. ఆమెకి కూడా తండ్రికిలాగా ఒకటే తట్టింది.

"ఆ రోజే అమ్మ చెప్పి వుండాల్సింది. చెప్తే ఎలా వుండేదో? నాన్న ఏదో ఒకటి చేసేవాడు. అయినా అంత జరిగాక అమ్మ యింకా ఎలా



బతికివుందో?" అని ఆశ్చర్యపోయింది. సాధారణంగా ఎవరూ ఏ తల్లిగురించీ అంత కర్కశంగా యోచించలేరు-

ఊళ్లో ఎవ్వరికీ ఎటువంటి అనుమానంలేదు. ఎందుకంటే ఆమె వయసులో వున్నవాళ్లు ఎంతోమంది పిల్లల్ని కంటూనే వున్నారు. కోడలితో ఒకపురుడు, కూతురితో ఒకపురుడు ఆ వూళ్ళో వయసు మళ్లిన ఇల్లాళ్లుకి మామూలే-

అంతా సుశీలకి ఆలస్యంగా కాన్పు వచ్చిందని అనుకున్నారు. అలా వచ్చిన కాన్పు అదృష్టం తెస్తుందనుకున్నారు- కాని నానాటికి సుశీల మనుగడ దుర్భరమైపోయింది.

జగదీశ్ శలవలకి వచ్చినపుడు తల్లి పరిస్థితి కనిపెట్టాడు. అన్నిటికంటె తండ్రి తల్లిని హింసిస్తున్న పద్ధతి అతనికి చాలా బాధకల్గించింది. అసలేం జరిగిందో తెలియలేదు. అతనున్న పదిరోజులు నరకప్రాయమయిపోయాయి. అతనికి తల్లి ముఖంలో చిరునవ్వు కరువైంది. గానుగెద్దులా పనిచేసుకోవడంతప్ప ఆమె పెదవి విప్పి మాట్లాడం కూడా మానేసింది. చిన్నప్పటినుండి జగదీశ్‌కి కామేశ్వరికి అంతగా పడదు. కామేశ్వరి ప్రతీదానికి పెంకితనంగావుండేది. అందుకని కామేశ్వరిద్వారా తనకేమీ తెలీదని అర్ధమై అతనికి పిచ్చిపట్టినట్లయింది. ఇంట్లో కూర్చుంటే ఆవిరిపెట్టేసినట్లు అనిపించింది. తల్లినిచూస్తే కడుపు తరుక్కుపోయేబాధ ఏదో అతన్ని దహించివెయ్యడం మొదలుపెట్టింది. అప్పుడతను సత్యవతత్తయ్య దగ్గరకెళ్ళాడు.

అత్త ఆప్యాయంగా పలకరించగానే కన్నీళ్ళు ఆగలేదు జగదీష్‌కు.

అప్పుడామె అన్నీ వివరంగా చెప్పింది అతనికి. అవాక్కయిపోయాడు జగదీష్.

"జగ్గూ... మీ అమ్మ తప్పేమీలేదు. ఆమె కావాలని చేసిందికూడా ఏమీలేదు. అంతాకలిసివెళ్ళాం - ఆరోజు దానికి దుర్దినం. నానెత్తిమీద శనికూర్చుంది తెల్లవారుతోందనుకుని అర్ధరాత్రి లేచి, దెయ్యంలా బయలుదేరాను. పాపం అన్నెంపున్నెం ఎరుగని ఇల్లాలు దాన్ని నేనే లేపాను. అప్పటికీ అందికూడా- అప్పుడే తెల్లారిందిటే" అని. "మరి దానిబతుకే తెల్లారిపోతోందని దానికేంతెలుసు?—

జరిగింది ఎంత ఘోరమో— అంతా సుశీల కడుపులో దాచుకుందామనుకుంది. కాని బిడ్డ కడుపులోపడ్డాడు. అది దాచుదామంటే దాగేవిషయంకాదు. జరిగిన అవమానంకంటే గడపాల్సిన జీవితం రోజురోజుకీ గడ్డుగా తాయారైంది

మీనాన్న అప్పటినుండి రాక్షసుడే అయ్యాడు. దాన్ని పెడుతున్న బాధలు నాకు తెలుసు. అది ఎన్నోసార్లు చచ్చిపోదామనుకుంది. అయినా చావలేదు. ఎందుకో తెలుసా? మీ ఇద్దరికోసం. కాముడి పెళ్ళికాదేమోననే భయం? నువ్వు చిన్నవాడివి. మనసు చెదిరిపోతావేమోననే బెంగ. అందుకే ఇంకా ఆ నరకంలో బతుకుతోంది—

ఒరే జగ్గూ! అమ్మ బాధలు చూసి నేను ఏడవనిరోజు లేదు. ఏమిటో దానికీ నాకూ మధ్యవున్నది చుట్టరికమేమీకాదు. అదొక గొప్ప స్నేహం— ఒక్కొక్కసారి నాకు ఆలోచన వస్తూంటుంది. ఆ జరిగేదేదో నాకు జరిగినా ఇంత గొడవుండేదికాదేమో అనిపిస్తుంది. నేను ధైర్యంగా చెప్పేసి ఆబిడ్డని పెంచుకోవచ్చు అనిపిస్తూంటుంది.

"జగ్గూ నువ్వు మాత్రం అమ్మని హీనంగా చూడకు. అమ్మ తప్పేమీలేదు —" సత్యవతి దృఢంగా చెప్పిన మాటలు జగదీశ్ మీద ప్రభావంచూపించాయి. జగదీశ్‌కి కాస్త ప్రశాంతతచిక్కింది. ఏదో రహస్యంవుందని మధనపడటంకంటే అది ఎంత ఘోరమైన విషయమైనా బయటపడిపోతే కొంత శాంతి లభిస్తుంది. అందుకే తల్లిని ఏ ఒక్కవిషయానికీ బాధించకుండా జాగ్రత్తపడేవాడు జగదీష్.

వాసు పుట్టినప్పుడు చిత్రంగా అనిపించింది. ఈ సృష్టి ఎంత చిత్రమైంది. ఈ సంఘం నిర్దేశించుకున్న సంకుచితమైన కట్టుబాట్లతో, ఆచారవ్యవహారాలతో, తరతమబేధాలతో దానికేమీ సంబంధంలేదు. ప్రకృతికి గొప్పా, బీదా, స్త్రీ, పురుష భేదంలేదు. దాని క్రమాన్ని అది నిర్వికారంగా, నిర్విఘ్నంగా నిర్వహిస్తుంది.

వాసు ముద్దుగా, బొద్దుగా వున్నాడు. వానుని చూసి మరీముచ్చటపడినవాడు జగదీశ్. అతనికప్పుడు ఇరవైఏళ్ళు. కామేశ్వరి మాత్రం





ఆపిల్లాణ్ని చూడగానే అసహ్యించుకుంది.

సుశీల పసివాణ్ని గుండెలకదుముకుని నిశ్శబ్దంగా దుఃఖించింది. తనకెంతో అన్యాయంచేసిన అజ్ఞాత వ్యక్తివల్ల కలిగిన ఆ బిడ్డని ఆ తల్లి ద్వేషించలేకపోయింది. అసహ్యించుకోలేకపోయింది. ఎవరే నా బిడ్డని అవతల విసిరేస్తారేమోనని ఎప్పుడూ గుండెల కదుముకుని కాపాడుకుంది. తనని మోసంచేసి, అన్యాయంచేసి, అవమానించిన పురుషుణ్ని స్త్రీ ద్వేషిస్తుంది. అసహ్యించుకుంటుంది. దూరంగావుంచుతుంది కానీ అతనివల్ల కలిగిన సంతానాన్ని దూరంచేసుకోలేదు. అది స్త్రీజాతి బలహీనత.

కామేశ్వరి పెళ్లి స్థిరపడింది. ఎంతో ఘనంగా చేశారు. సుశీల పొందాల్సినంత ఆనందం పొందలేదుగానీ, తన బాధ్యత తీరినట్లు నిట్టూర్చింది. కామేశ్వరికి జగదీశ్‌కి అభిప్రాయాలు బాగా కలవకపోయినా, కామేశ్వరి భర్త విశ్వనాథ్ అతను మంచి మిత్రులయ్యారు. బావమరుదులన్న భావంకన్నా వాళ్ల మధ్య స్నేహమే మంచి స్థానాన్ని ఏర్పరచుకుంది.

ఏదో మాటల సందర్భంలో విశ్వనాథ్ వ్యక్తం చేసిన చిన్న అనుమానానికి జగదీశ్ ఉన్నదున్నట్లు జరిగిందంతా చెప్పాడు. అతడది మంచిగానే అర్థం చేసుకున్నాడు.

అప్పుడే అనుకున్నాడు జగదీశ్, వాసు బాధ్యత తనే స్వీకరించాలని. కామేశ్వరికి సదభిప్రాయం లేకపోవడమేకాకుండా, ఆ పసివాణ్ని త్వరగా వదుల్చుకుంటే మంచిదనే భావం కూడా వుండేది. అందుకే ఆమెతో ఎక్కువగా చర్చకి దిగేవాడు కాదు విశ్వనాథ్.

జగదీశ్ అదృష్టవశాత్తూ అనుకూలవతియైన భార్యని సంపాదించుకున్నాడు.

విశాలాక్షిని చూసి సుశీల ఎంతో మురిసిపోయింది. ఒకే ఒక్కసారి రెండే మాటలు చెప్పింది. "ఆ పిల్ల చాలామంచిది. ఉన్నతభావాలు కలది. ఆమె మనసు కష్టపెట్టకు" అని.

"నేనేమైపోయినా వాసుని నువ్వు కనిపెట్టుకుని వుండాలంటే ఆమె సహకారం కావాలి" అని కూడా సుశీల అంది. జగదీశ్ బరువుగా నిట్టూర్చాడు.

"విశాలా... ఇప్పుడు అమ్మచచ్చిపోయినందుకు ఏడ్చిన ఏడుపు కంటె, అప్పుడే ఎక్కువ ఏడ్చాను. ఆమెకి జరిగిన అన్యాయాన్ని తల్చుకునే బహుశా ఇప్పుడు కూడా మూడు రోజులు ఏడ్చి వుంటాను. చావు అనేది అందరికీ వచ్చేదే. అదేమంత అసహజమైన విషయంకాదు. కానీ- ఆమె బతికుండగా అనుభవించిన నరకయాతనకంటె చావు ఎంతో నయం.

"విశాలా అమ్మ నీ గురించి అన్న మాటలు తల్చుకున్నప్పుడల్లా నాకెంతో గర్వంగా వుంటుంది. నిన్ను అంత త్వరగా అర్థంచేసుకున్న అమ్మని తల్చుకున్నా నాకు గర్వమే-. అయితే నాకు జవాబులేని ప్రశ్న అంతమంచి అమ్మ అంతటి అమానుషమైన శిక్షకి ఎలా అర్హురాలు?

తెల్లారి లేస్తే పేపర్లో ఎన్నో మానభంగాలు, ఆత్మహత్యలు, హత్యలు చూస్తున్నాము. కాని ఇలాంటి ఎటూకాని వయసులో ఆమె బతుకులో నిప్పులు పోసిన ఆ దుర్మార్గుణ్ని ఎవరు పట్టివ్వగలరు? ఎవరు శిక్షించగలరు?

తప్పు తనది అయినా కాకున్నా ఆడది శిక్ష అనుభవించటానికి ఎప్పుడూ సిద్ధంగా వుండాలనిపిస్తోంది. అదే ఆమెకి వరమైనా శాపమైనా- అదే ఆమె నరకం- అదే అమ్మ పాలిట నిజమైంది" అని వాపోయాడు.

విశాలాక్షి మర్నాడు పుట్టింటికి బయలుదేరింది వాసుతోసహా.

కూతుర్ని చూసి అన్నపూర్ణ ముఖం చేటంతయినా, ఆమె చీర కుచ్చెళ్ళు పట్టుకుని భయంభయంగా వెనకాలే వున్న వాసుని చూసి ముఖం చిట్లించింది. క్షేమసమాచారాలు అయ్యాక, అన్నపూర్ణ విసుర్లూ, కసుర్లూ చూసి విశాలాక్షి తల్లికి సూటిగా చెప్పేసింది.

"మా ఆయనకి వాళ్ళ తమ్ముణ్ని చూడటం ఇష్టం. ఆయన మాటని పాటించటం నా ధర్మం. నేను ఇక్కడకి ఎప్పుడైనా రావాలనుకుంటే నాతో వాసు కూడా వుంటాడు. మీకెవరికైనా అభ్యంతరమైతే- రాను" అంది.

"అదేమిటే విశాలా మరీ అంతకోపం. పుల్ల విరిచి పొయ్యిలో పెట్టినట్లు చెప్తున్నావు. నేనేం

వరాయిదాన్నా నీబాగోగులు చూడనిదాన్నా! ఏదో చిన్న పిల్లవు. పిల్లల్ని పెంచే అనుభవం ఏం వుంటుందీ? అవస్థ పడతావని కదూ చెప్తూంట?" అని సాగదీసింది అన్నపూర్ణ.

"అనుభవం ఎక్కడినుంచో ఊడిపడదు- చేస్తుంటే అదే వస్తుంది" అంది విశాల.

"సర్లే!... నీ యిష్టం. నీ కడుపునో కాయకాస్తే అప్పుడెలాగూ తప్పదు" అంది.

"పోన్లే... నా యిష్టం అన్నావుకదా! కనకపో యినా వానూ నాపిల్లాడే అనుకుంటాను. అయినా అమ్మా నాకిప్పుడు మూడోనెల" అంది విశాల తలొంచుకుని.

అన్నపూర్ణ అవాక్కయిపోయింది. అంతలోనే తేరుకుని- "ఇంత అలస్యంగానటే చెప్పేది. అసలు నీకు కన్నవారింత చేదయిపోయా రెందుకే". అంటూ కంటతడిపెట్టింది.

విశాలాక్షి మనసు విలవిల్లాడిపోయింది. నిజానికి తనతల్లేం దుర్మార్గురాలుకాదు. ఆమె చెప్పిన మాటలు లోకసహజమైనవి. అందుకే నవ్వుతూ

"అదేంలేదమ్మా వెంటనే చెప్దామని అను కున్నాను. సిగ్గుగావుండి వుత్తరంరాయడం ఆలస్యంచేశాను. ఇంతలో మాఅత్తగారు పోవడం గొడవలు, అప్పుడూచెప్దామనుకొని నా మనసుకేమీ ఉత్సాహంగా లేక చెప్పలేదు" అంది నెమ్మదిగా.

ఆరోజు అన్నపూర్ణ ఏవేవో కొత్తరకం వంట లుచేసింది.

వానుకి అన్నం తినిపిస్తుంటే అన్నపూర్ణ- "అరిభడవా! ఎంత అదృష్టవంతుడివిరా. అమృతంలాంటి అమ్మని సంపాదించుకు న్నావు" అంది.

ఆమాటల్లోవున్న వ్యంగ్యం, ఎత్తిపొడుపు అర్థంచేసుకున్నా విశాలాక్షి మౌనంగావుండిపో యింది.

మర్నాటి సాయంకాలం బయలుదేరి మళ్లీ అత్తారింటికి వస్తుంటే ఆఖరిసారి అన్నపూర్ణ కూతురికి నచ్చచెప్పే ధోరణిలో అంది-

"అమ్మా విశాలా! నామాటవిను. మెల్లగా చూసుకుని ఆ పిల్లాడిని ఏ అనాధశరణాల యంలోనో చేర్పించెయ్. నువ్వు నెమ్మదిగా నచ్చ చెప్తే మీ ఆయన వినకపోడు" అంది. విశాలాక్షి తల్లికి సమాధానమేం చెప్పలేదు గానీ, మన సులో మాత్రం గట్టిగా అనుకుంది- తను పురుడు పోసుకోవటానికి కూడా మళ్లీ ఇక్కడికి రాకూడదు అని.



ఆరోజు సాయంత్రం జగదీశ్ ఇంటికి వస్తూనే విశాలాక్షికి చేతిలో ఓ వుత్తరం పెట్టాడు. కామేశ్వరి వస్తోంది. తాము హైద్రాబాద్ కా పురం పెట్టాక ఆమె ఇదేరావడం. అనుకో కుండా వాళ్లాయన యిటువస్తున్నాడట. తనూ అతనితో కలిసి వస్తోంది. విశాలాక్షి నిస్పృహగా నిట్టూర్చింది. ఆమెకి నెలలు నిండిపోయాయి. కదల్లేకుండావుంది. వాను మరీచిన్నవాడు. ఇలాంటి సమయంలో ఎవరువచ్చినా కష్టమే. అందులో కామేశ్వరి సర్దుకుపోయే మనిషికా దు. కోడిగుడ్డుకు జడలు వేయగలదు. ఆలోచ నలో పడిపోయింది విశాలాక్షి.

"వదినా! ఇందులో పాలుపోస్తావా" అంటూ వచ్చిన వాను పసిముఖం చూడగానే మళ్లీ మామూలు స్థితికివచ్చింది. ఏదైనా కానీ ఎలాగో లాగ కష్టపడటమే అని నిర్ణయించుకుంది.

అప్పుడే స్నానం చేసివచ్చిన జగదీశ్‌కి కాఫీ కప్పు అందించింది.

అతను ఎడంచేత్తో కాఫీ కప్పు అందుకుని కుడిచేత్తో ఆమెనిచుట్టేసి-

"ఈ పొట్టతో నువ్వు భలే చిత్రంగా వున్నా వేయ్" అన్నాడు.

ఆమెకప్పుడా క్షణంలో నవ్వూ ఏడుపూ కలిసి వచ్చాయి ఒకేసారి. మౌనంగా కళ్లు కిందకి దించి పొట్టకేసి చూసుకుంది.

దూరంగా గుమ్మంలో కూచుని వాను ఎటో




చూస్తూ పాలు తాగుతున్నాడు.

"అవునుగానీ నీకోమంచి విషయం చెప్తాను. నువ్వునన్ను చాలా మెచ్చుకోవాలి- వీలయితే చిన్న సన్మానం కూడా చెయ్యాలి" అన్నాడు జగదీశ్ నాటకీయంగా.

"సన్మానం కావాలా! కొంపతీసి కవిత్వంరాయలేదుకదా" అంది సీరియస్‌గా ముఖంపెట్టి.

జగదీశ్ ఇల్లెగిరిపోయేలా నవ్వాడు. "నీ జోక్ చాలా బాగుంది గానీ, నేచెప్పేది విను. రేవటినుండి నీకోసం ఒకవంట మనిషిని మాట్లాడాను. ఆమె ఇక్కడే వుంటుంది. అన్ని పనులూచేస్తూ నీకు సహాయంగావుంటుంది. నువ్వు కాలు కిందమోపకుండా మంచం మీద కూర్చునేటట్టు చూడాలని ఆమెకి ముందే చెప్పాను. మన సంగతులు అన్నీ వివరించాను. కాస్సేపాగి నేను పోయి తీసుకువస్తాను"

"అన్నీ అంటే?"

"అబ్బబ్బ! అదే.. నిన్ను వదిలి నేను ఒక్క క్షణం కూడా వుండలేననీ, అదనీ ఇదనీ- అందుకే నిన్ను మీ అమ్మగారింటికి పంపటంలేదనీ..."

"ఇంతకీ ఆ వంటమనిషిగారి వయస్సు?" అంది విశాల కొంటెగా చూస్తూ.

ఫకాలున నవ్వేస్తూ- "నీ ఆడబుద్ధి పోనిచ్చుకున్నావుకావు. ఓ యాభై ఏళ్ల పైమాటే! చాలా నీకిప్పుడేం అభ్యంతరం లేదనుకుంటాను" అన్నాడు.

విశాలాక్షి మూతి మూడు వంకర్లు తిప్పింది.

"ఏమంటావు" అన్నాడు జగదీశ్. విశాలాక్షి నెమ్మదిగా వచ్చి అతని గుండెలమీద తల ఆన్చి వుండిపోయింది. అతను నెమ్మదిగా ఆమెని దగ్గరకి తీసుకుని-

"ఏమిటోయ్.. నిన్నింకా దగ్గరకి లాక్కుందామంటే పొట్టమరీ అడ్డుగా వుంది. తొందరగా కనేసి వాణ్ణి ఉయ్యాల్లో వడేసిరా" అన్నాడు.

ఆమె తలెత్తి అతని కళ్లల్లోకి చూసింది. సన్నటి నీటిపొర వెనుక నుంచి ఆమె కళ్ళు నవ్వుతున్నాయి. అందమైన సాయంకాలపు నీరెండలా వుంది. ఆమె ముఖం.

* * *

కామేశ్వరి వస్తూనే వదిన్ని చూసి ఆశ్చర్యపోయింది.

"ఏమిటీ నీకప్పుడే పురిటిరోజులా, నాకు తెలియనే తెలియదే" అంది.

ఆమె గొంతులో పలికిన నిష్ఠూరం పక్కకి పెట్టేసి నవ్వుతూ తేలికగా సమాధానం చెప్పేసింది విశాలాక్షి.

ఉన్న ఒక్క పూటలోను కామేశ్వరి వాసుపై తనకిగల అయిష్టత వెళ్లగక్కింది.

"వీణ్ణి ఎందుకు వెంట తెచ్చుకున్నావు? ఏ అనాథ శరణాలయంలోనో వడేస్తేపోయేది" అందొకసారి. మరో సందర్భంలో జగదీశ్ లేకుండా చూసి స్థిమితంగా కూర్చుని చెప్పటం మొదలుపెట్టింది.

"ఎందుకు వీణ్ణి నెత్తికెక్కించుకుంటున్నావో అర్థం కావటంలేదు. అప్రతిష్ఠ కొని తెచ్చుకోడానికనుకుంటాను"

ఇంక సహించలేకపోయింది విశాలాక్షి. "కామేశ్వరీ! నువ్విలా మాట్లాడటం నాకేమీ బాగుండలేదు. ఏది ఏమైనా వాడు నీతమ్ముడు" అంది.

"ఆమాట మాత్రం అనకు. వాడు నాకు తమ్ముడేమిటి?" అంది ఈసడింపుగా ముఖం పెట్టి.

"ఒకే తల్లికి పుట్టిన బిడ్డలు అక్కా తమ్ముళ్ళుకారా" అంది.

"ఒకే తండ్రి పిల్లలయితేనే ఆ అనుబంధం అని నా నమ్మకం" అంది మూర్ఖంగా.

"మీ అమ్మకన్న బిడ్డేకదా!"

"అయినా నాకేమీ సంబంధం లేదు." "మీ అమ్మగారిమీద నీకు కాస్తంత ప్రేమ, జాలి వుండాలి"

"ఉన్నాయి. అప్పుడప్పుడు మా అమ్మని తల్చుకుంటే బాధగా వుంటుంది. కానీ ఆమె పొరబాటువల్లే ఈ పీడ చుట్టుకుంది అనిపిస్తోంది-" అంది.

కాస్సేపాగి- "జరిగింది వెంటనే యింట్లో చెప్పాలనే జ్ఞానం లేకపోయింది" అంది.

ఒక నిముషం కామేశ్వరికేసి చూసి ఈమె అసలు స్త్రీయేనా అని ఆశ్చర్యపోయింది విశా




లాక్షి. ఒక స్త్రీ ఆలోచన మరో స్త్రీ గురించి ఇలా వుంటుందని తెలిశాక విశాలాక్షి ఎంతో బాధపడింది. అందులోనూ స్వంత తల్లి గురించి ఆ మాటే కామేశ్వరితో అంటే –

"ఓయబ్బో నువ్వు చూస్తూనే ఉంటావుగదా రేపు వీడు ఏ గజదొంగో, హంతకుడో, అయినప్పుడు తెలుస్తుందిలే! ఇదిగో వదినా! గుణాలు వంశపారంపర్యంగావస్తాయి" అంది క్రోధంగా- విశాలాక్షి అభిమానం దెబ్బతింది. మరేం మాట్లాడలేకపోయింది. కాసేపు మౌనంగా వుండి- "ఎక్కడో ఓచోట వదిలేసినా ఇంటి పరువు గంగలో కలుస్తుంది. మనపిల్లవాడని అందరికీ తెలుసు"

అలా అందేగానీ తన సమాధానం తనకే పేలవంగా అనిపించింది విశాలాక్షికి.

మళ్ళీ వెళ్ళిపోయే వరకు కామేశ్వరి వదినతో ఒక్కమాట కూడా మాట్లాలేదు- వెళ్ళే ముందు బొట్టుపెట్టి చీరపెడుతుంటే అంది. "ఇదే ఆఖరిసారి వదినా! నేనీ ఇంటికి మళ్ళీ రావాలంటే, ముందు వాణ్ణి నువ్వు వదిలించుకో" అని చివరిబాణం వదిలేసింది.

విశాలాక్షి మౌనంగా వుంది. ఏమీ సమాధానం చెప్పలేదు.

కామేశ్వరి వెళ్ళిపోయింది.

విశాలాక్షి ఎంత ఆలోచించినా కామేశ్వరి మనసెందుకంత పాషాణంగా తయారైందో తెలియలేదు. ఆమె వెళ్ళిపోయినా ఆమె మాటలు చెవుల్లో మారుమోగుతూ ఆమెని బాధించసాగాయి. పాలుగారే బుగ్గలతో వాసు ఎదురుపడితే ఈ పసివాడి కోసమా యింత అంతర్బహిర్ పోరాటం అని చిన్నబోయేది. మళ్ళీ అంతలోనే తనింత కష్టపడి పెంచుతున్న వాసు తనకెలాంటి అప్రతిష్టా తీసుకురాబోడని తనకి తనే ధైర్యం చెప్పుకునేది.

★ ★ ★

బాగా చీకటిపడిపోయింది. అయినా విశాలాక్షి ఈ కథంతా పూర్తిగా చెప్పేసరికి ఆమె కళ్ళు తడిగా వుండటం అంతా గ్రహించారు. వాసు ముఖం నల్లగా మాడిపోయినట్లు అయింది. సుమబాల నలభై లంఖణాలు చేసినట్లు నీరసపడింది.

విశ్వనాథ్ - జగదీశ్ దూరంగా ఎటో చూస్తున్నారు. ఎవ్వరూ ఏమీ మాట్లాడలేదు.

మళ్ళీ విశాలాక్షే అంది-

"మీ యిద్దరూ ఈ విషయానికేమీ కలతపడవలసినపనిలేదు. నాకే పూర్తిగా అన్నివైపుల నుంచి విషయం తెలుసుననీ, మా అత్తగారితో వున్న కాసిని రోజులూ చనువుగా వున్నాననీ, నన్నీ కథ మీకు చెప్పమని హైద్రాబాద్ నుంచి ఇక్కడికి తీసుకొచ్చారు. ఇంత చల్లని ఈ సముద్రపువొడ్డున మీ మనసులు భారం అయ్యాయి- ఇంక వదిలేయండి" అంది.

తలొంచుకుని కూర్చున్న వాసు తలమీద నెమ్మదిగా చెయ్యి వేసింది. అతనామె ఒళ్ళో తలపెట్టుకుని కళ్ళు మూసుకున్నాడు. ఆ కనుకొలకుల్లోంచి నీరు చివ్వున బయటకొచ్చింది.

అందరికంటే ముందు విశ్వనాథ్ తేరుకున్నాడు. "కామేశ్వరికి బి.పి. వుంది. అందుకని ఆలోచిస్తున్నాను. లేకుంటే అసలు ఈపెళ్ళి గురించి యింత ఆలోచించాల్సిందేమీ లేదు" అన్నాడు.

ఆరాత్రి జగదీశ్, వాసు, విశాలాక్షి హైద్రాబాద్ బయలుదేరి వెళ్ళిపోయారు. వెళ్తూ- "ఇందరం కలుసుకున్నాం కామేశ్వరి తప్ప. అది బాధగానే వుంది. కాని తను కలవాలని అనుకోనప్పుడు మనం ప్రయత్నించి బాధించడం భావ్యం కాదు" అన్నాడు జగదీశ్.

విశ్వనాథ్ తలపంకించాడు.

వాడిపోయిన గులాబి పువ్వులా తండ్రి భుజాల మీద వాలిపోతూ యింటికి బయలుదేరింది సుమ.

★ ★ ★

వాసు వంటరిగా గదిలో పడుకున్నాడు. టీకప్పుతో అతని గదిలోకి అడుగుపెట్టిన విశాలాక్షి గతుక్కుమంది. మంచం మీద బోర్లా పడుకుని, మెత్తని దిండు గుండెలమీద పెట్టుకుని దాన్ని గట్టిగా కౌగలించుకుని పడుకుని వున్నాడు. అతన్ని చూడగానే నిద్రపోవటంలేదని తెలుస్తూనే వుంది. వాసు గత మూడురోజులుగా చాలా ముభావంగా, డల్‌గా వుండటం గమనించినా పెద్దగా పట్టించుకోలేదు విశాలాక్షి. అది సహజమేనని ఆమెకి తెలుసు. అతని మనసు స్థిమితపడటానికి కొంతకాలం పడు



తుంది. రెండురోజులు మాత్రం బలవంతంగా శలవు పెట్టించి యింట్లోనే వుంచి అతన్ని కంటికి రెప్పలా చూసుకుంది. ఈరోజు అతను ఆఫీసుకి వెళ్ళివచ్చాడు.

''వానూ!'' నెమ్మదిగా పిల్చింది.

అతను లేచి టీ కప్పు అందుకున్నాడు. ఏదో అడుగుదామనుకున్న ఆమె అతని ముఖం చూసి ఆగిపోయింది. అది ప్రశాంతంగానే వుంది గానీ, అతను పడుకున్నతీరు చూసి కలతగా వున్నాడేమో, ధైర్యం చెప్దామను కుంది- అందుకే నవ్వుతూ-

''వానూ! మీపిన్నికి వుత్తరం రాస్తాను. ను వ్వు మరేం ఆలోచించకు. హాయిగా పెళ్ళిచేసు కుంటే ఈ వంటరితనం-ఈ ఆలోచనలు వుండవు'' అంది.

వాను వదినవైపు ఆశ్చర్యంగా చూశాడు.

''ఏమిటలా చూస్తున్నావు'' అంది.

''మాట్లాడుతున్నది నువ్వేనా అని ఆశ్చ ర్యంగావుంది'' అన్నాడు.

''అంటే'' అంది

అతను తనచేతిలో వుత్తరం ఆమెకందించా డు.

''డియర్ వానూ!

చిత్రం! ఇవన్నీ విన్నాక నిన్నొదిలి ఒక్కక్ష ణంకూడా వుండాలనిపించటంలేదు. నువ్వు తొందరపడి ఏనిర్ణయమూ తీసుకోకు. నువ్వు మామూలుగా వున్నానని లెటర్ రాసేవరకు నాకు శాంతిగా వుండదు. స్థిరమైన నిర్ణయం తీసుకున్నప్పుడు మనసెంతో హాయిగా వుంటుంది. ఇప్పుడు నాస్థితి అదే. అతిత్వరలో నిన్ను కలుసుకోవాలనుకునే

నీ
సుమ.

అదే ఉత్తరం త్వరత్వరగా రెండు మూడు సార్లు చదివేసింది విశాలాక్షి. నెమ్మదిగా వాను వైపు చూపులు తిప్పింది. అతనేమి జరగనట్లు కిటికీలోంచి బయటికి చూస్తూ టీ తాగుతున్నా డు. విశాలాక్షి మరేం చెప్పలేదు.

''సరే నీఇష్టం. సుమ స్వభావం వాళ్ళమ్మకి పూర్తివిరుద్ధం'' అంది.

వాను సన్నగా నవ్వి ఊరుకున్నాడు. విశాలా క్షి ఖాళీకప్పు తీసుకువెళ్ళింది. ఆమెకు సుమ మనో నిబ్బరం నచ్చిందిగానీ, ఈ సమస్య ఎలా పరిష్కారమవుతుందా అనే బెంగపట్టుకుంది. ఈ సందర్భంగా కామేశ్వరి ఎంతో కొంత నింద తమమీద వేసితీరుతుంది. భరించక తప్పదు. సరే కానున్నది కాక మానదు- అని ఊరుకుంది.

★ ★ ★

సుమబాల సోఫాలో అస్తవ్యస్తంగా పడుకుని ఏదో పుస్తకం తిరగేస్తోంది. నిజానికి దేనిమీదా మనసు నిలపలేకపోతోంది. నిరంతరం ఒకటే ఆలోచన. అది వానుగురించి. తనేం చె య్యాలి? తనేం చేయ్యాలి? ఏదోఒకటి చె య్యాలి? దానికోసం పథకం వెయ్యాలి. ఈ ఆలోచనే తప్ప మరే విషయం మీదా సుమకి ఆసక్తిలేకుండా పోయింది. అయితే తనలోపల జరుగుతున్న యుద్ధం, చెలరేగుతున్న అలజ డి, అణుమాత్రంకూడా బయటికి కనబడ కుండా జాగ్రత్తపడటం ఆమె మొదటి కర్తవ్యం అయిపోయింది. కోమేశ్వరి చాలా తెలివైంది. ముఖంచూసి, మనసులో మెదులుతున్న మూ డొంతుల విషయం కనిపెట్టేయగలదు. అందుకే సుమ ఎన్నో జాగ్రత్తలు తీసుకుంది. చటుక్కున వంట్లో బాగుండలేదన్నా తల్లివూ రుకోదు. డాక్టరు దగ్గరికి తనే తీసుకు వెళ్తుంది. ఆ గొడవపడటం కష్టం అందుకే సుమ జాగ్రత్త లు. అప్పటి నుండీ తీవ్రంగా ఆలోచిస్తోంది.

విశ్వనాథ్ ఆఫీసు పనిమీద కలకత్తా వెళ్ళ టంవల్ల, నాలుగు రోజులుగా మరీ వంటరి తనం అనుభవిస్తోంది. తండ్రి వూళ్ళోవుంటే ఏదో ఒకక్షణంలో తన మనసులోని మాటకనిపె ట్టి ఓదార్చుతాడు. ఇప్పుడా ఆశలేదు. ఆయన వచ్చేవరకు సుమ తన నటనా చాతుర్యం చూపించటంతప్ప వేరే మార్గంలేదు.

సుమ బొమ్మలు తిరగేస్తూ ఆలోచించుకుపో తోంది. ఒకదానికొకటి సంబంధంలేని ఆలోచన లు.

కాలింగ్ బెల్ మోగింది. సుమ బద్ధకంగా లేచివెళ్ళి తలుపు తీసింది. అవతల నిబడివు న్న వ్యక్తినిచూసి ఆశ్చర్యపోయింది. అంతలోనే ఆనందంగా ''రేణూ'' అంటూ ఆమె భుజాల మీద చేతులేసింది. రేణుక నవ్వుతూ లోపలికొ




చ్చి "నయంలే. గుర్తున్నాను. పూర్తిగా మర్చిపోయావేమో, ఏవేవోచెప్పి- గుర్తుకుతేవాలేమో అనుకుని భయపడ్డాను" అంది చమత్కారంగా .

"చాల్లెద్దూ. మరీ చెప్తావు. నిన్నెలా మర్చిపోతాను. అయినా అమెరికా వెళ్ళిపోయినదానవు నువ్వే నన్ను మర్చిపోవాలిగానీ, నాదేముంది? ఎక్కడవేసిన గొంగళీ...అన్నట్టు" అంటూ రేణుకను సోఫాలో కూర్చోబెట్టి, మంచినీళ్ళతేవటానికి లోపలికెళ్ళింది.

"ఏమిటీ? సుమా చాలా చిక్కిపోయినట్లుంది" అనుకుంది రేణుక.

అరగంటలో రేణుక సుమ, రెండేళ్ళకబుర్లు చెప్పేసుకున్నారు.

"మూడు నెలలనుంచి నీనుంచి ఒక్క లెటర్‌లేదు. నేను రాసిన లెటర్స్ అందలేదా" అంది రేణుక.

"అందాయి. సారీ రేణుకా ఏమీ అనుకోకు. రోజూ రాద్దామనుకుంటూనే అశ్రద్ధ చేశాను."

"ఏమిటే అంత అశ్రద్ధచెయ్యాల్సింది" అంది దబాయింపుగా.

"అవునుగానీ నువ్వు అమెరికావెళ్ళివచ్చినా నీమాటలు, భాషా ఏం మారలేదే?" అంది తెలివిగా మాటమారుస్తూ సుమ.

రేణుక పకపకానవ్వేసింది. "భలేదానివే... మనుమలంత త్వరగా ఏమీమారిపోరు" అంది.

"నిజమే అనుకో... అదీ మనుమల్ని బట్టి వుంటుంది"

రేణుక సుమకోసం తనుతెచ్చిన అమెరికన్ శారీ, వాచీ, పెన్ను తీసియిచ్చింది.

"ఎవరూవచ్చింది" అంటూ కామేశ్వరి లోపల్నించివచ్చింది- సుమబాల చటుక్కున పెన్నుదాచేసింది.

రేణుకనిచూసి చాలా సంతోషించింది కామేశ్వరి. కాఫీ కలుపుతాననిలోపలికెళ్ళింది.

రెండురోజులు సుమ, రేణుక అటూఇటూ తిరిగారు. సుమకివున్న ఒకేఒక మిత్రురాలు రేణుక. ఆమె రిసెర్చ్‌కోసం అమెరికాలోవుంది ఇన్నాళ్ళూ. మళ్ళీ రేణుకరావడం సుమకి హాయిగావుంది.

రేణుక ఇక్కడే ప్రాక్టీసుపెట్టబోతోంది- సైకియాట్రిస్టుగా.

సుమ అనుకుంది ఎన్నోసార్లు. తనకున్న ఒక్కగానొక్క మిత్రురాలు రేణుక. ఆమెకి తన సమస్య చెప్పుకుంటే- అని.

రేణుక కూడా సుమలో చాలా మార్పుగమనించింది. మునుపటి అమాయకత్వం, ముగ్ధత్వం ఇప్పటి సుమలోలేవు. చాలా ఆలోచనలు లోపల గిరగిర తిరుగుతున్నట్టున్నాయి. అన్నిటికీ మించి తాజాగా ఏదో ముఖ్యసమస్యకూడా వుందని రేణుక చూచాయిగా గ్రహించింది.

ఇద్దరూ ఆ మూడురోజులూ కలిసితిరిగారు. అందులో ముఖ్యమైనపని- రేణుక హాస్పటల్ పెట్టుకునేందుకు అనువైన చోటుకోసం వెదకటం- కొంతమంది పెద్దపెద్దవాళ్ళని కలునుకోవడం-

ఆరోజుమాత్రం అలాతిరిగితిరిగి ఇద్దరూ బాగా అలిసిపోయారు. కనుచీకటిపడేవేళ బీచ్‌దగ్గరకిచేరి కూర్చున్నారు. దూరంగా సముద్రంలోకి కుంగిపోతున్న సూర్యుణ్ని అవిరామంగా ఎగిసిపడుతూ, దూరంనుంచి దొర్లుకొస్తున్న సముద్రకెరటాల్ని చూస్తూ సేదదీర్చుకుంటున్నారు.

ఆ సముద్రంవైపు చూస్తుంటే సుమ మనసు అల్లకల్లోలమవటం మొదలైంది. ఒక్కొక్క కెరటం ఒక్కొక్కజ్ఞాపకాన్ని మోసుకొస్తున్నట్లనిపించింది. నిశ్శబ్దంగా రేణుకవైపుచూసింది. అప్పుడే సరిగ్గా రేణుక కూడా సుమవైపుచూసి- "ఊ... చెప్పు" అంది.

సుమ ఉలిక్కిపడింది. "నిజంగా నువ్వు సైకియాట్రిస్టువే సుమా" అంది.

"ఇంకా అనుమానమా" అంది నవ్వుతూ రేణుక.

సుమ ఇహనేం దాచుకోదలచలేదు. అన్నీ చెప్పేసింది ఏదావరికంలేకుండా.

రేణుక దోసిట్లోకి ఇసుక తీసుకొని నెమ్మదిగా కిందకి జారుస్తోంది. సుమ ఇసుక నున్నగా చేస్తూ, దానిమీద ఏవేవో అక్షరాలురాస్తోంది. చెరిపేస్తోంది. రేణుక సూటిగా తలెత్తిచూస్తూ- 'సుమా! ఇలాంటి వాటిల్లో ధైర్యమే ముఖ్యం.

ఆధైర్యానికి ఒక్కొక్కసారి మొండితనంకూడా జోడించాల్సి వస్తుంది. బాబోయ్! ఏమవుతుందో అని ఆలోచిస్తే నువ్వేం చెయ్యలేవు" అంది. సుమ నిశితంగా రేణుకవైపు చూసింది.

"నువ్వు చెప్పింది నిజమే... చెయ్యడమెలాగా అనే ఆలోచిస్తున్నాను" అంది సుమ.

"చెయ్యకూడని పనిని కూడా అవసరం చేయిస్తుంది మనిషిచేత"

"మాఅమ్మ గురించి నీకు పూర్తిగా తెలుసో లేదోగాని ఆమె చాలా మొండి. నేనంటే చాలా యిష్టమే. కూతుర్ని కదా! అందుకని ప్రేమ సహజంగానే ఉంటుంది. ఆమెతో వచ్చిన చిక్కు ఏమిటంటే- తను వేసిన ప్లానుప్రకారం నేను సుఖపడాలంటుంది. ఆ సుఖపడటం అనే విషయంలోనే నాకూ, అమ్మకీ మధ్య పెద్ద అగాధం ఉంది" అని నిట్టూర్చింది సుమ.

"సరే... మనకి స్పష్టంగా తెలిసే విషయం ఏమిటంటే మీఅమ్మగారి ఇష్టప్రకారం చేస్తే నువ్వు సుఖపడలేవు. నీఇష్టాన్ని ఆమె మన్నించే ప్రశ్నేలేదు. ఇక మిగిలిందల్లా ఒక్కటే" అంది రేణుక.

"ఏమిటి?" అంది ఆత్రుతగా.

"నేను చెప్పినట్లు వినడం" అంది నవ్వుతూ.

సుమ కూడా తేలికగా నవ్వేస్తూ "వింటాను" అంది.



జగదీశ్వర్రావు తీరికగా పేపరు చదువుతూ కాఫీ తాగుతున్నాడు. విశాలాక్షి వచ్చి అతని దగ్గరగా కూర్చుంది.

పిల్లలిద్దరూ మార్నింగ్‌షో సినిమాకి వెళ్ళారు. వాసు ఏదో పనుందని బయటకెళ్ళాడు. ఇద్దరే ఉండటంవల్ల నిశ్శబ్దంగా ఉంది ఇల్లు.

చటుక్కున జగదీశ్ పేపరు పక్కన పడేసి- "నేనొకటి అనుకుంటున్నాను విశాలా! నువ్వు కూడా ఆలోచించి చెప్పు" అని ఆగాడు.

"ఏమిటి" అంది విశాల.

"వాసుకి వీలయినంత త్వరగా పెళ్ళి చేసేస్తే, వాడికంటూ ఒక తోడు దొరుకుతుంది. కొంచెం మార్పువచ్చి హుషారుగా ఉంటాడు. భార్యధ్యాసలో పడతాడు ఏమంటావు?" అన్నాడు. విశాల నెమ్మదిగా మొదలుపెట్టింది.

"నాకొక విషయం అర్థంకావటంలేదు. ఎవరైనా ఒక మనిషి ఒకవిషయంలో కొంచెం కలతపడి, జీవితభాగస్వామిని ఎన్నుకోవడంలో తికమకపడుతున్న సమయంలో ఇంకెవర్నో తెచ్చికట్టబెట్టి, మనసుని మళ్ళించేయగలం అనుకోవడం చాలా పొరబాటు. ఆపెళ్ళి అనేది అయిపోయాక మనసు తిప్పుకోలేకపోతే, అప్పుడొచ్చే సమస్యలు మరీ జటిలంగా ఉంటాయి" అంది.

జగదీశ్‌కి చర్రున కోపమొచ్చింది. దానికి కారణం మరేంలేదు తను అన్నది తప్పని ఎదురు చెప్పటంవల్ల వచ్చిన తాత్కాలిక ఉద్రేకం అది.

అయితే అతను అంతలోనే మళ్ళీ ఆలోచనలోపడ్డాడు.

"కొన్నాళ్ళు వాసుని స్వేచ్ఛగా ఉండనీయండి. అతనే మనసు తిప్పుకుంటాడు. అప్పుడు సంతోషంగా పెళ్ళి చేసుకుంటాడు" అంది విశాల.

"నిజానికి కామేశ్వరి విషయం పక్కకి పెట్టేస్తే ఇదేమంత సమస్యే కాదు" అన్నాడు సాలోచనగా. విశాల మెత్తగా నవ్వి- "కామేశ్వరే అసలు సమస్య. ఆమెనెలా పక్కకి పెట్టేస్తాం. ఆమె ఒక్కగానొక్క కూతురు సుమ. మరి...ఆ కూతురి పెళ్ళి విషయంలో ఆమె అభిప్రాయానికి చాలా ప్రాధాన్యం ఉంటుంది" అంది.

"నిజమే! కామేశ్వరి మరీ ఇమోషనల్. అందుకే భయం. మనమంతా కలిసి మొండిగా ఏదైనా చేస్తే అది ఏసముద్రంలోనో దూకేస్తుంది కూడా" అన్నాడు.

"అదేకదా అందరి భయం. పైగా చెప్పినా








# కాదేదీ కళకు అనర్హం!



సృజనాత్మక శక్తి వుండాలేగానీ చేసే పని ఎటువంటిదయినా కళాత్మకంగా చేయవచ్చునని నిరూపించాడు 'ఘనా' దేశానికిచెందిన ఓ వడ్రంగి. శవపేటికలను తయారుచేయడం అతని వృత్తి. కానీ ఆ శవపేటికలను అందరిలా సాదాసీదాగా చెయ్యడం అతనికి ఇష్టంలేదు. చనిపోయిన వ్యక్తి వివరాలన్నీ తెలుసుకొని అతని స్వభావానికి, వృత్తికి, అభిరుచికి తగ్గట్టుగా వారి శవపేటికలను తయారుచేస్తుంటాడు.

ఓసారి ఉల్లిపాయలు పండించే భూస్వామి ఒకాయన చనిపోతే ఆయనకు ఉల్లిపాయ ఆకారంలోనే శవపేటిక తయారు చేశాడట. 'కోకో' పెంచే ఆసామికి 'కోకో' మొక్క ఆకారంలో శవపేటికను తయారు చేశాడట. ఇటీవల ఓ జర్నలిస్టుకు రేడియో ఆకారంలో శవపేటికను తయారుచేసి జర్నలిస్టుల మన్ననలకు పాత్రుడయ్యాడట. ఆపైన వారు అతన్ని కీర్తిస్తూ బోలెడంత ప్రచారం ఇవ్వటంతో అతని వ్యాపారం ఊపందుకుని దినదినాభివృద్ధి చెందుతోందట.

---

వినిపించుకోదు. తనంతటతానుగా ఆమార్గాని కి రావాలి. తనకే ఆలోచన రావాలి, అది నచ్చాలి. అప్పుడుగాని అంగీకరించదు'' అంది.

''అందుకనే ఇప్పుడేమీ చెయ్యవద్దు మనం. కొంతకాలం వానుని అలాగే వుండనిద్దాం''అ న్నాడు జగదీశ్ భార్య ఆలోచనని సమర్థిస్తూ. విశాల తను చూసిన సుమ ఉత్తరాన్ని గురించి చెప్దామనుకుంది కానీ చెప్పలేదు. తటస్థంగా వూరుకుంది.

బయట స్కూటర్ ఆగిన శబ్దమైతే గేటు వైపు చూసింది. వాను వచ్చాడు. నెమ్మదిగా ఖాళీచేసిన కాఫీ కప్పు తీసుకుని లోపలి కెళ్ళి పోయింది విశాల.

''అన్నయ్యా! ఒక గుడ్‌న్యూస్'' అంటూ హుషారుగా వచ్చాడు వాను. ఆ క్షణంలో వాను ముఖంలో కనిపించిన ఉత్సాహం జగదీశ్‌కి ఎంతోసంతృప్తినిచ్చింది. ''అమ్మయ్య మళ్ళీ మామూలు మనుమల్లో పడుతున్నాడు'' అను కున్నాడు మనసులో.

''ఏమిట్రా అది?'' అన్నాడు ఆసక్తిగా.

''నేను మా కంపెనీ తరుపున వెస్ట్‌జర్మనీ వెళ్ళే అవకాశం వచ్చింది'' అన్నాడు.

జగదీశ్ అదిరిపడ్డాడు. ''ఎప్పుడు?'' అన్నా డు. ''త్వరలోనే- ఆరువారాల ప్రోగ్రాం అన్న య్యా! టెక్నికల్ అబ్‌జర్‌వేషన్'' అన్నాడు.

''ఓహో... అయితే చాలా మంచిదే'' అన్నాడు జగదీశ్. ''వెళ్ళి వస్తే ప్రామోషన్ కూడా యిస్తారు.''

''వదినకి చెప్తాను'' అంటూ లోపలికెళ్ళా డు.

జగదీశ్ విశ్రాంతిగా ఊపిరిపీలుస్తూ- ''అ దృష్టవంతుడు. స్థలం మార్పు మంచిది. పూర్తిగా కొత్తచోటుకి వెళ్తే మనసు పాతని మరిచి కొత్తదనాన్ని సంతరించుకుంటుంది అనుకు న్నాడు సంతృప్తిగా.

* * *

విశాలాక్షికి హడావిడి పెరిగిపోయింది. వాను విదేశీయాత్రకి కావలసినవన్నీ సమకూ ర్చే ప్రయత్నంలో ఊపిరి సలపటం లేదు. దానికి తోడు రోజువిడిచి రోజు ఆడపిల్లల తల్లులు- తండ్రులు, కలిసో, విడిగావచ్చి వాను ప్రస్తావన చేసి వెళ్తున్నారు. వచ్చినవారికి కాఫీలు, టిఫిన్లు, కూల్‌డ్రింకులు, సమకూర్చి కూర్చుని కబుర్లు చెప్పి ఎవరూ మనసు కష్టపె ట్టుకోకుండా నచ్చజెప్పి పంపడం- అదొక పెద్ద కార్యక్రమం అయిపోయింది- క్షణం తీరిక లేదు. అలాగని పెద్దగా జరుగుతున్న పనీలే దు.

వచ్చినవాళ్ళని త్వరత్వరగా వదుల్చుకుని అసలు పనిలో పడేసరికి తలప్రాణం తోకకివ స్తోంది. కరుణ, మురళి పరీక్షల కోసం చదువు కుంటున్నారు. వాళ్ళని తనేం పట్టించుకోవడం లేదని మనసు పీకేస్తుంటుంది మధ్యలో. అదే మాట కరుణతో అంటుంటే కరుణ వినుగ్గా- ''పట్టించుకోవడమేమిటమ్మా? ఏదో ఒంటికి నూనె పట్టించినట్టు-, మాకు తెలీదా ఎలా చదువుకోవాలో'' అంటూ తేలిగ్గా కొట్టిపారే స్తుంది, తనూ నవ్వేసి సరిపెట్టుకుంటూ వస్తోంది.

ఆరోజు బాగా చీకటిపడ్డాక మధ్యా హ్నంనుంచి బాగా మబ్బుపట్టి వుండటం వల్ల నేమో సన్నగా చినుకు ప్రారంభమైంది. దానికి ఈదురుగాలికూడా తోడయింది. చదువుతున్న పుస్తకం పక్కన పెట్టి కామేశ్వరి కిటికీ తలుపు లు మూస్తూ విసుక్కుంది. ''ఈ వేళ్టికి కూడా యింటికి రాకపోతే- రానీ చెప్తాను''

మనసు పట్టక వీధి తలుపుతీసి గేటువైపు చూసింది. గాలివాన కొంచెం పెరిగింది. ఇంతలో ఒక నల్లకారు స్పీడుగా వచ్చి వాకిట్లో ఆగటం, అందులోంచి హడావుడిగా సుమ బాల దిగడం, అంతలోనే ఆ నల్లకారు వచ్చి నంతవేగంగానూ వెళ్ళిపోవడం జరిగింది. అది చూసిన కామేశ్వరి ఆత్రుతుగా సుమకేసి వెళ్ళింది. సుమ దాదాపు నిద్రలో నడుస్తున్న ట్లుగా తూలుతూ రావడం చూసి ఒక్క వుదు టన వెళ్ళి పొదివి పట్టుకుంది.

''అమ్మా'' బావురుమంటూ తల్లిని వాటేసు కుపోయింది సుమబాల.

కామేశ్వరి నిలువెల్లా ఒణికిపోతూ- ''ఏమ్మా సుమా... ఏమైంది? ఏమైంది?'' అంటూనే యింట్లోకి నడిపించుకుపోయింది. సుమ పూర్తిగా తల్లిమీద వాలిపోయింది. ఒక్క మాట




కూడా చెప్పలేకపోయింది. గుండెలు వగిలేలా ఏడుస్తోంది. కామేశ్వరికి కాళ్ళూచేతులూ ఆడ లేదు. విపరీతమైన భయం ఆమెని ఆవ హించింది- సుమని సోఫాలో పడుకోబెట్టి ఫేను వేసి వీధితలుపువేసి వెనుతిరిగి సుమను ఒక్క క్షణం పరీక్షగా చూసింది. చీర బాగా నలిగి పోయి, జాకెట్టు పూర్తిగా చిరిగిపోయింది.

జుట్టంతా రేగిపోయి నగం జడ వూడిపో యింది. సుమ చిన్నగా, అందంగా దిద్దుకునే బొట్టు లేనేలేదు. ముఖం, కళ్ళు వాచిపోయి వున్నాయి. పెద్ద పెద్ద ఎక్కిళ్ళతో గుండెలు ఎగిరె గిరిపడుతున్నాయి. కామేశ్వరి మనసు శంకిస్తూ కంపించి పోయింది.

"సుమా! సుమా! ఏంజరిగిందమ్మా?" అంది కూతురి ముఖాన్ని రెండు చేతుల్లో తీసుకుని ఆందోళనగా చూస్తూ.

"అమ్మా" అంటూ మళ్లీ గోలగా ఏడ్చింది. "ఇంకేముందమ్మా! అంతా అయిపోయింది. నేను పూర్తిగా నాశనమైపోయాను. అమ్మా అమ్మా నేను చచ్చిపోవడమొక్కటే మార్గం. అమ్మా నన్ను వెళ్లిపోనీయమ్మా. ఆ దుర్మార్గు లు నన్ను ఆ సముద్రపొడ్డున వదిలేస్తే అందులో దూకి చచ్చిపోదామనుకున్నాను. కానీ- కానీ వాళ్లు నన్నిక్కడ వదిలారు" అంది మాటలమధ్య ఏడుస్తూ.

కామేశ్వరి కూతుర్ని గట్టిగా కౌగలించు కుంది. "సుమా ఏమిటి తల్లీ ఆ మాటలు? నువ్వేంచేశావు. నువ్వు చచ్చిపోవడమేమిట మ్మా ఏమైందమ్మా! ఎవరా వచ్చినవాళ్లు" అలా ఎంతసేపో అడిగింతర్వాత చెప్పింది సుమ.

"నన్ను బలవంతంగా ఆ దుండగులు తీసుకుపోయి నాశనం చేశారమ్మా" అంటూ ఏడుస్తూ సొమ్మసిల్లి పడిపోయింది సుమ. కా మేశ్వరి తలమీద పిడుగు పడింది. కొన్ని క్షణాలామె ఏమీ మాట్లాడలేకపోయింది. తలతి రగడం మొదలు పెట్టింది. తనేమైపోతున్నానో అని గాభరాపడిపోయింది. అస్తవ్యస్తమైన పరి స్థితిలో కన్నకూతురు కళ్లముందు పడివుంది. తనేమో నిలబడలేకుండా వుంది. కళ్లు తిరిగి పోతున్నాయి.

ఏమైంది సుమకి? అసలెందుకిలా జరి గింది? మనకి శత్రువులెవరున్నారు? తన ఒక్క గానొక్క పిల్లమీద కక్ష పెట్టుకోవాల్సిన పని ఎవరికుంది? ఎందుకు ఈశిక్ష తనకి? ఇంత అల్లారుముద్దుగా పెంచుకున్న తన కూతురి మీద యింతటి అత్యాచారం చెయ్యడానికి ఎవరు పూనుకున్నారు? ఎందుకిలా అయింది? ఎందుకిలా అయింది? నాకీ రంపపుకోత ఎందుకొచ్చింది? అయ్యో నేనెలా తట్టుకోగల ను?

ఇల్లంతా గిరగిరా తిరిగిపోతున్నట్లు, కళ్లు బైర్లు కమ్ముతుండగా బయట కాలింగ్‌బెల్లు మోగింది.

కామేశ్వరి తూలుతూ అతి కష్టంమీద వెళ్లి తలుపు తీసింది. ఎదురుగా విశ్వనాథ్.

కామేశ్వరి భర్త ముఖంలోకి చూసింది. కాని ఆమెకేమీ కనిపించలేదు. నిస్సత్తువా, దుః ఖం ఆమెని కమ్మేశాయి. తనేదుస్తున్నట్లు తెలిసిందిగానీ ఆతర్వాత ఆమె స్థితి ఆమెకే తెలియలేదు.

మళ్లీ కామేశ్వరికి మెలకువ వచ్చేసరికి మర్నాడు పదిగంటలైంది. నెమ్మదిగా కళ్లు తెరిచి చూసింది. తను మంచంమీద పడు కుని ఉంది. దూరంగా సుమ నిద్ర పోతోంది. ఆమె పక్కనే రేణుక కూర్చుని ఏదో పుస్తకం తిరగేస్తోంది.

నెమ్మదిగా క్రితం రాత్రి విషయం గుర్తుకు రావడం మొదలుపెట్టింది. అది కలా నిజమా అనే సందేహం కలిగింది. కాని అది నిజమే నని క్రమంగా గుర్తు రావడం మొదలైంది. ఆమె గుండె బరువెక్కింది. కళ్లల్లో నీరూరటం మొదలైంది.

ఇంతలో రేణుక అటుచూసి- "ఆంటీ ఎలా వుందిమీకు?" అంటూ వచ్చింది.

రేణుక చేతిని తన చేతిలోకి తీసుకుని నిశ్శబ్దంగా కళ్లనీళ్లు పెట్టుకుంది కామేశ్వరి.

"ఛ... మీరలా బాధపడకండి" అంది రే ణుక గంభీరంగా.

"రేణూ మా సుమ... " అని మరింక మాట్లాడలేకపోయింది.

కామేశ్వరి దీనాతిదీనమైన ముఖం చూసేస రికి రేణుక గుండె నీరైపోయింది. కాని తనూ

బేలపడకూడదని- "ఇప్పుడు సుమకొచ్చిన ప్రాణాపాయం ఏమీలేదు- మీరు ధైర్యంగా వుండాలి" అంది.

"ప్రాణాపాయం లేదు కాని దాని మానం...."

మీరలాంటిమాటలంటూ బాధపడితే సుమని పట్టుకోవడం మరీ కష్టమవుతుంది.

కామేశ్వరి బుర్ర చురుకుగా యోచించింది. నిజమే... తనేమైనా మాట తూలితే సుమ దక్కదు. తనెంతో జాగ్రత్తగా సుమకి ధైర్యం చెప్పాలి. ఏమీ జరగలేదనే చెప్పాలి?

రేణుక నెమ్మదిగా కామేశ్వరి చెయ్యి పట్టుకుని చిన్న గొంతుకతో "ఆంటీ- నేనొక మాట చెప్తాను. ఏమీ అనుకోకండి. నేను చాలా చిన్నదాన్ని. మీకు సుమలాంటిదాన్ని" అని ఆగింది.

"చెప్పు తల్లీ" అంది గాద్గదికంగా కామేశ్వరి.

"మీరు త్వరగా మనసు దిటవు చేసుకుని మామూలుమనిషి అవ్వాలి. లేకపోతే చుట్టుపక్కలవాళ్ళు ఏమాత్రం గ్రహించినా చెవులు కొరుక్కుంటారు. పరామర్శించటానికి కూడా వస్తారు. అదో పెద్ద తతంగమవుతుంది. జరిగిందెలాంటి ఘోరమైనా అది నలుగురి నోట్లోపడితే ఎదుర్కోవటం మరీ కష్టమవుతుంది" అంది.

కామేశ్వరికి ఒక్కసారి చురుకుతనమొచ్చినట్లయింది. చాలా జాగ్రత్తగా ఆలోచించటం మొదలెట్టింది. ఈ సంఘంలో సుమని ఎవరో మానభంగం చేశారు అనే విషయం ప్రచారం కాకుండా చూడటం చాలా ముఖ్యం. ముక్కుపచ్చలారని పిల్ల. దాని జీవితమంతా బూడిదలో పోసిన పన్నీరయిపోతుంది. తనే బయటపెట్టుకుని అల్లరి చేసుకుంటే ఇక తనకూతుర్ని కడుపులో పెట్టుకుని ఆదరించేది ఎవరు?

కామేశ్వరి ఆలోచనలు నెమ్మదిగా వెనక్కివెనక్కి పయనించటం మొదలుపెట్టాయి. జ్ఞాపకాలలో తల్లి బొమ్మ కలతకలతగా కదలటం మొదలుపెట్టింది. అమ్మ అనుభవించిన అవమానం మళ్ళీ తన కూతురు అనుభవించింది. జీవిత సంఘటనల్లో కూడా పోలికలుంటాయా.

సుమ చాలా నాజూకుగా యింట్లో తిరుగుతుంటే ఆ కవళికల్లో తల్లి తనకి చాలాసార్లు గుర్తుకొచ్చింది. అయితే అప్పట్లో తనావూహ చెయ్యటానికే యిష్టపడేదికాదు. అమ్మ చిన్నప్పుడే తనకంటే ఎంతో నాజూకుగా, అందంగా వుండేదని అంతా అనేవారు. అప్పట్లో తనకి అమ్మని చూస్తే కోపంగా, ఈర్ష్యగా వుండేది. తను నాన్న పోలికలో అని సరిపెట్టుకునేది,-ఇప్పుడాలోచిస్తే అమ్మని తల్చుకుంటే జాలేస్తోంది.

మూడురోజులు గడిచిపోయాయి. ఈ మూడురోజులూ కామేశ్వరి ఆలోచనలతో వేగిపోయింది. విశ్వనాథ్ ఒక్కమాట అంతవరకు మాట్లాడలేదు. ఆరోజు మాత్రం భార్యదగ్గరికి వచ్చి- "నేను పోలీసు రిపోర్టు యిచ్చి ఆ దుర్మార్గుల అంతం చూద్దామనుకున్నాను- రేణుక అడ్డుపడింది" అన్నాడు.

కామేశ్వరి భయంగా చూసింది భర్తవైపు.

"మంచిదయింది, జరిగింది చాలక రిపోర్టిచ్చి పిల్లని బజారు పాలుచేసుకోవడమే అవుతుంది- అలాచేస్తే" అంది.

"అసలు అది వంటరిగా వెళ్ళడమే తప్పు" అన్నాడు విశ్వనాథ్.

"బాగుంది... మన ఖర్మ, దాని రాతా అలా ఉంది. ఇన్నాళ్ళూ బయటకెళ్ళకుండానే వుంటోందా? ఇన్నిరోజులూ ఏమైనా జరిగిందా?- ఇదిగో, మీరు మాత్రం సుమ ముందర యిలాంటి విషయమేమీ అనకండి. అది చాలా దెబ్బతినివుంది. ఏ అఘాయిత్యం చేసినా మనకి పిల్లకూడా దక్కదు" అంది కళ్ళనీళ్ళపర్యంతంగా.

విశ్వనాథ్ మొదటిసారిగా భార్యవంక ఆశ్చర్యంగా చూశాడు.

కామేశ్వరి అకస్మాత్తుగా భర్త దగ్గరికి వచ్చి రహస్యంగా- "సుమదీ, మా అమ్మదీ ఒకటే నక్షత్రం, చూడండి. ఎంత చెడ్డ జాతకమో - యిలాంటివి కూడా పొల్లుపోకుండా సంక్రమిస్తాయన్నమాట" అంది. ఈసారి విశ్వనాథ్ నిర్ఘాంతపోయాడు.

అలా పదిరోజులు గడిచాయి.

సుమలో కనిపించే స్తబ్ధతను పోగొట్టటానికి అన్నట్టుగా కామేశ్వరి మరీ హుషారుగా వుంటోంది పైకి. లోపల్లోపల మాత్రం ఆ తల్లి గుండె పగిలేలా దుఃఖిస్తూనేవుంది.





ఆరోజు రేణుక హాస్పిటల్ ప్రారంభిస్తోంది. సుమని రమ్మందిగానీ తను ఎక్కడికీ రానంది సుమ. అయినా కామేశ్వరి బలవంతం చేసి పంపింది. రేణుకతో మాత్రం వెయ్యి జాగ్రత్తలు చెప్పింది. రాత్రి తొమ్మిది గంటలకి రేణుక జాగ్రత్తగా తీసుకొచ్చి అప్పగించింది సుమని.

రాత్రి కామేశ్వరికి నిద్రపట్టలేదు. మాత్రలు వేసుకున్నా పనిచెయ్యలేదు. ఆమె కళ్ళు మూసుకున్నా తెరచినా తల్లి కనిపిస్తోంది, చాలా ఏళ్ళ తర్వాత ఏడుస్తోంది.

ఆరోజు అమ్మ మొట్టమొదటగా మామ్మ దగ్గర కూర్చుని ఏడుస్తూ తనకు జరిగిన అన్యాయం చెప్పింది. ఆరోజు అమ్మ ముఖం యిప్పటికీ తనకి బాగా గుర్తుంది. ఆ రాత్రి మామ్మ చెప్పగావిని నాన్న రాక్షసుడే అయ్యాడు. ఆరోజు అమ్మని నాన్న చితగకొడుతుంటే ముందు మండువాలో పడుకుని తను ఎంతో ఏడ్చింది. అసలదంతా జరిగిన రోజే చెప్పాల్సింది అని తనూ అనుకుంది. ఈరోజు సుమ తనకి వెంటనే చెప్పింది. తనేం చెయ్యగలిగింది? కప్పిపెట్టుకోవడం తప్ప. ఈనాడు ఈ యింట్లో సుమకి వున్న అండదండలు - అనురాగ అప్యాయతలూ ఆనాడు తన తల్లికి ఆ ఇంట్లో ఎక్కడివి?

కాని, కాని తనా బాధలు చూడలేకపోయేది, అమ్మదే తప్పనిపించేది. అమ్మ వెంటనే చచ్చిపోక ఎలా బతికుందీ అని కసితీరా అనుకుంది. ఎందుకు? తనలా ఎందుకనుకుంది? ఈరోజు సుమ చచ్చిపోతుందేమోనని తనెంత తల్లడిల్లిపోతోంది? అందుకే అంటారు పెద్దలు తల్లికి పిల్లల మీద వుండే ప్రేమ పిల్లలకి తల్లిమీద వుండదు అని. వారి పిల్లల మీద వుంటుంది. అమ్మ తన పెళ్ళి ఎక్కడ జరగదో అని బాధపడికదూ ఆమె నరకంలాంటి కొంపలో ఆత్మహత్య చేసుకోకుండా వుంది. చివరికి ఆమె చచ్చిపోయిన విధానంఎవ్వరూ పట్టించుకోలేదు. మామ్మ అర్థం చేసుకున్నంత కూడా తను అర్థం చేసుకోలేకపోయింది. ఎందుకు? ఎందుకు?

రాత్రంతా కామేశ్వరి అమ్మా అమ్మా అంటూ నిశ్శబ్దంగా రోదించింది. అప్పుడామెకి వాను గుర్తుకొచ్చాడు. ఆ పసివాణ్ని కూడా తనెంతో ద్వేషించింది. ఎందుకు? ఎందుకు? వాడేం చేశాడని? కామేశ్వరి వొళ్ళు జలదరించింది. ఒకవేళ సుమకీ అలాంటి పరిస్థితి వస్తే- వద్దు- వద్దు- రాకూడదు. తను రానీయదు. ఎలా? తను ఇది నగరం గనుక సుమను లేడిడాక్టరు దగ్గరికి తీసుకెళ్ళగలదు.

సుమ మరే అవమానం పొందకుండా ఆ డాక్టర్ కాపాడగలదు. కానీ సుమ మనసుకేర్పడిన గాయాన్ని ఆ డాక్టర్ మాన్పగలదా?

మొన్న సుమ హైద్రాబాద్ వెళ్ళినప్పుడు తనెంతో కోపంతెచ్చుకుంది. అన్నయ్యా, వదినా వానుని చేరదీసారని కదూ తను తెగతెంపులు చేసుకుంది?—

తనకి దెబ్బ తగిలాక ఎదుటివారి బాధ తనకి తెలిసింది. కాని వదిన అలాంటిదేమీ లేకుండానే ఎదుటివారి కష్టాన్ని అర్థంచేసుకోగలిగింది, నిజం! వదిన మంచిది- ఆమె హృదయం గొప్పది.

ఎడతెరిపిలేని ఆలోచనతో, పశ్చాత్తాపంతో, వేదనతో కామేశ్వరి రాత్రంతా జాగారం చేసింది.

తెల్లవారాక అంతా టేబుల్ దగ్గర కూర్చుని కాఫీ తాగుతున్నారు.

"వాను ఏంచేస్తున్నాడు" అంది అకస్మాత్తుగా కామేశ్వరి.

విశ్వనాథ్, సుమ వులిక్కిపడి కామేశ్వరి వైపు చూశారు. తాము పొరబాటు వినలేదని నిర్ధారించుకున్నాక-

"బి.ఇ. చేసి, జాబ్ చేస్తున్నాడు" అన్నాడు విశ్వనాధ్ పొడిగా.

సుమ ఏమీ మాట్లాడలేదు. కాఫీ పూర్తిచేసి నెమ్మదిగా తన గదిలోకి వెళ్ళిపోయింది. కామేశ్వరి చాలా నెమ్మదిగా భర్త భుజాలమీద చెయ్యివేసి- "నన్ను మీరు ఎలా అర్థంచేసుకుంటారోగానీ యిన్నాళ్ళ నా ఆలోచన తప్పని యిప్పుడు నాకనిపిస్తోంది- మనం ఒక్కసారి మా అన్నయ్యని, వదినని చూసివద్దాం" అంది.

అప్పుడు కామేశ్వరి కళ్ళలో ఏర్పడిన నీటి పొర చూసి విశ్వనాథ్ చలించిపోయాడు. భార్యని పొదివిపట్టుకుని ఆమెని నెమ్మదిగా నిమిరి—



"నీ యిష్టం కాముడూ... తప్పక వెళ్లాం" అన్నాడు.

"రేపే వెళ్దాం" అంది చటుక్కున.

* * *

అకస్మాత్తుగా గుమ్మంలో దిగుతున్న కామేశ్వరినీ, విశ్వనాధ్‌ని చూసి విశాల నిర్ఘాంతపోయింది.

అదీ ఒక్క క్షణం మాత్రమే. అంతలోనే సర్దుకుని గేటుదగ్గరికి వరుగెట్టి కామేశ్వరిని ఆప్యాయంగా లోపలికి ఆహ్వానించింది.

"బాగున్నావా వదినా?" అంది కామేశ్వరి, ఆమె మాట్లాడుతుంటే గొంతు వణికింది.

"ఓ... అంతా బాగున్నాం? నువ్వేమిటలా నీరసంగా వున్నావు?" అంది.

అప్పుడే బయటకొస్తున్న జగదీశ్ చెల్లెల్ని చూసి వులిక్కిపడ్డాడు. సరిగ్గా తనతల్లి చనిపోయేటప్పటికి యిదేవయసు. చిన్నప్పుడు కామేశ్వరిలో తల్లిపోలికలు ఎక్కువ కనిపించకపోయినా ఇప్పుడు వయసుతోబాటుగా వచ్చిన తల్లి కవళికలు చూసి అతను తత్తరపడ్డాడు, పైగా అనుకోని ఈ రాకకి కారణం ఊహించలేక మరీ కంగారు పడ్డాడు.

"ఏమిటలా చూస్తుండిపోయారు" అన్న విశాల మాటలకి స్పృహలోకి వచ్చి- "ఏమిటిది కల!నిజమా" అన్నాడు. విశ్వనాధ్ బావగారి చేతులు పట్టుకుని-

"ఇప్పుడర్థమై వుంటుంది- యిది నిజమేనని" అన్నాడు.

కరుణని చూడటం యిదే మొదటిసారి. ఆ పసివాళ్ళూ, వాళ్ళ ఆప్యాయతలూచూస్తుంటే తనలోని మూర్ఖత్వం ఎత్తిచూపుతున్నట్లు బాధపడింది కామేశ్వరి.

ఆ రోజు మధ్యాహ్నం వాను బొంబాయి వెళ్తున్నాడు. ఆ హడావిడిలో వుంది విశాల. అనుకోకుండా కామేశ్వరి కళ్ళు వానుకోసం గాలించటం మొదలుపెట్టాయి.

వాను అప్పుడే స్నానంచేసి టవల్ చుట్టబెట్టుకుని వస్తున్నాడు. వస్తూనే కొత్తవాళ్ళెవరో వున్నారని చటుక్కున పక్కగదిలోకి తప్పుకున్నాడు. అంతలో కామేశ్వరి చూడనేచూసింది. గుండెలుమీద ఎవరోకొట్టినట్టు అనిపించిందామెకి. అచ్చం అమ్మలాగే వున్నాడు అనుకుంది.

"వానూ" అంది విశాల.

"వస్తున్నా వదినా" అంటూ లుంగీ కట్టుకుని షర్టు వేసుకుంటూ వచ్చాడు.

"ఎవరొచ్చారో చూడు" అంది విశాలాక్షి. వాను ఏమీ అర్థంకానట్టు చూసి. చిరునవ్వు నవ్వాడు. కామేశ్వరి చనువుగా దగ్గరికెళ్లి రెండు చేతులూ వాను భుజాలమీద వేసింది.

"నీకు నేనెవరో ఎలా తెలుస్తుంది? తెలిసే అవకాశం రాలేదు" అంది.

"మీ అక్కయ్య" అంది విశాల.

వాను చాలా మొహమాటంగా నిలబడిపోయాడు.

అరగంటలో అంతా గలగలా కబుర్లలోపడిపోయారు. పిల్లలు - చదువులు.

వాను జర్మనీ ప్రయాణం ఆరోజే కావడంతో దానితాలూకు సన్నాహంతో ఇల్లంతా సందడిగా వుంది. "సుమ మొత్తానికి ఘటికురాలు' అనుకున్నాడు జగదీశ్.

'అసలు కామేశ్వరిని ఎలా లొంగదీసింది చెప్మా' అనుకుంది విశాల.

వాను మాత్రం గంభీరంగా వుండిపోయాడు. సుమ గురించి విశాలా పిల్లలు వేసిన ప్రశ్నలకు ఓపికగా సమాధానం చెప్పింది కామేశ్వరి.

ఆ మధ్యాహ్నం వాను వెళ్ళిపోయాడు. ఆ రాత్రి కామేశ్వరి తిరుగు ప్రయాణమైంది.

* * *

హైద్రాబాద్ వెళ్ళివచ్చాక కామేశ్వరి బాగా ఉత్సాహం పుంజుకుంది. సుమ కూడా కాస్త మామూలుగా వుంటోంది.

ఆరోజు విశ్వనాధ్ యింటికి వస్తూనే కామేశ్వరిని పిలిచి-

"భువనేశ్వర్ నుండి వస్తారనుకున్నాం ఆ పెళ్ళివారు మళ్ళీ వస్తామని రాశారు" అన్నాడు.

కామేశ్వరి ముఖం కళావిహీనమైంది. తప్పుకోలేని బాధ ఆమెని చుట్టేసింది.

"ఇప్పుడేం చేద్దాం?" అంది బాధగా.





విశ్వనాధ్ వెంటనే ఏమీ సమాధానం చెప్పలేదు - నేరుగా లోపలికివెళ్ళి బట్టలు మార్చుకుని స్నానం చేసి వచ్చాడు. కామేశ్వరి నిశ్శబ్దంగా కాఫీ కప్పుతీసుకొచ్చి యిచ్చింది.

"ఎవరికి చేసినా-జరిగిన విషయం చెప్పే చెయ్యాలి" అన్నాడు విశ్వనాధ్.

కామేశ్వరి మ్రాన్పడిపోయింది. "అదెలా సాధ్యమండీ?" అంది.

"ఎలా సాధ్యమనేది కాదు ప్రశ్న- సాధ్యమయితీరవలసిందే"

"చెప్పకుండా వుంటేనేమి?"

"కుదరదు... మళ్ళీ తర్వాత గొడవలొస్తే"

"ఎవరికీ తెలీదుగా" —

"పిచ్చిదానా... మనం ఎవ్వరికీ చెప్పుకోకపోయినా తెలియదని నమ్మకమేమిటి?"

"అంటే" —

"అంటే ఈ సంగతి తెలిసిన నాలుగో వ్యక్తి వున్నాడని నువ్వు మర్చిపోకూడదు" —

కామేశ్వరి మరేం మాట్లాడలేదు. అప్పుడే గదిలోకి రాబోతూ తల్లిదండ్రుల మాటలు విన్న సుమబాల నిశ్శబ్దంగా తన గదిలోకెళ్ళిపోయింది. ఎక్కడికీ కదిలేందుకులేదు. ఇంట్లో కూర్చుంటే విసుగ్గా వుందామెకు.

కామేశ్వరి, విశ్వనాధ్ చాలాసేపు మాట్లాడుకున్నారు. చివరికి వాళ్ళు భువనేశ్వర్ సంబంధానికి తిలోదకాలు యిచ్చేశారు. ఆ తర్వాత అసలు సుమ పెళ్ళి ఎలా చెయ్యాలా అనే ఆలోచనలో పడ్డారు.

ఆ రాత్రంతా కామేశ్వరి భర్త చెప్పిన మాటలే ఆలోచించుకుంటూ పడుకుంది. వానుకి సుమనిచ్చి పెళ్ళిచేస్తే — అనే ఆలోచన వచ్చింది.

తను రభసచేస్తేతప్ప వానుగురించిన విషయం ఎవ్వరికీ తెలీదు

ఇప్పుడు సుమకి జరిగిన అవమానం గురించి విశాల అర్థం చేసుకోగలదు. ఆమె మాటంటే వానుకి వేదం.

తను జీవితంలో ఓడిపోయానా! అనే ఆలోచన తరచు ఆమెను బాధించినా, ఆమె ఒక్కటే అనుకుంది. తన ఆలోచనావిధానంలో మార్పువచ్చింది. దానికి కారణం తనకి తగిలిన దెబ్బే.

అయితే తనకి బుద్ధిచెప్పటానికి దేవుడు అమాయకురాలైన సుమని దెబ్బకొట్టాడెందుకు? ఇకముందైనా సుమ ఆనందంగా వుండాలి. అలా వుండాలి అంటే తను ఆమెని కడుపులో పెట్టుకునేవాళ్ళకి అప్పగించాలి. విశాలకంటే ఎవరున్నారు? వాను అన్నివిధాలా తగినవాడు. అందం- చదువు- ఉద్యోగం అన్నీ వున్నాయి. బుద్ధిమంతుడిలాగే కనిపిస్తున్నాడు. విశాలకి అసలు విషయం చెప్పి ఒప్పిస్తే సరి.

ఇలా ఆలోచిస్తుంటే తన దుస్థితికి తనకే ఏడుపు వస్తోంది కామేశ్వరికి. తనమీద తనకే జాలి. తనలోని అహంకారాన్ని కొట్టడానికి దేవుడే యిలా చేశాడని కామేశ్వరికి దుఃఖం కలుగుతోంది.

* * *

సుమ కిటికీతలుపులు తీసి, సున్నితంగా తెరలుతొలగించింది. దూరంగా సముద్రం నీలం పట్టుచీర పరచినట్లు, గాలికి కదిలీ-కదలకుండా కదులుతోంది- నీరెండ ఆకాశంలోంచి కరిగించిన బంగారునీరు జాలువారుతున్నట్లుంది- కాసేపు అలాచూస్తుంటే సుమ మనసు ఆనందంతో పరవశించిపోసాగింది. ఆమెకి సముద్రమంటే ఎంతో యిష్టం. ఆరేళ్ళపిల్లగా వున్నప్పటినుండి అమాయకంగా చూస్తూనే వుంది. తనెంతో మారిపోయింది కానీ ఈ సముద్రం యిన్నేళ్ళలో కొంచెం కూడా మారలేదు.

వెనకగావచ్చి వాను సుమభుజాలమీద చేతులు వేశాడు.

ఆమె వులిక్కిపడలేదు. ఆమెకి తెలుసు అతను తనవెనకగా వస్తాడనీ, అలాగే చేతులు వేస్తాడనీ "సుమా! నువ్వు గొప్పనటివి, నీ నటనాశక్తిని సరైన పద్ధతిలో ప్రదర్శించి కృషిచేస్తే నీకు "ఊర్వశి" బిరుదుకూడా రావచ్చు" అన్నాడు. అతని మాటల్లో వున్న వేళాకోళం-సరదా ఆమెకి ముచ్చటకలిగించాయి.

"మంచిమాట చెప్పావు! నాకసలు ఎదుట ఎవరైనా కనిపిస్తే నోట్లోంచి మాటేఊడిపడదు, నాకు చచ్చేభయం" అంది.

"అలాగని నన్ను నమ్మమంటావు" అన్నా

డు కొం చూస్తూ.

"డం నమ్మకపోవడం నీయిష్టంకానీ, జం"

రే పావం! అందుకే అంత అమాయ అందర్నీ అదరగొట్టావు" అన్నాడు.

మా! అభినేత్రి అని ఒక టి.వి. మా అరగంటకిమాత్రమే సత్యజిత్‌రే తీశా నువ్వుచూశావా"అంది సుమ.

"ఎం? చూశాను" అన్నాడు.

"మరింకేం? మనం నిత్యజీవితంలో ఎంతో నటిస్తాం. జీవితంలో అవసరాలు మరీ సమ ర్ధంగా మనల్ని నటింపజేస్తాయి. అలాని రంగ స్థలంమీద నటించగలం అనుకోవడం పొరబా టు. మన నటనలో మనదే స్క్రీన్‌ప్లే, మనదే దర్శకత్వం- మనవే డైలాగులు- మనసుకి జంఝూటన కలిగించే సంఘటనలు- వాటి నుండి బయటపడాల్సిన అవశ్యకత, ఇవే మని షిని జీవితంలో- ఈ జీవితరంగస్థలంలో మహానటుడ్నిచేస్తాయి...మహానటిని చేస్తాయి. ఇక్కడా అంతే- నిజానికి అమ్మని చాలా బాధించాను. తప్పనిసరైంది. మరోలా ఆమె ఆలోచనావిధానం మార్చటం కష్టం. ఇదేదో వీరోచితంగాచేసి, అమ్మని దూరంచేసుకోలేను. ఆమెమాట కాదన్నానూ అనే బాధ ఆమెకి జీవితాంతం కలిగించలేను" సుమ పెద్దగా ఊపిరిపీల్చుకుంది.

వాసు ఆమెవైపు ఆశ్చర్యంగా చూస్తుండిపో యాడు- "పోనీ నాతోకూడా అదేనాటకం కాస్సే పుఆడితే నారంగు కూడా బయటపడేదిగా" అన్నాడు.

"వద్దు వాసూ...నువ్విప్పటికే మానసికంగా బాగా దెబ్బతిని వున్నావు మళ్ళీ నిన్ను బాధించేహక్కులేదు. పైగా నిన్నావిధంగా పరీ క్షించాల్సిన అవసరం నాకేంలేదు" అంది-

బయట పూర్తిగా చీకటిపడి- ఆ చీకటి లోంచి నక్షత్రాలకాంతి దూరంగా సముద్రంమీ దపడి వింతవింత అందాలు జిమ్ముతోంది- వాసు అటే చూస్తున్నాడు.

"సముద్రం- ఆకాశం ఎంతబాగున్నాయో కదా" అన్నాడు.

"అందుకే నాకు హైద్రాబాద్‌కంటె విశాఖప ట్నం అంటేనే యిష్టం" అంది సుమబాల.






# చతుర ప్రపంచం

## బయోమెట్రిక్స్ సాధనాలు

**న్యూయార్క్‌**లో ఏ ప్రఖ్యాత బట్టలషాపుకు వెళ్ళినా అక్కడ లక్షలకొద్దీ రెడీమేడ్ బట్టలు క్రమబద్ధంగా అమర్చి వుంటాయి. విశాలమైన ఆ భవనాల్లో అక్కడక్కడా అద్దాలమర్చిన సెల్స్ వుంటాయి. వినియోగదారులు ఆ సెల్స్ లోపలికి వెళ్ళి తాము కోరిన బట్టలను ధరించి అద్దాల్లో చూసుకోవచ్చు. బనియన్లు, బ్రాలు, అండర్‌వేర్‌లు కూడా అలాగే చూసుకొని సెలెక్ట్ చేసుకోవచ్చు. వారివెంట సాపుకు చెందిన వారెవ్వరూ కాపాలా వుండరు. ఒకవేళ ఎవరూ చూడలేదు గదాని ఏ డ్రాయరో లోపల వేసుకొని పైన మామూలుగా తన బట్టలు వేసుకొని డబ్బివ్వకుండా బయటికి పోవాలనుకున్నా సాధ్యం కాదు. అతను బయటిద్వారం దగ్గరకొచ్చేటప్పటికి అలారం అరిచి గోలపెడుతుంది. తలుపులు వాటంతటవే మూసుకుపోతాయి. ఆ షాపులోని ప్రతి సరుకుమీద ప్లాస్టిక్ అయస్కాంతపు చిన్న పట్టీగాని, పిన్నుగాని ఉంటుంది తొడిగిచూసుకొన్న తర్వాత ఆ బట్టను విడిచి, ప్యాక్ చేయించి, బిల్లు ఇచ్చేస్తే అక్కడున్న సేల్స్‌గరల్ ఆబట్టమీదున్న అయస్కాంతం పట్టీ లేదా పిన్నును తీసివేస్తుంది. అయస్కాంతం ఉండటం వల్లనే ద్వారం దగ్గర అలారం మోగటం, తలుపులు మూసుకుపోవటం జరుగుతుంది. ఆ అయస్కాంతపు వస్తువును ఎవరంటే వారు తీసివెయ్యటానికి సాధ్యంకాదు. దాన్ని తీసివేయటానికి ప్రత్యేకమైన ఉపకరణమే కావాలి. అంతేగాక ఆ చిన్న అయస్కాంతపు పట్టీ ఎక్కడ అంటించారో ఇతరులు తెలుసుకోవటమూ కష్టమే.

దొంగ అవునా, కాదా అని తెలుసుకోవటానికి ఉపయోగించే సరళసాధనం అది. కాని, అనేక సందర్భాల్లో నీవు నీవే అవునో, కాదో తెలుసుకోవలసిన అవసరం వస్తుంది. ఉదాహరణకు నీవు లాస్ ఏంజిల్స్‌లోని ఒక బ్యాంకులో కంప్యూటర్ నిర్వాహకుడనుకుందాం. బ్యాంక్ రహస్యాలన్నీ ఆ కంప్యూటర్ రూమ్‌లోనే వున్నాయి. అక్కడకు వేరేవ్యక్తి వెళ్ళి నీ పేరు, పరిచయం చెప్పి లోపలికి వెళ్తే ఎలా? కాని అలా జరగటానికి వీల్లేదు. ఎందుకంటే ఆ కంప్యూటర్ రూమ్ తాళం తీసేముందు ఆ పక్కనే వున్న వెలిగే గూట్లో చెయ్యి మొత్తాన్ని దూర్చాలి. అప్పుడు కంప్యూటర్ తన ఎలక్ట్రానిక్ కళ్ళతో క్షణంలో చెయ్యి మొత్తాన్ని పరీక్షచేసి అది నీ చెయ్యి అయితే మాత్రమే లోపలికి వెళ్ళటానికి తలుపులు తెరుస్తుంది.

మరో ఉదాహరణ: మీరు బంగారపు ఆభరణాలను డల్లాస్ నగరంలోని ఒక బ్యాంక్‌లోని లాకర్‌లో దాచారనుకోండి. ఒకరోజున మీ నగలు మీరు తీసుకోవటానికి తాళం తీసుకొని వెళ్తారు. అప్పుడు మీరక్కడున్న ఒక బటన్ వత్తాలి. వెంటనే ఒక టార్చ్ ద్వారా మందమైన వెలుగు మీ కంటిమీద పడుతుంది. ఐ స్పెషలిస్టులా మీ కుడికన్నులోని అక్షిపటలంమీద రక్తనాళాల జాలాన్ని కంప్యూటర్ నాజూకుగా పరీక్షించి ఆ కన్ను మీదైతే మాత్రమే ఆ ఆభరణాలు తీసుకొనే వీలు కలిగిస్తుంది.

నెబ్రాస్కా మహిళలు తమ పిల్లల్ని డేకేర్ సెంటర్లో విడిచి ఉద్యోగాలకు వెళ్తుంటారు. అలా వెళ్ళేటప్పుడు పిల్లల్ని ఎవరెవరు తీసుకువెళ్లటానికి వస్తారో వారివారి వేలిముద్రలను తీసి ముందుగానే కంప్యూటర్‌కు ఇచ్చి వుంటారు. ఆ డేకేర్ సెంటర్లకు పిల్లలను తీసుకురావటానికి వెళ్లినపుడు వారక్కడున్న గాజు పలక మీద వేలిముద్ర వేయాలి. కంప్యూటర్ తక్షణం తన నెనపులోవున్న వేలిముద్రలతో పోల్చి చూసి ఆ బిడ్డను అప్పజెప్పాలో లేదో అదే నిర్ణయిస్తుంది. వేలిముద్రల తంత్రం పాతదే. కాని దాన్ని స్పష్టంగా చదివి, తక్షణం




పోల్చి, తీర్పు చెప్పే తంత్రం మాత్రం ఈ మధ్యనే వృద్ధిపొందుతోంది.

శరీరంలోని వివిధ భాగాలను పరీక్షించి, పోల్చి చూసే ఇటువంటి విధానాలన్నిటినీ 'బయోమెట్రిక్స్' అంటారు. అంటే శరీరపు లేక వ్యక్తిత్వపు 'ఎన్నడూ మారని, ఎవరూ అనుకరించలేని' లక్షణాలను కొలవటం. వేలిముద్రలు ఎప్పుడూ మారవు, ఎవరి వేలిముద్రలూ మరొకరి వేలిముద్రలను పోలివుండవని అందరికీ తెలిసిందే. కంటి అక్షిపటలంలోని రక్తనాళాల విన్యాసం కూడా అంతే. తల్లి గర్భంలోవున్నపుడే ఈ రక్తనాళాలు విశిష్టమైన విన్యాసంతో పెరుగుతాయి. అరిచేతిమీద వివిధ విన్యాసాల రేఖలూ అంతే. గాయాలవల్ల, కాలటంవల్ల అవి కొంత మాయవచ్చు. కాని ఎప్పుడూ మారవు.

కంప్యూటర్లను ఉపయోగించటంవల్ల ఇలా గుర్తించి పోల్చి చూసే బయోమెట్రిక్స్ పద్ధతులు చాలా సులభమయ్యాయి. బెంగుళూరులో ఒక పోలీస్ కంప్యూటర్ వుంది. ఒక వేలిముద్రను దానికి చూపిస్తే కర్ణాటక రాష్ట్రంలోని బంది పోట్లు, జేబుదొంగలు, జైలునుండి పరారయిన వారు, తప్పించుకు తిరుగుతున్న హంతకులు– ఇలా వేలాదిమంది వేలిముద్రలతో పోల్చి చూసి అపరాధి అయితే వారి పూర్వాపరాలను చెప్పివేస్తుంది. లైబ్రరీలలో కూడా ఇటువంటి బయోమెట్రిక్స్ సాధనాలను ఉపయోగించటంవల్ల చాలా ప్రయోజనాలున్నాయి. చెయ్యి చూపించిన వెంటనే నిర్భయంగా అవ లక్షణాలను చెప్పగలిన ఇటువంటి బయోమెట్రిక్స్ యంత్రాలమీద పాశ్చాత్యదేశాల్లో విపరీతంగా మోజు పెరుగుతోంది.

## తేనెలవనంలోని వనితల ఘనత

మన దేశంలోని బీహార్ రాష్ట్రంలో కరువు నిరంతరంగా పీడిస్తూనే వుంటుంది. అయినా 1967లో వచ్చిన కరువు ప్రజల జీవితాలపై తీవ్రమైన ప్రభావాన్ని చూపింది. బీహార్‌లోని ప్రజలు తమ సంప్రదాయాలనూ, సంస్కృతినీ పక్కకునెట్టి, ప్రాణాలు నిలుపుకోవటానికి తమకు చెందిన ప్రతి వస్తువునూ అమ్మకానికి పెట్టారు. నాలుగు రాళ్ళు సంపాదించుకోవటానికి తమకు తోచిన పనిని చేయ నారంభించారు. ఆ సమయంలో ఉత్తర బీహార్‌లోని మధుబనీకి చెందిన ప్రజలు తమకు వారసత్వంగా, సంప్రదాయపరంగా వస్తున్న తమ చిత్రకళానైపుణ్యాన్ని అమ్మకానికి పెట్టారు. మధుబనీ చిత్రకారుల కుంచెలు తొలిసారిగా కాగితంపైనా, కాన్వాస్‌పైనా అవతరించాయి. ఇక ఆ తరువాత మధుబనీ చిత్రకారులు తమ గతాన్ని పూర్తిగా వదిలేసి, తమదైన 'మిథిలా చిత్రకళ'ను ప్రపంచవ్యాప్తం చేశారు. ప్రతి యేటా కొన్ని లక్షల రూపాయల విలువైన "మిథిలా చిత్రాలు" మనదేశంలోనూ, విదేశాల్లోనూ అమ్ముడవుతున్నాయి. ఆనాటి కరువుకు ముందు మిథిలా చిత్రకళ ఉనికే ప్రపంచానికి తెలియనంత గోప్యంగా వుండేది.

ఉత్తర బీహార్‌లోని మధుబనీ ఉత్తరాన నేపాల్‌నుండి మనదేశాన్ని విడగొడుతుంది. తూర్పున కౌశికీ నది, పడమరన గంగా నదీ, దక్షిణాన గండకీ నది ఎల్లలుగా వున్న ఈ జిల్లాలో మిథిలా చిత్రకళ ప్రత్యేకంగా రూపొంది, విలక్షణంగా కొనసాగుతూ వస్తున్నది. 'మధుబనీ' అంటే 'తేనెలవనం' అని అర్థం. అంటే సౌభాగ్యవంతమైన ప్రదేశమన్నమాట. కొన్నివందల సంవత్సరాలనుండీ ఈ ప్రాంతంలో ఆచారంగా వస్తున్న చిత్రకళకు మత సంబంధమైన పునాదులున్నాయి. ఈ చిత్రకళలో స్త్రీలే నిష్ణాతులు. ఒక తరంలోని వృద్ధవనిత, తన తరువాతి తరంలోని యువతికి ఈ చిత్రకళను వారసత్వంగా నేర్పిస్తుంది. అలా కొన్ని వందల సంవత్సరాలుగా ఈ చిత్రకళ వర్థిల్లుతూంది.



సాంప్రదాయం ప్రకారం మిథిలా చిత్రకళ గోడలపైన మాత్రమే చిత్రించాలి. కులదేవత విగ్రహంవున్న పూజగదిలోనూ, నూతన దంపతుల పడకటింట్లోనూ, అతిథుల గదిలోనూ గోడలపై చిత్రాలను చిత్రిస్తారు వీళ్ళు. ఈ బొమ్మల్లో ఎక్కువగా రామాయణకథ, శివుడు, విష్ణు, బ్రహ్మ, కృష్ణుడు దుర్గామాత, కాళీమాత వంటి దేవతలకు సంబంధించిన కథలూ, పురాణాలలోని ఘట్టాలు చోటుచేసుకున్నాయి. నూతన దంపతుల పడకటింట్లో మాతృత్వానికీ, రాసలీలకూ సంబంధించిన చిహ్నాలనూ, శివుడు, దుర్గామాతల విశ్వరూపాల్నీ చిత్రిస్తారు. వివాహ పరిపూర్ణతను వెదురు చెట్లతోనూ, గర్భధారణను మామిడి, అరటి, దానిమ్మ పనస వంటి పండ్లతోనూ సంజ్ఞాసూచకంగా చిత్రిస్తారు. ఆరోగ్యమైన శిశూదయాన్ని చిలుకలతోనూ, ప్రేమ జంటలను ఏనుగులతోనూ ఈ చిత్రాల్లో చిత్రించారు.

మిథిలా చిత్రకళలోనే ఒక విలక్షణత వుంది. కాగా, ఈ చిత్రాలన్నీ మట్టిగోడలపైన చిత్రించడం మరో ప్రత్యేకత. ఈ చిత్రకారులు సాధారణమైన రంగుల్నే ఉపయోగిస్తారు. వీరి చిత్రాల్లో పంచభూతాలకు ఐదు వేర్వేరు రంగులు కేటాయించబడినాయి. భూమిని పసుపు రంగుతోనూ, నీలిరంగుతో అనంతమైన ఆకాశాన్నీ, ఎరుపురంగుతో నిప్పునూ, తెలుపు రంగుతో నీటినీ, గాలిని నలుపురంగుతోనూ సూచిస్తారు. ఒక తరంలోని స్త్రీ, మరో తరంలోని స్త్రీకి ఈ వారసత్వాన్ని అందించేటప్పుడు రంగులలోని వైశిష్ట్యాన్నీ భావాలకు సంబంధించిన వివరాల్నీ చిత్రాలు కలకాలం మన్నటానికి పాటించవలసిన చిట్కాలనీ తెలుపుతారు. అలా సజీవ నదిలా కొనసాగినప్పటికీ, సంప్రదాయం వల్లనో, మధుబనీ ప్రదేశపు భౌగోళికస్థితి వల్లనో ఈ కళ ఇళ్ళలోని మట్టిగోడలకే యింతకాలం పరిమితమైపోయి వుండేది.

మధుబనీ వనితల మిథిలా చిత్రకళా నైపుణ్యాన్ని ప్రపంచానికి తెలియజేసిన కరువు రక్కసి పరోక్షంగా ఈ ఒక్క మేలును చేసిందని చెప్పుకోవాలి.




# నోరుంటే చాలు కారు నడపొచ్చు

**అం**దమైన కార్లకి అమెరికా పుట్టినిల్లు. ప్రతి ముగ్గురిలోనూ ఒకరికి తప్పకుండా కారు వుంటుంది. ప్రతి కుటుంబంలో కనీసం ఒకటి రెండు కార్లుంటాయి. అక్కడ ప్రతినెలా ఏదో ఒక కొత్తమోడల్ కారు మార్కెట్‌లోకి వస్తూ ఉంటుంది. వీటిల్లో చాలారకాలు వికలాంగులకు ఉపయోగపడేవిగా వుండటం విశేషం. ఈ రంగంలో ఫ్రాన్స్ అమెరికాతో పోటీ పడుతోంది. ఇంగ్లండ్‌లోని వర్క్‌షైర్‌లో ఈ మధ్య వాహనాల ఎగ్జిబిషన్ నిర్వహించారు ప్రత్యేకించి వికలాంగులకోసం. ప్యారిస్‌కు చెందిన 'కాఫ్ కార్ కంపెనీ' రూపొందించిన ఓ ప్రత్యేకమైన కారు అందరిదృష్టినీ ఆకట్టుకుంది.

కాళ్ళూచేతులు లేని వ్యక్తి ఏమాత్రం ఇబ్బందిపడకుండా కోరుకున్నవేగంతో గమ్యాన్ని చేరడానికిది అన్ని విధాలా అనువుగా వుంది. పైగా ఈకారు నోటిమాట సాయంతో పరుగెడుతుంది. కారు తలుపు తీయాలన్నా వేయాలన్నా బటన్‌నొక్కితే చాలు. కాళ్ళులేని వ్యక్తి ఓ ప్రత్యేకమైన చక్రాల కుర్చీలో కారుదగ్గరికి వస్తాడు. ఈ కుర్చీని వైర్‌లెస్ రిమోట్ కంట్రోల్‌తో కారుకి అనుసంధానంచేశారు. కారు దగ్గరికిరాగానే ఒకబటన్ నొక్కాలి. తలుపుతెరుచుకుంటుంది. స్టీరింగ్ ముందుండే డ్రయివర్‌సీటు బైటివైపుకి వంగుతుంది. దాంతో ఆ వ్యక్తి ఇందులోకి జారతాడు. మరెవరి సాయంలేకుండానే అతను స్టీరింగ్ ముందు కూర్చుంటాడు. ఇక అక్కడినుంచి అతను ఎలా చెబితే ఆకారు అలా నడుస్తుంది. చక్రాల కుర్చీ మాటేమిటని మీకు అనుమానం రావచ్చు. స్టీరింగ్‌ముందుకి వెళ్ళగానే ఓ బటన్‌నొక్కితే ఆకుర్చీకాస్తా కారుపైకి వెళ్ళికూర్చుంటుంది. మళ్ళీ అవసరమనుకున్నప్పుడు వేరేబటన్ నొక్కి కిందకి దింపుకోవచ్చు. ఈ ప్రత్యేక కుర్చీని ఏ ఇతర మోడల్‌కారుకైనా బిగించుకోవచ్చు. దీన్ని బ్రిటన్‌లోని 'ఛైర్ అఫ్ లిమిటెడ్' కంపెనీ రూపొందించింది. భారతీయ కరెన్సీలో దీనివిలువ పదివేల రూపాయలదాకా వుంటుంది.

కాఫ్ కార్ కంపెనీ 1955 నుంచి వికలాంగుల కోసం ప్రత్యేక కార్లకు రూపకల్పన చేస్తోంది. అనేక సంవత్సరాల పరిశోధనల అనంతరం ఓ విశిష్ట కంప్యూటర్‌ని రూపొందించగలిగింది. ఈ కంప్యూటర్ ఎదుటివారి మాటవిని అందుకనుగుణంగా పని చేస్తుంది. స్టీరింగ్‌లో కూర్చున్న వ్యక్తి ఇచ్చే ఆదేశాలనిది తు.చ తప్పక పాటిస్తుంది. కుడివైపుకి లేదా ఎడమవైపుకి కారు తిరగాలంటే స్టీరింగ్‌ని బలవంతాన ఆవైపుకి తిప్పనక్కర్లేదు. ఈ కంప్యూటర్‌కి ఒక్కమాట చెబితేచాలు. అలాగే నిదానంగా పోవాలనుకున్నా వేగం పెంచాలనుకున్నా లేక ఆగాలనుకున్నా నోటితో చెబితే చాలు. వెంటనే కంప్యూటర్ ఆపని చేసిపెడుతుంది. వర్షం పడిందను




కోండి. స్టీరింగ్ ఎదురుగా అద్దమంతా నీటితో మనకబారుతున్నది. దాన్ని తుడవవల సిందిగా చెబితేచాలు. మరుక్షణమే వైపర్ పని చేయడం ప్రారంభిస్తుంది. మామూలుగా అయితే బ్రేకు వేయాలంటే కాళ్ళు పనిచే యాలి. కాని ఈ కారులో ఎక్కేవారికి కాళ్ళు లేకున్నా ఫర్వాలేదు. నోరుమాత్రం వుండాలి. ఈ కారు బ్రిటన్‌లో 37 వేల రూపాయలదాకా పలుకుతోంది. వికలాంగులగురించి మొసలి కన్నీరు కార్చే మన ప్రభుత్వాలు నిజంగా వారి సంక్షేమంకోసం ఏనాడైనా ఇలాంటి సరికొత్త ఆలోచనలు చేశాయా అన్న అనుమానం కలు గుతూవుంటుంది.

## నడిచే కంప్యూటర్

అరవై ఏళ్ళ తిప్పమ్మ జ్ఞాపకశక్తి అపారమైనది. శకుంతలాదేవి మోస్తరుగా ఆమెకూడా నడిచే కంప్యూటర్‌గా పేరుపొందింది. తిప్పమ్మ రానెబె న్నూర్ తాలూకా కకోలు గ్రామంలో చిల్లర సరుకు లు అమ్మేదుకాణాన్ని నడుపుతోంది.

తన వద్దకు వచ్చే ఖాతాదారుల ఖాతాలను ఆమె జాగ్రత్తచేసే విధానం అందరినీ ఆశ్చర్యచ కితుల్ని చేస్తుంది. శకుంతలాదేవి స్వయంగా వచ్చి తిప్పమ్మ దుకాణంలో సరుకులు కొనుగో లుచేసి డబ్బు తరువాత చెల్లిస్తానని వెళ్ళిపో యిందనుకోండి. కొన్నాళ్ళ తరువాత వచ్చిన శకుంతలకు ఆమె చెల్లించవలసిన డబ్బు ఎంతో చెప్పటానికి తిప్పమ్మ ఏ పుస్తకమూ తిరగేయదు. అంటే ఆమె పుస్తకంలో రాసుకో దు. తిప్పమ్మ ఒక పెట్టెలోంచి చిన్నపొట్లాన్ని బైటికి తీస్తుంది. ఆ పొట్లంలో పైనలబిళ్ళలు జొన్నవిత్తనాలు ఉంటాయి. అవి ఎన్ని ఉన్నాయో చూసిన తరువాత ఖాతాదారులు తనకు ఎంత డబ్బు చెల్లించాలో లెక్కగట్టి చెప్పేస్తుంది.

కొత్త పద్ధతుల్ని కనిపెట్టడానికి అవసరం తల్లిలాంటిదని అంటారు. ఆవిధంగానే చదు వురాని తిప్పమ్మ అవసరం కొద్దీ ఇటువంటి పద్ధతిని కనిపెట్టింది.

ఆమె కనిపెట్టిన పద్ధతిలో పదిపైనల బిళ్ళ పదిరూపాయలతో సమానం. పైన బిళ్ళ ఒక రూపాయతో సమానం. అలాగే ఒక జొన్న విత్తనం అరపైనల కింద లెక్క. అంటే ఉదా



హరణకు పదకొండున్నర రూపాయల లెక్కరా సుకోవాలంటే తిప్పమ్మ ఒక కాగితంలో పదిపై సల బిళ్ళ, ఎనిమిది జొన్న విత్తనాలు కలిపి పొట్లం కట్టి ఒక డబ్బాలో పడవేస్తుంది. కొన్నాళ్ళ తరువాత వచ్చిన ఖాతాదారులకు వారు చె ల్లించాల్సిన డబ్బు వివరాలు చకచకా చెప్పే స్తుంది. పొట్లంపైన పేరురాయకపోయినా ఏ పొట్లం ఏ ఖాతాదారుదో ఆమె ఇట్టే చెప్పేస్తుంది. ఆమె జ్ఞాపకశక్తి అంత అద్భుతమైనది. ఖాతదా రుల నుంచి తిప్పమ్మ వడ్డీ కూడా వసూలు చేస్తుంది. అందుకు ఖాతాదారులు అడ్డు చెప్ప రు.

తిప్పమ్మకు పాఠశాల చదువు సక్రమంగా సాగక మధ్యలోనే ఆగిపోయింది. ఇది యాభైఆ యిదేళ్ళనాటి మాట. ఆమెకు పన్నెండేళ్ళ వయసులోనే వివాహమయ్యింది. ఆమె భర్త నింగప్ప 'ముల్కి' పరీక్షలో ఉత్తీర్ణుడై చిల్లర దుకాణం పెట్టుకున్నారు. వారికి ఒక కూతురు. భర్త మరణించినప్పటి నుంచీ ఆ దుకాణనిర్వ హణ భారాన్ని తిప్పమ్మే వహిస్తోంది.

ఈ రోజుల్లో అందరూ ఇంగ్లీషు భాష నేర్చు కుంటున్నప్పుడు తన పిచ్చి పద్ధతి పట్ల ఎవరు శ్రద్ధ కనబరుస్తారు? అంటుంది తిప్పమ్మ. ★

# ఏరిన ముత్యాలు

★ మనస్సులో ఉన్న భావాన్ని మాటలతో దాచవచ్చునేమో కాని చూపులతో కప్పిపెట్టలేం. నాలిక మనం చెప్పినట్లు వింటుంది. కాని కళ్ళు మన ఇష్టంవచ్చినట్లు వినవు.

— ఎర్ల్ ఆఫ్ ఛెస్టర్‌ఫీల్డ్

★ ఉదయంనుండి సాయంత్రంవరకు శ్రమించి అలసినవాడికంటె, కోపంతో, విచారంతో గడిపినవాడు ఎక్కువగా అలసిపోతాడు.

--జేమ్స్‌ఎలన్

★ మనలో తప్పులు లేనప్పుడు ఇతరుల గురించి ఫిర్యాదు చేసినప్పుడు మనకు ఆనందం కలుగదు. మనలో లోపాలు, తప్పులు కుప్పలుగా ఉన్నప్పుడే ఇతరుల గురించి చెప్పి సంతోషపడుతూ ఉంటాం.

— ఫెనెలోన్

★ మనస్సు సంతోషంగా ఉంటేనే వ్యవహారంలో ఉదారత్వం ఉంటుంది.

— ప్రేమ్‌చంద్

★ రెండు అర్థాలొచ్చేమాట మాట్లాడి, మనకు అవసరమున్నచోట నొక్కిచెప్పి, లేదా కంటిసైగతోకూడా అబద్ధం చెప్పవచ్చు. ఇలాంటి అబద్ధం స్పష్టంగా చెప్పిన అబద్ధంకంటె ఎన్నోరెట్లు పెద్దది.

★ భగవంతుని తరువాత మనం ఋణపడేది స్త్రీలకే. కారణం- ఒకటి జన్మనిచ్చినందుకు, రెండు జీవితాన్ని సుఖమయం చేసినందుకు.

— బోవీ

★ ఎవరైనాసరే అన్ని విషయాల్నీ రహస్యంగా ఉంచగలరు కానీ రెండు విషయాలు మాత్రం దాచలేరు. ఒకటి- తాను మధువు సేవించిన విషయం, రెండు- తాను ప్రేమలో పడ్డ సంగతి.

— ఎంటీఫెనిస్

★ ప్రేమించడానికి తెలివితేటలు, అనుభవం, వాదన అవసరం లేదు. యవ్వనంలో అదొక విరుకెరటం.

— బ్రూనో లెస్సింగ్

★ చక్కని దృశ్యంవంటిది మంచి సంభాషణ. అది ఎంతటి నిరంతరమైనదో అంతటి కొత్తదనం, దిగ్భ్రమలను కలిగించే సొగసుకలది కూడా.

— బోర్నె

★ రాయబారి అనేవాడు తన దేశ సంక్షేమం కోసం విదేశాలకు వెళ్ళి అబద్ధాలు చెప్పే నిజాయితీపరుడు.

— వోట్టన్

సేకరణ: నల్లబెల్లి శ్రీమన్నారాయణ

# ప్రాంతాలు వేరైనా జన జీవనాడి ఒక్కటే!

వ్యాఖ్యలు: జ్యోతిరాణి



నాగాకన్నెలం! భరతజాతికే వన్నెలం!
మెరిసేవుత్తడి బొమ్మలం! కురిసే జాబిల వెన్నెల్లం!!



తుహినగిరి వరినరాల్లో విరిసిన అందాలమాలిక!
తరుణజన హృదయాలలో మార్మోగిన అనురాగ గీతిక!!


తొలివలపు సుధల సెలయేళ్ళు!
చెలుని ఎదను బంధించే సంకెళ్ళు!!
అరవిరిసిన సుమసుకుమారి కళ్ళు!
పదారువన్నెల పసిమికాంతుల వాకిళ్ళు!!



వితుకులమ్మి జీవించినా !
చిరునవ్వుల సిరులున్నవిలే !!
కారడవుల్లో కాపురమున్నా !
కన్నులలో వెన్నెల కొలువున్నదిలే !!



రాజస్థానంలో జన్మించినా రాజాలా బ్రతుకులేదు!
చెమటోడ్చి కష్టించినా కడుపుకింత తిండిలేదు!!
ఏం బతుకులో మావి? ఎడారిలోని ఎండమావులు?
ఏం ప్రభుత్వాలో మీవి? పూడ్పులేని లోతైన గోతులు?



నీదుమూపున కూర్చున్న వయ్యారి!
నాదుహృదయపీఠాన అధివసించిన దేవేరి!!
పరుగు పరుగున పదవోయి ఓ ఒంటెనేస్తం!
మండుటెండలకోర్వదులే నా ప్రియ కళత్రం!!



కూడులేదు గూడు లేదు కట్టుకోను గుడ్డలేదు!
అయినా ఆ కన్నుల్లో కల్మషాల నీడలేదు !!



నాటి నాగరికతకు ప్రతీకలమై!
పరిమళిస్తాం జాజులమై విరజాజులమై !!
జనాలను అలరిస్తాం నృత్యకారులమై !
జగాలను ఓడిస్తాం కాశ్మీరపు జలతారులమై



ముఖంలో మురిపించే ముగ్ధమనోహరలాలిత్యం!
ముచ్చటైన మువ్వల దండలు గుండెలపై అమరిన వైనం!!



ఎంత తపించి చేరెనో ఈ కళ్ళలోన తారలు!
ఎవరికి నందించినవో ఈ చురుకు చూపులు!!



అరివీరుల గుండెల్లో గుచ్చుకునే ములుకులం!
ప్రాణంమొడ్డి పోరాడే సమరరంగపు సైనికులం!!



పూటకు లేకున్నా పరులసొమ్ము దోచుకోం!
పూరిగుడిసెల్లో పుట్టిగిట్టినా ద్వేషాలను పెంచుకోం!!
ఎల్లలు లేనిది మా మంచితనం!
అణువణువున నింపుకున్నాం మానవత్వం!!



ముడతలు వర్ధమేనేమని చెబుతోంది!
గతం తాలూకు అనుభవాల గ్రంథాలు విప్పుతోంది!!



గిల్టునగల స్థానే పసిడి సొమ్ము పెడతాడంట!
వంట సిరులతో మాఁవ నేడే వస్తాడంట!!
గుండెపొంగగా నవ్వు జలజలాకురుస్తుంటె
ఎవరు చేస్తారంట ఈపూట వంట! హొటేలు కే పోదాం లెమ్మంట!



కరాలకూ కంఠాలకూ మణిపూసల అలంకారం!
లాలిత్యం ఒలికేమేనికి సౌహార్దమే పెట్టని కిరీటం!
కళామాత వదనూపుర మంజీరాలం!
మణిపుర శుభమంగళ తూర్యాలం!!



జలజలకురిసే పండువెన్నెలల పండుగవేళ!
హాస్యలాస్యాలతో కోయనృత్యవిన్యాసహేల!!

# రచయితలకు సూచనలు



ప్రచురించే ప్రతి నవలకు రు. 2000/-
పారితోషికం అందజేస్తున్న 'చతుర'లో ప్రతి
భావంతులైన రచయితలకు నెలనెలా నవ
లల పోటీయే. వైవిధ్యపూరిత ఇతివృత్తాలతో,
అనక్తికర రచనా నంవిధానంతో పాఠకులను
అకట్టుకోగల నవలలకు వేదిక 'చతుర'.

'చతుర'లో నవలకు వేసే చిత్రాలు, చతుర కథలు, చతుర ప్రపంచం వంటి శీర్షికలు
★ కాక కేవలం నవల మాత్రమే అచ్చులో 100 పేజీలు వుంటుంది. "చతుర"లో
అచ్చులో ఒక పేజీలో సుమారుగా 300 పదాలు వస్తున్నాయి. నవలనుబట్టి పేజీల
నంఖ్య పెంచటంగాని, తగ్గించటంగాని ఉండదుగనుక నవలలన్నీ సరిగా ఈ సైజుకు
నరిపడేలా, మొత్తంమీద 30 వేల పదాలకు తక్కువకాకుండా ఉండాలి. వ్రాత ప్రతిలో
వారివారి దస్తూరినిబట్టి, ఒక పేజీకి ఎన్నిపదాలు వస్తున్నాయనే దానినిబట్టి మొత్తం
నవల పేజీలకు ప్లాన్‌వేసుకోవటం అవసరం.

★ ఈ ప్రకారం "చతుర" కొరకై ప్రత్యేకంగా రాసిన నవలలు మాత్రమే పరిశీలనార్హాలవు
తాయి.

★ నవలను ప్రచురించే సమయంలో అవసరాన్నిబట్టి కొంత కుదించవలసివచ్చే
పక్షంలో, అందుకు అభ్యంతరంలేనివారే తమ నవలలను పంపించాలి.

★ ప్రచురణకై ఎన్నికకాని నవలలు తిప్పి పంపేందుకై నవలతోపాటు తగు పోస్టేజిని
జతపరచాలి. వ్రాతప్రతులు పోస్టులోగానీ, ఇతరత్రాగాని పోయిన సందర్భాల్లో మా
బాధ్యత ఉండదు.

★ సాధారణంగా నవలలు మాకు అందిన 4 వారాలలోగా ప్రచురణార్హంగా భావిస్తే ఆ
విషయం తెలియపర్చటమో, లేనిపక్షంలో తిప్పి పంపటమో జరుగుతుంది.

★ పారితోషికం ఏనెలలో ప్రచురిస్తే ఆ నెల మొదటివారంలో పంపబడుతుంది.

ఎడిటర్

**చతుర**

'ఈనాడు' కాంపౌండ్, హైదరాబాద్- 500 482




ఈ శీర్షిక ద్వారా ప్రతి నెలా 'చతుర' లో వెలువడే నవలను సమీక్షించే అవకాశాన్ని కల్పిస్తున్నాం. పాఠకులు తమకు నవల ఎందుకు నచ్చిందో లేదా ఎందుకు నచ్చలేదో వివరిస్తూ రచన బాగోగులు గురించి రాయాలి. సమీక్షలు రాసేవారు కథ మొత్తం మళ్లీ చెప్పకుండా, అవసరమైన మేరకే ప్రస్తావిస్తూ రాయాలి.

1. సమీక్ష అరఠావుకి మించకుండా కాగితానికి ఒక వైపునే రాయాలి.
2. ఏ నెల సమీక్ష ఆ నెల 20వ తేదీలోపు మాకు అందేటట్లు పంపాలి.
3. మీ సమీక్షకు తప్పనిసరిగా ఈ కింది కూపన్ జతపరచాలి.
4. కవరుపై 'చతుర సమీక్ష'కు అని పేర్కొని ఎడిటర్, 'చతుర', 'ఈనాడు' కాంపౌండ్, సోమాజిగూడ, హైదరాబాద్-500 482 అనే చిరునామాకు పోస్ట్‌చేయాలి.

మాకు అందిన సమీక్షలలో ఉత్తమమైనవిగా ఎంపికచేసి ప్రచురించినవాటిలో మొదటి మూడింటికి రు.100/-, రు. 75/-, రు. 50/- చొప్పున; మరో మూడింటికి రు. 25/- చొప్పున నగదు బహుమతులు పంపగలం. పాఠకుల పరిశీలనా శక్తిని, రచనాసక్తిని పెంచే లక్ష్యంతో ఏర్పాటుచేసిన ఈ సమీక్షా రచనలో పాల్గొని ఈ అవకాశాన్ని సద్వినియోగం చేసుకోగోరుతున్నాం.

'చతుర'లో ప్రచురించే చిత్రాలు, ఫొటోలు, చతుర ప్రపంచం, కథలు, ఫీచర్ల వంటి ఇతర అంశాల పట్లకూడా పాఠకులు తమ అభిప్రాయాలను విడిగా రాసి పంపగోరుతున్నాం. ఉపయోగకరమైన అభిప్రాయాలు వచ్చిన సందర్భాల్లో ప్రత్యేకంగా బహుమతులు ఇవ్వదలిచాం.

## కూపన్

ఏప్రిల్ 'చతుర' నవల: నిజానికీ అబద్ధానికీ మధ్య

సమీక్షకుని పేరు: ..............................................

చిరునామా: ..............................................

..............................................

..............................................

# చతుర కథలు



## టోకరా

**లో**కల్ షటిల్‌ట్రయిన్ కాబట్టి కంపార్ట్‌మెంట్‌లో ప్రయాణికులు అంతగాలేరు. ఉన్న కొద్దిమందీ రెండవ, మూడవ స్టేషన్‌లలోనే దిగిపోయారు.

ప్రస్తుతం కూపేలో ఆమె, నేను మాత్రమే ఉన్నాం. ఆమె ఉన్నట్లుండి కిందికివంగి ఏదో తీయటం గమనించాను. అయినా, దాని గురించి పెద్దగా పట్టించుకోలేదు.

కాసేపాగి ఆమె అంది.

“ప్లీజ్- ఎవరికీ చెప్పకండి. మీకు సగం, నాకు సగం”

బహుశా నేను తనను గమనించి ఉంటానని అపోహపడివుంటుంది. అందుకే భాగస్వామ్యానికి వస్తోంది. అదృష్టం తలుపు తట్టి మరీ రావటమంటే ఇదే అనుకుంటా నాలో నేనే సంతోషపడ్డాను.

“చెప్పనుగానీ అదేమిటో ఒకసారి ఇలా ఇస్తావా?” అని అడిగాను. ఆమె అనుమానంగా చూస్తూ నా చేతికి ఇచ్చింది ఆవనువు ముద్ద లాంటిదాన్ని.

నాకు మూర్ఛ వచ్చినంత వనయింది- అది బంగారం ముద్ద!

కనీసం పది తులాలైనా వుంటుంది. ఏ దురదృష్టవంతుడు పోగొట్టుకున్నాడో?

“అయ్యో పాపం, ఎవరు పారేసుకున్నారో” అంటూ మొసలి కన్నీరు కార్చాను. లోలోన అయిదు తులాలు అప్పనంగా లభించిందని ఆనందిస్తూనే.

“మీరు ఎక్కడికి వెళ్తున్నారు?” అడిగాను ఆమెను.

చెప్పిందామె.

“అలాగా... మరి దీనిని పంచుకోవడం ఎలా?” అన్నాను నేను.

“ఏమో- నాకేం తెలును? మీరే ఆలోచించండి. ఏంచేసినా వెంటనే చేసేయాలి. వస్తువు పోయినవాళ్ళు ఈ పాటికి పోలీస్ కంప్లైంట్ ఇచ్చే ఉంటారు. మనం దీనిని వెంటనే అమ్మటానికి కూడా వీలవదు” అంది.



అదీ నిజమే. ఈ బంగారపు ముద్దని కొన్నాళ్ళుగా దాచి ఉంచి ఆ తర్వాతే అమ్మకానికి పెడితే బావుంటుంది.

ఇందులో నగం ఆమెకి, నగం నాకు చెందుతుంది. ఆమాటే అన్నాను ఆమెతో.

"మీ మెడలో గొలుసు ఎన్నితులాలు?" అందామె. నేను గబుక్కున చెప్పేయబోయి ఆగాను ఓ ఆలోచన తళుక్కున మెరవడంతో.

"అయిదు తులాలు" చెప్పాను. వాస్తవానికి అది మూడు తులాలే అయినప్పటికి.

"నిజంగానా?" అనుమానంగా అందామె.

"నిజంగానే" నొక్కి చెప్పాను.

"అయితే, ఈ బంగారం ముద్ద మీ దగ్గర ఉంచుకొని, నాకు ఆ గొలును ఇచ్చేయండి. వచ్చేస్టేషనే నాది" అంది.

నా ఆలోచన కూడా అదే. నా మెడలో చెయిన్ ఇచ్చేసి ఈమెను వదిలించుకుంటే నాకు మరో రెండుతులాలు అదనంగా లభిస్తుంది మొత్తంమీద ఏడుతులాలు లాభం. "సరే. తీసుకోండి. నేను మరొకటి చేయించుకుంటాను" అంటూ మెడలో గొలును తీసి ఆమెకి ఇచ్చేసాను.

"జాగ్రత్తండి. బహుశా ముందు స్టేషన్లలో ట్రయిన్లో ఆ బంగారంకోసం సెర్చ్ ఉంటుందేమో" అంది ఆమె.

"మరేం భయంలేదండి" అన్నానేను తేలికగా.

ట్రెయిన్ ఆగటం, ఆమె దిగిపోవటం జరిగిపోయింది.

నా అదృష్టానికి ఉప్పొంగిపోతూ ఉషారుగా ఈలవేసుకుంటున్న సమయంలో ఓ పోలీస్ వచ్చారు నా కంపార్ట్మెంట్లోకి.

అతను నా ఎదురుగానే కూర్చున్నారు. రైలు కదిలాక అన్నారు.

"గత రెండు నెలలుగా ఓ పదహారేళ్ల అమ్మాయి బంగారం అంటూ రోల్డుగోల్డు అంటగట్టి డబ్బుచేసుకుంటోంది. లేదా అదిచ్చి అసలు బంగారం అతితెలివిగా కాజేస్తోంది. మీకు అలాంటిపిల్ల ఎదురైతే వదలకుండా వెంటనే మాకు తెలపండేం" అన్నారు.

నా గుండె ఒక క్షణం లయతప్పింది!!!

–కొల్లిమల్ల అప్పారావు,

# అభిమాని

డిగ్రీ పూర్తయినప్పటినుంచీ ఏమీ తోచటంలేదు. ఏం చెయ్యాలో తెగ ఆలోచించింది మంజీర.

లైబ్రరీకి వెళ్ళి దిన, వార, పక్ష, మాసపత్రికలు తిరగేస్తూండగా...








ఓ రోజు వారపత్రిక తిరగేస్తుంటే

ఓ ఫొటో మంజీరని ఆకర్షించింది.

ఇరవై సంవత్సరాల యువకుడి ఫొటోఅది. అతని కథ బహుమతి అందుకున్న సందర్భంగా పరిచయంతోసహా అది ప్రచురించారు. పేరు వీరవెంకట నటరాజ్.

బ్రహ్మచారో కాదో అని వెతికితే బ్రహ్మచారేనని తేలింది. ఇంకేం... యుద్ధప్రాతిపదిక మీద నటరాజ్‌కి ఓ ఉత్తరం అర్జంట్‌గా రాసింది.

"నటరాజ్‌గారికి!

మీ అభిమాని మంజీర నమస్కారాలు.

మీ కథ 'కలకంఠి కన్నులు' చాలా బావుంది. ఇంతవరకూ మీరు రాసిన ముప్పై కథల్లోనూ నాకు బాగా నచ్చిన కథ ఇది.

మీ రచనల్ని చాలా క్లోజ్‌గా ఫాలో అవుతాను. మీరంటే నాకు అంతటి అభిమానం.
మీ మంజీర"
-అని రాసి, చివర్న చిరునామా కూడా యిచ్చింది.

అందుమీదట మంజీరకి ఓ ఉత్తరం రాసాడు నటరాజ్. రచయిత నుంచి ఉత్తరం రావడం చాలా ఆనందాన్నిచ్చింది మంజీరకి. ఇంకేం, మరోలేఖ రాసింది...దానికి జవాబు రాగానే మరొకటి...అతని నుంచి... ఆమె నుంచి...అలా దొంతర్లుగా, దస్త్రాలుగా ఎన్నెన్నో లేఖలు. చివరికి, వెంకటేశ్వరస్వామి గుడి దగ్గరకి రమ్మని తేదీ,టైం సూచిస్తూ మంజీరకి సందేశం పంపాడు నటరాజ్.

అలాగే వెళ్ళింది మంజీర.

ఆ కబుర్లు, ఈ కబుర్లూ అయ్యాక-

"మంజీరా... నిన్ను పెళ్ళిచేసుకుందామనుకుంటున్నాను. నీకు సమ్మతమేనా?" అనడిగేడు గుడి ప్రాంగణంలో పచ్చికమీద కూర్చున్న నటరాజ్.

మంజీరకి ఏం చెప్పాలో తోచలేదు.

మౌనాన్ని ఆశ్రయించింది.

మౌనం అర్థంగీకారం!

★ ★ ★

"మన పెళ్ళయ్యాక నా కథలు చాలా పబ్లిష్ అయ్యాయి కదా...నువ్వేమీ విమర్శించవేం మంజీరా? ఇదివరకయితే బావుందనో బావులేదనో చెప్పేదానివి కదూ"— అనుమానం వెలిబుచ్చాడు నటరాజ్.

"నేను మీ కథల్ని ఎప్పుడూ చదవలేదు. ఊరకే ఉత్తరాలు రాసేదాన్ని... అది నా హాబీ" అంది మంజీర. నటరాజ్ ముఖంలో నెత్తురు చుక్కలేదు.

## సమాప్తి

నిజానికి భార్యాభర్తలు ఉద్యోగస్తులు కావడంకన్నా మంచి అదృష్టం యింకొకటుంది

ఇద్దరూ ఒకే ఆఫీస్‌లో పనిచెయ్యడం.

అలాంటి అదృష్టమే మాల్యద, చక్రపాణి లది. చాలామంది ఉద్యోగంచేసే దంపతులకి లేని అదృష్టం వారిని వరించింది. వీరిద్దరూ ఒకే ఆఫీస్‌లోనేకాక ఒకే సెక్షన్లో ఉద్యోగస్తులు.

ఓ రోజు

ఒంట్లో కాస్త నలతగా ఉందని చెప్పింది మాల్యద.

ఆమెని చక్రపాణి లేడీడాక్టరు దగ్గరకి తీసుకువెళ్ళాడు.

చెకప్ పూర్తయ్యాక కర్టెన్‌స్టాండ్ వెనక నుంచి ముసిముసి నవ్వులు నవ్వుతూ వచ్చింది మాల్యద.

డాక్టర్ చేతుల్ని నేప్‌కిన్‌కి తుడుచుకుని కుర్చీలో కూర్చుంటూ

"కంగ్రాట్స్ మిస్టర్ చక్రపాణి... మీకు ప్రమోషన్ వచ్చింది" అంది.

"ఏం ప్రమోషన్‌లెద్దురూ...ఖుబాస్ ప్రమోషన్ యిచ్చేలా కనిపించట్లేదు. ఆ శాస్త్రిగాడికి గానీ యిస్తాడేమోనని ఆఫీస్‌లో అందరూ అనుకుంటున్నారు" అన్నాడు చక్రపాణి. అతనికి కొంచెంసేపటివరకూ ఏ విషయమూ బుర్రలో వెలిగిచావదు.

"ఆఫీస్‌లో ప్రమోషన్‌కాదు చక్రపాణిగారూ...ఇంట్లో! మీరు తండ్రి కాబోతున్నారు" అడ్డదార్లో చెప్తే అర్థంకాదని డైరెక్ట్‌గానే చెప్పేసింది డాక్టర్.

చక్రపాణి ముఖంలో ఆనందం తొణికిసలాడింది. అతడి సంతోషానికి పగ్గాల్లేవు.

అది చూసి మాల్యద సిగ్గులమొగ్గ అయింది.

"థాంక్స్ డాక్టర్"— చక్రపాణి కంఠం నిండా ఆనందమే!

★ ★ ★

మొదటి కాన్పు కావడం మూలాన మాల్యద కాన్పుకి పుట్టింటికే వెళ్ళింది.

నెలలు నిండాయి.

డాక్టర్ డేట్ యిచ్చిన మరునాడే చక్రపాణికి టెలిగ్రామ్ వచ్చింది మాల్యద ఆడపిల్లని కన్నదని.

★ ★ ★

పాపని 'చిల్డ్రన్స్‌కేర్'లో ఉంచి డ్యూటీకి వెళ్ళేది మాల్యద.

మెటర్నిటీ లీవ్‌లో మాల్యదకి రావలసిన ఎలవెన్స్‌లన్నీ వచ్చాయి- దాదాపు పదిహేను వందల రూపాయలు! ఆ డబ్బు పెట్టి పాపకి కావలసినవన్నీ కొనేసింది మాల్యద.

ఓ రోజు

మాల్యద పేరున ఆఫీస్‌లో ఓ మెమో వచ్చింది.

"మీకు పదిహేనువందల రూపాయలు మెటర్నిటీ ఎలవెన్స్‌గా ఇచ్చాము. కానీ అసలు





మీకు వివాహం అయినట్టుగా ఆఫీస్ రికార్డ్‌లో ఏ ఆధారాలూ లేనందున మీకిచ్చిన మొత్తం తిరిగి చెల్లించవలసింది. నిజంగా వివాహం జరిగి ఉంటే సాక్ష్యాధారాల్తో అఫిడవిట్ దాఖలు చేయవలసింది''

ఆ దంపతుల ముఖాల్లో రంగులు మారాయి.

– గోవరాజు రాధాకృష్ణ

## డిస్కోవాచ్

హీరోయిన్ చీకట్లో వంటరిగా వెళ్తోంది. వెనకాల ఆ ముగ్గురు దుండగులూ ఆమెను వెంటాడుతున్నారు. హీరోయిన్ నడకలో వేగం పెంచింది. తక్షణం ఆ విలన్ల నడకలో వేగం కూడా పెరిగింది. అది గమనించి హీరోయిన్ పరుగు లంకించుకుంది. దుండగులు కూడా పరుగులంకించుకున్నారు...టక్‌టక్‌టక్టక్టక్... భయంకరమైన మ్యూజిక్. దుండగులు హీరోయిన్‌ని చుట్టిముట్టారు... వెంటనే ఓ వెలుగు రేఖ హీరోయిన్ ఫేస్‌పై వాలింది. హీరోయిన్ పెదాలపై ఎట్టిటిరంగు నవ్వుతూ కనబడింది. ఆ వెలుగులో ఓ పక్క చిన్నగా పాట వినబడ సాగింది 'డిస్కోవాచ్...డిస్కోవాచ్...'' అంటూ.

హీరో యజ్‌డీ మీద వచ్చి ఎడం చేత్తో ఒక్కోదుండగుడి బుగ్గ మీద ఒక్కొటిచ్చాడు...దారిలో. దుండగులందరు పారిపోయారు. హీరో వారితో ఫైట్ చేస్తున్నప్పుడు అతడి ఎడంచేతికున్న 'డిస్కోవాచ్'ని క్లియర్‌గా చూపించారు బ్యాక్‌గ్రౌండ్ మ్యూజిక్ చాలా కమ్మగా

దాని తరువాత హీరోహీరోయిన్‌ని పెళ్లి చేసుకొని అంటాడు...'మా వివాహనికి కారణం ''డిస్కోవాచ్'' అని తరువాత ఇద్దరూ.చేతులు కలుపుకుంటారు. ఆ ఇద్దరి చేతులకి ''డిస్కోవాచ్'' ధగధగ మెరిసిపోతూ కనబడుతుంది....

ఆ ఎడ్వర్‌టైజ్‌మెంటు చూస్తున్నాడు గిరి. అతడికి ఓ పక్క నవ్వు... మరోపక్క దుఃఖము రాసాగాయి. అంతలో గిరి పక్కనున్న ప్రేక్షకుడు గిరిని అడిగాడు-

''ఏవండీ...ఆవాచ్‌లో అంతటి శక్తి వుంటుందాండీ''

''వుండొచ్చండీ'' గిరి అన్నాడు.

''ఎలా అంటారు?''

''మరి నాకీ పిక్చర్ చూడటానికి టికెట్ దొరికింది కదండీ''

అతడికి సరిగా బోధపడలేదు.

''నాది కూడా డిస్కోవాచే అండీ...అందుకే అంతరష్‌లో కూడా నాకు టికెట్ దొరికింది...''

అతడు గిరి చేతులవంక చూసాడు.

''మీ చేతికస్సలు వాచీ యే లేదుకదండీ...''

గిరి జేబులోనుంచి ఓ వాచీ తీసి చూపించాడు.

''ఇదేంటండీ...ఇది ముక్కలైపోయి ఉందే...''

''అవునండీ జనం తోపులాటలో క్రిందపడి ముక్కలైయ్యింది...మరి ''డిస్కోవాచ్'' కదండీ...''

# వచ్చే నెలలోనే...




"పెళ్ళి విషయంలో కూడా మీరింత ఔదార్యం చూపించకూడదూ... వాళ్ళు అడిగిన కట్నం మొహాన పారేస్తే మనపిల్ల సుఖపడుతుంది. అల్లుడు మనం చెప్పినట్లు వింటాడు" అందామె.

"చివరికి వరుళ్ళని బిచ్చగాళ్ళతో పోలుస్తున్నావన్నమాట. ఎంత చులకన చేస్తున్నావ్..." అన్నాడతను.

"వరుళ్ళు బిచ్చగాళ్ళుకాక మరేమిటి? ఎటొచ్చీ వీళ్ళు చదువుకొని, సంస్కారంతో బిచ్చం అడుగుతున్నారు కట్నాన్ని. వాళ్ళు గతిలేక పొట్టకోసం యాచిస్తున్నారు. అది రోడ్డుమీద... ఇది ఇంట్లో... అంతే తేడా! ఆ మాటకొస్తే మీ ఉద్యోగులు జీతాలు, డి.ఏ.లు, బోనసు కోసం ప్రభుత్వాన్ని యాచించటంలేదూ, నాయకులు కూడా ఓట్లను విదిలించమని భిక్షాటనకు బయల్దేరతారుగదా" అంటూ పంచాంగం విప్పిందామె. చికాకు పడ్డాడతను.

మధ్యతరగతి మానవుల సహజ కుటుంబ వాతావరణానికి ప్రతిబింబంగా భమిడి వెంకటేశ్వర్లు రచన 'పరాజితుడు'

## మే సంచిక చతుర లో చదవండి

Edited, Printed and Published by Ramoji Rao for Vasundhara Publications Printed at Colorama Printers Private Limited, 7-1-19, Begumpet, Hyderabad-500 016, TEL: 229428
CHATURA Telugu Monthly, Eenadu Compound, Hyderabad-500 482.

# సాలిడైర్ శ్రేష్ఠత



## ఇప్పుడు అంతర్జాతీయ గుర్తింపు పొందింది




యుగోస్లోవియా మరియు తూర్పు యూరోప్ ప్రాంతాలకు ఎగుమతి చేయడానికి, సాలిడైర్ సిఎటి 1000 డిఎక్స్‌కి మంచి అవకాశం లభించింది. ఇది కేవలం ఒక ఆరంభము. ఇలాంటి ఎన్నో మంచి అవకాశాల భవిష్యత్తులో లభిస్తుంది.

ప్రస్తుతం భారతదేశంలో ఎక్కువ మందిని ఆకర్షిస్తున్న సాలిడైర్ సిఎటి 1000 డిఎక్స్ డీలక్స్ కలర్ టి.వి త్వరలో విదేశాలలోకూడా ఎక్కువ మందిని ఆకర్షించగలదు.

# సాలిడైర్

